# రసికజనమనోభిరామము.

కవిసార్వభౌమ

కూచిమంచి - తిమ్మకవిప్రణీతము.

బ్రహ్మశ్రీ

శతావధాని పురాణం, సూర్యనారాయణతీర్థులవారిచేఁ

బరిష్కృతము.

వావిళ్ల - రామస్వామి శాస్త్రులు

అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

Madras:

INDIA STEAM PRINTING WORKS.

Rs. 0-8-0] 1910. 

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# రసికజనమనోభిరామము.

## పీ ఠి క.

శ్రీ మీఱం దనపెండ్లివేళ నొడలం • జెన్నారుభూషామణి
స్తోమంబుం బొడగాంచి శైలసుత చే•తోవీథిఁ గంపింపఁ ద
ద్భామారత్నము కొప్పు బర్హ మని యు•ప్పాము ల్దల ల్వంప న
త్యామోదంబున నవ్వు శంభుఁ డిడు మా • కత్యంతసౌఖ్యోన్నతుల్. 1

సీ. చిన్నారిజాబిల్లి • నేసక్రొవ్వేదపువ్వు, మెట్టరాచబిడారు • పుట్టినిల్లు
మగనిసామేను నే•మపుటొలగపుమిద్దె, కలుములజవరాలు • చెలిమిబోటి
తెలిగంటికల్కి—ము•ద్దియ లాడిగపుఁజెలు, ల్క—డిఁదిబొబ్బ మెకంబు • కత్తలాని
యాము లేనుఁగు మోము•సామిముద్దులపట్టి, జక్క—రవిరిబోఁడి • సవతిమిన్న
తే. గాఁగ జగములు గడితంపుఁ•గనికరంపు, పెంపు రాణింప నెపుడుఁ బా•లింపుచుండు
సర్వమంగళ మాకు న•ఖర్వసర్వ, మంగళావాప్తి నొదఁగూర్చి • మనుచుఁ గాత. 2
చ. పొలుపుగ గొల్లక్రొందలిరుఁ•బోఁడులకుల్క—మిటారిగబ్బిగు
బ్బలు బలువెన్నముద్ద లని • భావమునం దలపోసి డాసి కం
చెల వెడలించి మాటికిని • జేతుల నొక్కుచు హెంతకారి యై
యలఁతిగ నవ్వువెన్నుఁడు ద•యామతి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్. 3
మ. దివిషద్రాజముఖీలలామఫలకో•త్కీర్ణస్ఫురత్కుంకుమ
ద్రవలాక్షారుణితాంఘ్రిపద్మ యగుచు • న్రాణించునప్పద్మభూ
భువనోత్కృష్టమహాప్రబంధఘటనా•పూర్జైకసామ్రాజ్యవై
భవ మెల్లప్పుడు మా కొసంగి యనుకం•పాలీలలం బ్రోవుతన్. 4
మ. నలుమోము ల్దన కబ్బి యుండుటకు నా•నందంబుతో నొలిమైఁ
బలుకుందొయ్యలి చెక్కులుం బెదవియుం • ఫాలంబుఁ జుంబించి చే

తులవెంట న్వలిగబ్బిగుబ్బచనుబం•తు ల్పట్టి క్రీడాకళా
కలన న్మించువిరించి మా కొసఁగు సా•కల్యాయురారోగ్యముల్. 5

సీ. అమరశిరఃకిరీ•టాంచలమణివిభా, నీరాజితాంఘ్రి యే•సారసాక్షి
కుందేందుమందార•చందనఘనసార, నీహారవర్ణ యే•మోహనాంగి
హేమాబ్జకబళనో•ద్దామమత్తమరాళ, ఘోటకారోహ యే•బోటిమిన్న
వరదండపుస్తక•వల్లకీశుకరాజ, రాజత్కరాబ్జ యే•రాజవదన
తే. యమ్మహావాణి పికవాణి • యజునిరాణి, సైకతశ్రోణి మదచంచ•రీకవేణి
పరమకల్యాణి కిసలయ•పాణి మాకు, మంజువాగ్గుంభన లొసంగి • మనుచుఁ గాత. 6

మ. ప్రమథాధీశశిరోగ్రభాగవిలస•త్ప్రాలేయరుక్ఖండముం
బ్రమదం బొప్పఁగఁ జూచి మోదకముగా • భావించి యంచత్కరా
గ్రము వే చాఁచి కడంకతోడఁ దివియం • గామించి మే లెంచు దం
తిముఖుం డెప్పుడుఁ బ్రోచు మత్కృతి దయా•ర్ద్రీభూతచిత్తంబునన్. 7

మ. చిరభక్తిప్రతిభావిభాసితుఁడనై • చింతింతు నశ్రాంతముం
బరవాదిప్రమదద్విపేంద్రపటలీ•పంచాననశ్రేష్ఠు బం
ధురతేజోనిధి దెందులూరికులపా•థోరాశిరాకానిశా
కరుని న్లింగయసద్గురూత్తముని సా•క్షాచ్చంద్రచూడాకృతిన్. 8

సీ. గురుతరకౌండిన్య•గోత్రవిఖ్యాతుండు, బయ్యనామాత్యుఁ డే•ప్రభునితాత
నిరతాన్నదానవ•ర్ణితయశస్సాంద్రుండు, తిమ్మనసచివుఁ డే•ధీరుతండ్రి
ఘనులు జగ్గనయు సిం•గనయు మంత్రియు నర, సనయును నేధన్యు•ననుజవరులు
తిమ్మయాఖ్యుఁడ నేఁ బ్ర•థితులు సింగనయు జగ్గనయు సూరనయు నే•యనఘసుతుల
తే. మతులమతి రాజమాంబ యే•యధిపుజనని, యతిపతివ్రత లక్ష్మి యే•చతురురాణి
యట్టి శ్రీకూచిమంచివం•శాబ్ధిచంద్రు, మజ్జనకు గంగనామాత్యు • మదిఁ దలంతు. 9

మ. తనరార న్నుతి సేతు సేతుహిమవ•ద్గంగాస్తశైలాంతరా
వనిభాగావిరతప్రసిద్ధకవివి•ద్వన్మాగధేంద్రాదియా
చనకానీకనిరంతరప్రణుతభా•స్వద్దానవిద్యాపరా
యణు భూభృజ్జనపూజ్యు మజ్జనకు గం•గామాత్యచూడామణిన్. 10

చ. మనమునఁ బ్రస్తుతింతు బుధ•మాన్యుల ధన్యుల జగ్గనార్యసిం
గనసరసప్రధానవిది•తాఖ్యుల మంత్రికులేంద్రముఖ్యులన్
ధనదసఖాంఘ్రిభక్తిసము•దంచితచిత్తుల సాధువృత్తులన్

జనవినుతోన్న దానగుణ•సంతతభవ్యుల మత్పితృవ్యులన్. 11

మ. కవిచూడామణుల న్మహోఘనుల వే•డ్కం గొల్తు వల్మీకసం
భవు వ్యాసు న్జయదేవు భోజనృపతి • న్బాణు న్మయూరాహ్వయున్
శివభద్రార్యుని గాళిదాసుకవిన్ • శ్రీహర్షుని న్మాఘు భా
రవిఁ జోరు న్భవభూతి మల్హణుని వా•క్ప్రాచర్యసంసిద్ధికిన్. 12

సీ. బహుముఖవక్త్రయై • పరఁగుకుండలినాథు, నఖిలకళాధాముఁ • డైనసోముఁ
బరజయోన్నతి నెన్నఁ•బడువీరభద్రుని, సర్వజ్ఞతాగుణ•శాలి భీముఁ
జతురాస్యు వాగను•శాసను విబుధప్ర, కరముఖ్యు నమరేశుఁ • బురుషసింహుఁ
డనఁ దగుశ్రీనాథు • ఘనమార్గవర్తియై, కరము వెలుంగుభా•స్కరబుధేంద్రు
తే. సతతలోకేశ్వరప్రపూ•జితనితాంత, రాజమానప్రభావుని • రంగనాథు
మఱియు నాంధ్రకవిత్వని•ర్మాణకుశలు, లగుమహాకవివర్యుల • నభినుతింతు. 13

తే. భంగమున దాఁగి పంకంబు•పాల లోఁగి
సరసులకుఁ గాక యెఱుకలు • సడల నెఱసు
లేఱుచు జడాశయంబుల • నెపుడు మెలఁగు
కుకవినికురుంబముల లెక్కఁ • గొనఁగ నేల. 14

సీ. అన్యపదార్థాప•హరణప్రవీణులు, సమధికసుశ్లోక•విముఖమతులు
గురువర్ణ లఘువర్ణ•పరిశోధనాజ్ఞులు, సదమలసాధుల•క్షణరహితులు
చిరతరఘనసుఖ•శ్రేయోవిదూరులు, ప్రతిపదాత్యంతకు•వాదరతులు
సంతతసమధిక•సమతప్రకంపితు, లతితరదుర్వృత్త•యుతులు నైన
తే. ధూర్తకవిరాజుల కొకింతఁ • దొలఁగ వలయు, నఖిలదిగ్దేశనృపసభా•ఖ్యాతపూత
భారతీలబ్ధకవితావి•భాసమాన, సారసామ్రాజ్యఖని యైన•సజ్జనుండు. 15

సీ. బహుపురాణములు ప్ర•బంధము ల్లక్షణ, శాస్త్రము ల్వివిధకో•శములు నాట
కము లలంకారశా•స్త్రములును శోధించి, ప్రౌఢిమై నేతత్ప్ర•బంధ మే నొ
నర్చెద నిందులో•న నొకించుకొక్కెడఁ, బరికింప నెఱసులు • దొరలి యున్న
నెన్నిక సేయక • హితకరుణామతిఁ, గనుఁగొని సారంబె • కైకొనుండు
తే. మంచితేనియ జనులు వే•మఱు కడంక, నరసి వడపోసి యునిచిన• నందులోన
నలుసు లొకకొన్ని యందందఁ•గలుగకున్నె, భవ్యమతులార కవిబుధ•ప్రవరులార.

సీ. వళులయొప్పిదమున • వఱలునాళయమ్మృదు, పదవిభ్రమంబుల • బాగు మీఱి
కలితచంపకమాలి•కాసుకాంతిశ్రీల, సరసిజముఖవికా•సములఁ దనరి

మహితచమత్కృతియా మధురవాగ్రచనల, శుభలక్షణారూఢి సొం పెసంగి
ప్రవిమలశృంగార భావగౌరవమునఁ, గన దలంకారవైఖరులఁ జెలఁగి
తే. ప్రబలుమత్కావ్యకన్యకారత్న మఖిల, రసికజనసంతతమనోభిరామ మగుచు
నిండుకొనుతీవి నిర్ధరామండలమున, నసదృశవిలాసలీలల నలరుఁ గాత. 17

వ. అని నిఖిలదేవతాప్రణతియు గురుచరణస్మరణంబును పితృపితృవ్యస్తోత్రంబును బురాతనమహాకవివర్ణనంబును గుకవినిరాకరణంబును నాధునికసుకవివిద్వత్ప్రార్థనంబునుం గావించి యష్టాదశాధికవర్ణనాన్వితం బగునొక్క మహాప్రబంధంబు నొనర్పఁ బూని యున్న సమయంబున. 18

సీ. పరిపరికీలుకర్బురపురక్షణునుఁ డ, గ్రగశాపటీకజూహురాణవత్త
పరవిపిండీవృషపదకదంబుఁడు మహా, కులకశయాలీనగురుకలాపుఁ
డద్రిదారకసముద్యద్విస్మయవిదారి, నాగప్రహాధసమున్నతతురంబుఁ
డవిరలచంద్రమయాగారగానుఁడు, రీక్షసానారతప్రియసచివుఁడు
తే. భద్రఖింఛోళుఁ డాశ్రితశూద్రధరుఁడు
నిగమరథ్యామృగుఁడు పీఠనిగమకులుఁడు
పత్రిహారేట్సమాహ్వయప్రభుఁడు నాదు
స్వప్నమున నొక్కనాఁడు సాక్షాత్కరించె. 19

తే. అట్లు సాక్షాత్కరించి మహాత్ముఁ డైన
పిఠపురీకుక్కుటేశ్వరాభిఖ్యసాంబ
శివుఁడు నిస్తులకరుణార్ద్రచిత్తుఁ డగుచు
నింపు దళుకొత్త ననుఁ జూచి యిట్టు లనియె. 20

సీ. ప్రతిభమై రుక్మిణీపరిణయంబును సింహ, శైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసంబును, నచ్చతెనుంగురామాయణంబు
సారంగధరనృపచరితంబు సాగర, సంగమాహాత్మ్యంబు రంగు మీఱు
సకలలక్షణసారసంగ్రహంబు నొనర్చి, కృతులు మాపేర నంకితము చేసి
తే. నట్టిప్రోడవు నీ విపు డలఘుమతిని, రహి నొనర్పఁగఁ బూనినరసికజనమ
నోభిరామముఁ గృతిసేయు మలర మాకు, దిమ్మకవిరాయ సకలసుధీవిధేయ.

క. నరవరు లిడుమణిభూషా, కరితురగాందోళికాదిఘనవిభవము ల
స్థిరము లవేటికి నింకే, నిరవుగ నిహపరసుఖంబు లిడియెదఁ జుమ్మీ. 22

వ. అని యాన తిచ్చి యప్పరమేశ్వరుం డంతర్హితుం డగుటయు నేను నమందానందకం

దళితహృదయారవిందుండ నై యమ్మహాదేవునకు నిమ్మహాప్రబంధంబుఁ గృతి సేయ నిశ్చయించి. 23

సీ. నిఖిలవిద్యాభ్యాస•నిపుణుఁడు మత్సహో, దరుఁ డగుజగ్గన•త్కవితనయులు
ఘనులు తిమ్మనయు సిం•గనయును లేఖక, పాఠకు లై కృతు • ల్వ్రిబలఁ జేయఁ
బేర్మిఁ గాంచినవాఁడఁ • బీరపురప్రాజ్య, రాజ్యాధిపత్యవి•రాజమాన
భూరివైభవుఁడు న•దృుతపరాక్రముఁడును, దానకళాధురం•ధరుఁడు నైన
తే. రావునీలాద్రిమాధవ•రాయనృపతి, చేతఁ గవిసార్వభౌమవి•ఖ్యాతబిరుద
మందినఘనుండఁ దిమ్మయా•హ్వయుఁడ నేను, విమలతరభక్తి మదిలోన • విస్తరిల్ల.

## షష్ఠ్యంతములు.

క. శ్రీదునకు సకలముదిత, శ్రీదునకు నితాంతభృంగి•రిటిపటునటనా
మోదునకు నిగమసంస్తుత, పాదునకు హృతాఖిలాఘ•భవఖేదునకున్. 25

క. భర్గునకు దళితపురభట, వర్గునకుఁ బ్రకీలితాప•వర్గునకు లస
న్మార్గునకుఁ జిరకృపార్ద్రిని, సర్గునకు నితాంతసుగుణ•సంసర్గునకున్. 26

క. శంభునకు జితగజాసుర, డంభునకు సమస్తబుధవి•తానావనసం
రంభునకు దానవిద్యా, రంభునకుఁ బ్రహృష్టమాని•రాడ్డింభునకున్. 27

క. భీమునకు రజతభూధర, ధామునకు సుధాంశుకోటి•ధామునకు మహో
ద్దామునకు శ్రితజనావన, కామునకు హృతోగ్రపాత•కస్తోమునకున్. 28

క. శర్వునకు సతతముదితసు, పర్వునకు సమస్తభువన•పావనలీలా
ఖర్వునకు దళితదుర్జన, గర్వునకు మహోక్షరాజ•గంధర్వునకున్. 29

క. స్థాణునకు సతతపరిచిత, బాణునకు సరోరుహాక్ష•బాణునకు జగ
త్త్రాణునకు హృతకృతాంత, ప్రాణునకతిసత్యవాక్య•పరిమాణునకున్. 30

క. భవునకు నిరుపమశుభవై, భవునకు సంఘటితసకల•భువన కురుప్రా
భవునకుఁ గృతపరిపరిపరి, భవునకు భవునకు నిరస్త•భావభవునకున్. 31

క. రంగజ్జటాగ్రవిలస, ద్గంగాప్రాలేయఘృణికి • ఘనవితరణి కు
త్తుంగగుణమణికిఁ గుక్కుటలింగప్రభుమణికిఁ గుండ•లీకృతఫణికిన్. 32

ఆ. అర్పణముగ నమ్మ•హాదేవుకృప నే న, నూనలీలఁ గూర్పఁ • బూనినట్టి
రసికజనమనోభి•రామం బ[illegible]గథావిధాన • మెట్లు లనిన. 33

## కథాప్రారంభము.

క. మును నారదమునివరునకు, మునుకొని పుణ్యేతిహాస • ములు నలువ దగన్
వినుపించుచుండి యొకకథ, యొనసినకృపఁ దెలుపఁ బూని • యి ట్లని పలికెన్.

శా. చంచత్కాంచనసౌధభాగలసిత • శ్యామాశుభాంగప్రభా
భ్యంచద్విభ్రమచంచలాభ్రమకచా • భ్రభ్రాంతిలీలావల
త్కించిల్లాస్యకళావిలోలఫణిభు • క్కేకారవాక్రాంత మై
కాంచెన్ బేర్మిఁ బురోత్తమం బొక టిలం • గల్యాణనామంబునన్. 35

సీ. ప్రాకారములడంబు • పరిఘులచెలువంబు, వనములపెంపు జ • వ్వనులసొంపు
బావులఠీవి క • ప్రపుధూపములతావి, జగి లెలరంగు ర • చ్చలహొరంగు
గణికలయొప్పు బం • గరుమాడువులవిప్పు, గోపురంబులమించు • కోట్లసంచు
తేరులతీరు ము • త్తెపుఁబందిరులసౌరు, నగరులకల్మి యే • నుఁగులబల్మి
తే. కత్తలానులయేపు మే • ల్కట్లకోపు, మదురుగోడలమెఱపు వా • ల్మగలయొఱపు
తలుపుగమిపీలునిలువుట • ద్దములమేలు, దనర వెలుఁగొందు నాప్రోలు • ధరణియందు.

మ. పరిఘాంతర్విలసద్భుజంగయువతుల్ • ప్రాకారశృంగాగ్రవి
స్ఫురదస్వప్నవధూమణీజనులకున్ • శుభ్రారవిందంబు లం
పి రన న్మీఁదికి నేగు నంచ లమరీ • బింబోష్ఠ లింద్రోపలో
త్కరము ల్గ్రమ్మఱ వారి కంపి రన డి • గ్గం బాఱుఁ దేటుల్ పురిన్. 37

శా. తుండాగ్రంబులు చాఁచి యప్పురి మహో • త్తుంగద్విపేంద్రంబు లు
ద్గండప్రక్రియఁ గ్రీడ సేయుచు వియ • ద్గంగాసువర్ణాంబురు
క్కాండంబు ల్వికలించుచో సుమపరా • గంబు న్మది న్మేనులన్
నిండం బంగరుకాఁడల ట్లలరు ను • న్నిద్రప్రభాలీలలన్. 38

తే. అగము లుర్వీధరారాతి • యాపనులకుఁ, దలఁకి యప్పట్టణమునకు • వలసి వచ్చి
డాఁగి యుండినఁ జౌరులు • నాగము లని, క్రమ్మి యునిచిరి నాఁగనా • గములదవరు.

చ. తలఁపఁగ దక్షిణోత్తరప • దంబుల పద్ధతి నేగి యాఱు నా
ల్నెలలకుఁ గాని క్రమ్మఱఁగ • నేరక యేలిక నేట ముంచు ని
చ్చలు నిను తేరిమావు లని • సారెకుఁ గేరుచు దిక్కు లన్నియుం
గలయ నిమేషమాత్రమునఁ • గన్గొని వే మఱలుం బురాశ్వముల్. 40

చ. అనిలుఁడు లేడి నెక్కి జవ • మారఁగ నప్పురిమేల్గుఱాలతోఁ
బనివడి పందెము ల్చఱచి • పర్విడుచోటఁ గురంగ మెత్తి వై

చినచెలు వాయె నిప్పులుకు • సిద్ధము గా దని యాడినం బ్రకం
పనునకుఁ గేలు సొట్టు యని • పల్కుదురే కద లోకు లిద్ధరన్. 41

తే. నాలుగును వేయి వక్త్రంబు • లోలిఁ గలిగి
శ్రుతులు భాష్యంబు నడపుట • ప్రతిభ యనుచు
విధిఫణీంద్రుల నిరసించి • వేదశాస్త్ర
ములు వచింతు రొక్కొక్క రాఁప్రోలిద్విజులు. 42

సీ. బుధవత్సలులు కళా•పూర్ణులు పరచక్ర, హరణులు కువలయా•హ్లాదకరులు
వసుసమన్వితులు సం•ర్వజ్ఞశిరోమణుల్, శుభలక్షణులు పరి•శుద్ధమతులు
సహజలక్ష్మీప్రసం•స్తమితతమస్కులు, మండలప్రభులు సం•న్మార్గచరులు
మిత్రానుకూలురు • గోత్రాభ్యుదయులు నై, వాత్సకు లోషధీ•శ్వరులు సుప్ర
తే. సన్నతాభాస్వరులు పంక•జాతదళన, చతురు లతిశీతలప్రద•ర్శను లుదగ్ర
మోహనాకారరేఖాస•ముల్లసితులు, రాజు లలరుదు రప్పుర•రాజమునను. 43

తే. తనకుఁ దొమ్మిదిపాఁతలు • ద్ధనము గల దం,టంచు జక్కుల కేఁడు గ•ర్వించుఁ గాని
లెక్క యిడరానిరొక్కంబు • లీడు లేని, కొలువుగల వెన్న నవ్వీటి•కోమటులకు.

క. అద్రులు తేజంబున సమ, రాద్రులు దానమునఁ గాంచ•నాద్రులు ధృతి సౌ
భద్రులు బవరంబున బల, భద్రులు భుజశక్తి నందుఁ • బరఁగెదు శూద్రుల్. 45

సీ. తమగానములకు సం•తసిలి పున్నాగము, ల్ప్రస్ఫుటభోగిలో•లతఁ జెలంగఁ
దమవిహారముల కెం•తయు భూజనుల్ చొక్కు, సుమనోవికాసవి•స్ఫూర్తి నలరఁ
దమముఖాంభోజగం•ధములకు సరసాళు, లుప్పొంగి మదబుద్ధిఁ • గప్పుకొనఁగఁ
దమమణినూపుర•ధ్వనులకుఁ బరమహం, సలు సోలి మానసా•సక్తి దఱుమఁ
తే. దమమృదూక్తిసుధారస•ధారలకు న, శేషబుధపుంగవులు చెంతఁ • జేరి నిలువఁ
జెలువముల కెల్లఁ బుట్టిన•నెలవు లనఁగ, మెఱయుదురు ప్రోలఁబుణ్యభా•మినులులీల.

చ. అపరిమితానురాగమున • నప్పురిలోనిభుజంగుమిన్నలె
ల్లపుడు దినాంతవేళల హయ•య లెమ్మెఱయ న్విహరింతు రెంతయు
న్నుపణిగృహాంతరాగ్రమణి•నిర్మితకాంచనసాలభంజికా
లపనకపోలచుంబనక•ళావివశీకృతహృత్సరోజులై. 47

సీ. చామల కెందు నీ•సరసత గలదె తో, య్యలి యన పరియింపు • నిలిచి మూఁడు
పడఁతి నిన్నంటి వె•ల్వడము కోర్కె ఫలించె, నన రాజభోగమే • యతిశయిల్లు
నారగన్నను జిత్త • మలరెడిఁ జెలియన్న, మది కొప్పు గంటె వే•మఱుఁ జెలంగఁ

బలుకొట్టు చూపక • నిలు మింతే యనిన న, వ్వలఁ గంది కై సైగ • మొలఁపఁదగు నె
తే. యనుచుఁ దముఁ జేరి నెఱజాణ•తనము వెలయఁ
బలుకు నెలకోడెప్రాయంపుఁ•బాంథజనుల
కింపు దులకింప మాఱ్మాట • లిడుచు నుండ్రు
శాలిపాలీవధూటు లా•ప్రోలఁ జాల. 48

సీ. సరసిజంబులు సారె•సారెకు నెనయించి, యంబుజంబులు ప్రియం • బలరఁ జేర్చి
చంపకమాలిక • ల్సొంపెసంగ నమర్చి, విచికిల స్తబకము • ల్విస్తరించి
(యుత్పలమాలిక • లొఱపుగాఁ బొసఁగించి, కడుసుకేసరము ల•క్కఱఁ బెనంచి
లలి వెలయు సుపజా•తులు నాడెముగ నిల్పి, మఱియుఁ బే రగువన•మంజరులును
తే. గరము మెఱయించి సుకవుల•కరణిఁ బెక్కు-
చందముల నీటుఁ జూపుచు • సరసులను బ్ర
బంధలీలల నలరింత్రు • పటువిలాస
భాజనములందుఁ బుష్పలా•వీజనములు. 49

శా. వీట న్మాటి కసంగసంగరకళా•విక్లాంతకాంతామణీ
కోటీపీనపయోధరాగ్రవితతాం•కూరన్నిదాఘోదక
వ్యాటీకాపహృతిక్రియారభటిఁ బెం•పారుం బ్రభాతంబులం
బాటీరాచలకూటనిర్గతజగ•త్ప్రాణార్భకవ్రాతముల్. 50

చ. పనివడి పంట పైరులకు • బాళి మెయిం జనుచిల్కమూఁకలం
బనులకుఁ గ్రమ్మఱం దఱిమి•వైచు నుదంచితశాలిపాలికా
స్తనకలశద్వయీనిహిత•సాంకవగంధమలిమ్లుచత్వభా
గనిలకిశోరవారము ల•నారతము న్నగరాంతికంబునన్. 51

క. ఆనగరికి నధిపతి యై, యానగరిపుకరణి శివి • నలరుచు నుండన్
భూనుతుఁ డర్చిష్మంతుఁడు, నా నెసఁగు నృపాలవరుఁడు • నయతత్పరుఁ డై. 52

క. ఆరాజమణికుమారుఁడు, మారుఁడు సౌందర్యమునఁ గు•మారుఁడు కడిమిన్
సూరుఁడు తేజంబున ఫణి, హారుఁడు గరిమన్ ఋతుధ్వ•జాహ్వయుఁ డెన్నన్. 53

సీ. కాశకాశాధిపా•కాశధునీహార, నీహారకలశవా•ర్నిధులఁ దెగడి
సోమసోమామర•సామజతారకా, తారకాదంబబృం•దముల నవ్వి
చంద్రచంద్రాతప•చందనశారద, శారదాంభోదకే•సరులు నెన్ని
గోపగోపారదేం•దూపలసంతాన, సంతానఫేనవ•జ్రములఁ గేరి

తే. మీఱి తనకీర్తి జగముల • మెఱయ నలరె, నిఖిలభూభరణోదగ్ర•నిజభుజాగ్ర
జాగ్రదుగ్రమహామండ•లాగ్రదళిత, దుష్టనృపదుర్విభుజుండు బుక్క•తుద్భవుండు. 54

సీ. కమనీయకలధౌత•కాంతుల నిరసించి, ద్విజరాజనిబిడదీ•ధితుల నెంచి
జలజభవప్రభా•సముదయంబు జయించి, యమరవిద్రుమశోభ • నపహసించి
షణ్ముఖజనకభా•స్వద్విభావళి మించి, హంసమండలదీప్తి • నావరించి
చారుపయోజాత•భూరిద్యుతులఁ గాంచి, మంగళసద్రుచి • మహిమ వంచి
తే. తనసమంచితకీర్తిప్ర•తాపములు ది, గంతరంబుల వెలయ ను•దగ్రలీల
వఱలె నఖిలధరాధురా•వహనముదిత, కరికమఠకిరిగిరిహరీ•శ్వరుఁ డతండు 55

సీ. కువలయంబున కార్తి • గూర్పనియినుఁడు చ, క్రావళి నొంచక • యలరురాజు
గోత్రవైరము గూర్చు•కొననియింద్రుఁడు పుణ్య, జనులఁ గాఱింపని•చక్రవర్తి
పక్షపాతము లేక • పరఁగుచుండువిరాటు, పాడి దప్పనిప్రజా•పరివృఢుండు
కుజనులపొందు చే•కొననిధరాధిపుఁ, డుగ్రుఁ డై ప్రజఁ ద్రుంప•కుండు నీశుఁ
తే. డౌర యితఁ డని బుధజను • లభినుతింపఁ, వఱలెఁ దేజఃకళా వైభ•వప్రభావ
జవవచఃస్ఫూర్తి ధృతిమహై•శ్వర్యములను, విపులగుణపాళి యమ్మహా•నృపతిమౌళి.

సీ. చాంచల్యమబ్జలో•చనలమాఁపులయంద, కుటిలత సతులము•ంగురులయంద
కాఠిన్య మింతుల•గబ్బిగుబ్బలయంద, లేమి లేమలమధ్య•సీమలంద
బంధము ల్చందన•గంధులరతులంద, జడత ముద్దియల నె•న్నడలయంద
చిక్కులు మత్తకా•శినులహారములంద, పీడ చేడియలకెం•బెదవులంద
తే. కానిమఱి యెందు నేనియుఁ • గలుగకుండ, ధరణిఁబాలించె నఖిలభూ•ధవకులేంద్ర
కోటికోటీరమణివిభాం•కురవిరాజ, మానచరణాబ్జయుగళుఁ డ•మ్మనుజవిభుఁడు. 57
తే. దరికిఁ జేరిన నరికోటి • దరికిఁ జేరు, శరము పూనిన నహితాళి • శరము పూనుఁ
గొమరు మీఱినయారాచ•కొమరుతోడ, సరియె శూరులు మనుజకే•సరియ కాక. 58
వ. అట్లు సమగ్రలీలా వైభవోదగ్రుం డగునమ్మహీపాలాగ్రగణ్యుం డమందానందకందళి
తహృదయారవిందుం డగుచు నొక్కనాఁడు. 59

సీ. పగడంపుగుంద్రకం•బములు మేలికడాని, దూలముల్ జాబిలి•ఱాలమెట్లు
పులుఁగుఱాపచ్చబో•దెలు తళుక్కుమగమాని, కంపుగోడలు తమ్మి•కెంపువెడఁద
తలుపులు పటికంపు•ద్వారబంధంబులు, తెఱగంటిరాచఱా•తిన్నియలును
వైడూర్యవలభిక • ల్వాటంపుగోమేధి, కపుజలయంత్రముల్ • కడిఁదిముత్తి
తే. యంపునేఁతలు పుష్యరా•గంపుజాల, కములు రవికాంతమణివలీ•కములు రజత

ఫలకములు గల్గి నాణెంపుఁ • బనులబల్లా, రంగుల ననారతంబుఁ జె•లంగి మఱియు. 60

సీ. జాలవల్లికలు ప•చ్చలఁగద్దెపీఁటహొం, బట్టుతివాసీలు • వట్టివేళ్ళ
సురటీలు మేలైవఁడి•క్కురిచీలు నెత్తంపు, పలక నిద్రాజర•బాజుజీబు
చందువా ముత్యాల•జాలీలు చికిలిక్రొ, మ్మించుటద్దము లెన • మించుతగటు
బాలీసు రతనంపు•కీలుబొమ్మలు చిటి, చాపలు వెడఁదవిం•జామరములు
తే. తమ్మపడిగలు మంచిగం•దంపుఁగోళ్ళ, చిఱుతముక్కాలిపీఁట రా•చిలుకపంజ
రములు చిత్రంపుదివ్వెగం•బములు గలిగి, జానుదులకించుకొల్వుహ•జారమునను. 61

తే. రాజగురుబుధకవివసు•ధాజనులును, మిత్రజాహీనకేతువుల్ • మెఱసి కొలువ
సెంతయును దేజ మెసఁగ న•నంతపదవి, నయ్యెనుఁడు నిండుకొలువున్న•యవసరమున.

సీ. గొఱకయీఁటెలు మేటి•కఱకునారసములు, వంకకత్తులు పెడ•వంకవిండ్లు
నడునెత్తిసికలు గీ•ర్వాణంబు లెకువారు, మెట్టులు క్రొవ్వాడి•మెఱుఁగుసురెలు
కావిలాఁగులు నీలి•కాసెలు వాగురుల్, గుద్దుకత్తులు నల్ల•గొంగడీలు
నలువుమీఱినకారు•ములుచ యొడళ్లు జుం, జురుగడ్డములు బలు•కుఱుచద్రుళ్లు
తే. వలుదసొరకాయదిప్పలు • తులసిపేర్లు, గండ్రగొడ్డండ్లు చిక్కాము • ల్దండికోఱ
మీసముల్గల్గి కొండఱు•మృగయు లెదుటఁ, జేరి పొడఁగని మిగుల జో•హారు లొసఁగి.

సీ. పులిగోళ్లు గజదంత•ములు పిల్లిగడ్డలు, చారపప్పు వెడంద•చామరములు
పద్దువాడేగలు • పావురాయలు నెమ్మి, పించెంపుఁగుంచెలు • పికిలిచెండ్లు
బిత్తరంపుజవాది•పిల్లులు ముద్దులే, జింకకూనలు నవ•సంకుమదము
పచ్చకస్తురివీణె • లచ్చంపుఁబూఁదేనె, గజనిమ్మపండ్లు ద్రా•క్షాఫలములు
తే. పనసపండ్లీఁడపండ్లు కొ•మ్మనఁటిపండ్లు, కప్పురము దబ్బపండులు • నిప్పపువ్వు
మొదలుగాఁ గానుకలు పెట్టి • మ్రోల నిలిచి, పలికి రిట్లని కేల్మోడ్చి • ప్రభునిఁగూర్చి.

క. విను జియ్య పొలముపట్టునఁ, గనుఁగొన నబ్రముగ నిపుడు • కారుమెకము లా
మునఁ బెల్లు మీఱి మెలఁగుచు, జనులకుఁ గడుబీతొనర్పఁ • జాగెం బెలుచన్. 65

సీ. కణుచు లీర్వాలుగు•కాళ్లమెకంబులు, బెబ్బులుల్ తోఁడేళ్లు • బొబ్బమెకము
లెలుఁగులు గొఱపోఁతు • లేఁదులు మనుఁబోఁతు, లెనుపోఁతులును గోఁతు•లేనుఁగులును
దుప్పులు రేఁచులు • చివ్వంగు లడేఁదపు, మెకములు సవరము•మెకము లిర్లు
పందులు నక్కలుఁ • బలుబూతపిల్లులు, కుందేళ్లు దుప్పులు • కొండగొఱియ
తే. లాది యగుదొడ్డమెకము ల•బ్బబ్బ యడవి, నెందుఁ జూచిన నెడ లేక • యేపు మీఱి
తిరుగుచున్నవి యం కేమి•తెలుపఁగలము, సామి యవ్వాత్మెకంబుల•చంద మిపుడు.

సీ. కౌఁజులు పూరేళ్లు • కన్నెలేళ్లు నెమళ్లు, లావుక ల్గోరువా • ల్లకుముకులును
గోఁకొక్కెరల్ కక్కెరల్ • గువ్వలు వెలిసెలు, నేలనెమళ్లును • బోలుఁగలును
గారుకోళ్లు పసిండి•కంటె తేట్రింతలు, పాలలు పరుజులు • పావురాలు
పికిలిపిట్టలు గడ్డి•పిట్టలు గోవలు, బంగరుపిచ్చుకల్ • పసపుముద్ద
తే. లాదిగాఁ గలపులుఁగు లు•యూరె బిట్టు, నెట్టుకొని కోనలోఁ గను•పట్టి యున్న
వధిప వేఁటకు వెంచేయు • నవ్వ మిప్పు, డనుచుఁ బల్కిన వారల• నాదరించి. 67
క. మృగయావిహారలంపటుఁ, డగుచు నపుడె చదరు డిగ్గి • యతిరయమున న
జ్జగతీరమణశిరోమణి, తగ నంతఃపురికిఁ జనినఁ • దత్సమయమునన్. 68
చ. తడయక యూడిగంపు నెలఁ•తల్ నృపు డగ్గఱి నూని కెంపుబ
ల్పొడవులు వుచ్చి క్రొందడపు•దోవతి గట్టఁగ నిచ్చి పచ్చతా
బెడఁగుఁగడానిజీనిపని• పెం పగుముక్కలిపీఁటమీఁద సొం
పడర వసింపఁ జేసి విన•యంబుఁ బ్రియం బిగురొత్త నత్తఱిన్. 69
సీ. మురువైనహురుమంజి•ముత్తియంపుసరంబు, లుదుటుగుబ్బలమీఁదఁ • బొదివియాడఁ
గరములరత్నకం•కణములు గాజులు, ఘులుఘుల్లు మని తాళ•గతులఁ జెలఁగ
సొంపారుగడితంపు•సోగముంగురులు నె, న్నొసలిపై ముసరి పెం•పెసలు గూయ
మహనీయతాటంక•మణిగణద్యుతులు క్రొం, దళుకులేఁ జెక్కుటద్దములఁ బొదలఁ
తే. గౌను నర్తింప నూర్పులు • గందళింప, నలఁతిచెమ్మట నెమ్మేన • నంకురింపఁ
బసిఁడిగిన్నెయలోని సం•పంగినూనె, వనజముఖి యొకర్తు దల యంటె • మనుజపతికి.
సీ. గమగమవలచుచొ•క్కపుఁగమ్మకస్తూరి, నలుఁగిడె నొకమద•సాగయాన
కలయ గంధామల•కం బిడె నొదలఁ, దలకొని యొకముద్దు•కలికి మిన్న
దోరంపుఁబన్నీటఁ • దొరలించి జలకంబు, లార్చె నొక్కసరో•రుహాయతాక్షి
తడయక నెమ్మేను•నిడుసోగ పెన్నెరుల్, దడి యొత్తె నొక్కకాం•తాలలామ
తే. జిలుఁగునిద్దంపుమడుఁగువ•ల్వలు ధరింప, నిడియె నొక్కమనోజ్ఞరా•కేందువదన
సికను నెత్తావి క్రొత్తగో•జ్జెంగసరులు, చుట్టె నొకనీలవేణి యా•క్షోణిపతికి. 71
తే. నిలువుటద్దంబు ముంగల • నిల్పి మేలి, కమ్మకస్తూరిరేక చొ•క్కముగ నొసలఁ
దీర్పఁగాఁ జేసె నొకవధూ•తిలక మప్పు, డొఱపు రాణింప నానృపా•లోత్తమునకు.
క. అగరుసితాభ్రజవాదీ, మృగమదచందనహిమాంబు•మిళితం బై సొం
పుగ వలచు మేలికలపము, జగతీపతి మేన నొక్క•సకియ యలందెన్. 73
క. జిలిబిలివలిలేఁగాడుపు, తెలియఁగఁ బూసురటి విసరె • నిమ్మగ నొక్కతె

వలకచ కరకంకణములు, ఘలుఘు ల్లని మెఱయ రాజ•కందర్పునకున్. 74

సీ. పులుఁగురాపచ్చ బ•ల్చిలుకతాళియ నొక్క, సుదతి పేరురమునఁ • గూడుగపఱచె
సొంపారు నాణిము•త్తెంపుఁజొకటు లొక్క, కలకంఠకంఠి వీ•నుల నమర్చె
గాటంపు నెఱమాని•క పుటుంగరము లొక్క, తలిరాకుఁబోఁడి యం•గుళుల నునిచె
మురుగులు నపరంజి•మురిడీగొలుసు లొక్క, విమలాంగి హస్తప•ద్మముల నిడియెఁ

తే. బసిఁడికమ్మరుపటు యొక్క•కిసలయోష్ఠి, మొలను దవిలించి సరపిణి•గొలుసులొక్క
తెలువ వెరవార గుఱుతుగ • నఱుత నించెఁ, జెలుఘ దైవార నారాజ•శేఖరునకు.

తే. హరువు మీఱెడిపసిఁడిప•ళ్లెరమునందు, రసరసాన్నము లిడి యొక•రాజవదన
యింపుసొంపులు వెలయ భు•జింపఁ జేసె, మణిగృహంబున నారాజ•మణిని నిలిపి.

క. ఎంగిలి వార్వఁగ నీ ళ్లిడె, బంగరు నెఱిగిండితోడఁ • బరువడి నొకసా
రంగవిలోచన యానృప, పుంగవునకు మదిని గూర్మి • పొంగారంగన్. 77

తే. తావిక పురంపు బాగాలు • తగటుఁబండు
టాకులును మేలివలిము త్తి•యంపుఁగ్రొత్త
సున్నమును గూర్చి యొకప్రోఁడ • యన్ను మిన్న
యన్నరాధీశునకు విడెం • బందియిచ్చె. 78

క. అంతట నానృపశేఖరుఁ, డంతఃపురి వెడలి వేడ్క • లంతంత కెదగ్
దొంతర లై పొదువఁగఁ గడు, వింతగ మొగసాలకడకు • వేంచేసి తగన్. 79

సీ. భేరులు కాహళు • ల్పిల్లగ్రోవులు పెద్ద, బూరలు తుడుములు • భోరుకలుగ
మణికేతనములు చా•మరములు ముత్యాల, గొడుగులు సరిగెలు • గొఱలి తరలఁ
గరు లశ్వములు శతాం•గములు వరూధినుల్, గడు నేలయీనిన•కరణి నడువఁ
గవులు గాయకులు మా•గధులు వేశ్యలు నటుల్, పరిహాసకులు మ్రోల•బలసికొలువఁ

తే. బసిఁడిబెత్తులవా రిరు•దెసలఁ గ్రమ్మి, జతన దేవ పరాకు హె•చ్చరిక యనుచుఁ
గరము వేడుకతో బరా•బరు లొనర్ప, దొరలు ప్రెగడలు జనవరు • ల్దోడ రాఁగ.

తే. గడలు బాణా ల్పటాలు న•గ్గలికఁ బూని
పరువడుల్ ద్రొక్కుకొనుచు ని•బ్బరపుబీర
ములు గనంబడ సామరుల్ • మ్రోలఁ జెలఁగి
సాదన లొనర్ప జట్లు హె•చ్చరికఁ బెనఁగ. 81

తే. వలలు బోనులు పెనుబల్లె•ములును ద్రుడ్లు, గండ్రగొడ్డండ్లు వాగురు • ల్గడఁకఁ బూని
జాగిలంబుల డేగలఁ•జాలఁ గొనుచు, మృగయ లొకకొంద ఱొక చెంతఁ•దగిలిచనఁగ.

సీ. తెలిహురుమంజిము•త్తియపుఁజౌకటులక్రొం, దళతళల్ చెక్కు•టద్దములఁ బొదలఁ
గలికిరాచిలుక లె•క్కల లెక్కగొననిసో, యగపుఁబచ్చలతాళి•యఱుత మెఱయ
నవరత్నమయకంక•ణము లుంగరము లంగ, దము లాది యగుభూష•ణములు వెలుఁగఁ
జలువక్రొందగటంచు•జిలుఁగుదుప్పటివలె, వాటు నెమ్మెయి వింత•నీటు చూప
తే. నిమ్మగా మేల్పసిండితా•యెతులు మొల్ల, విరిసరు ల్దట్టముగఁ జుట్టి • వ్రేసినట్టి
యొరసికమీఁదఁ బైచెంగు • లునిచి కట్టి, నట్టిబురుసారుమాల్వాయ • ల్బిట్టుదనగ.
సీ. తీరుగాఁ గొనగోర • దిద్దిననిడుదక, స్తురిరేక నొసల మే•ల్సొగసు లీన
మొలకట్టుకాసెలో•పల బిగ్గఁజెరివిన, బలుతమ్మికెంపుల•బాఁకు మెఱయ
దండగా మగరాలు • దాపినబలితంపు, గండపెండేరము డా•కాలఁ గ్రాలఁ
బస నించునిద్దంపు•బవిరిగడ్డముసొంపు, రుచిరనీలోపల•రుచులఁ దెగడఁ
తే. గప్పురము సాంకవము మంచి•గంద మగరు, గస్తురియుఁ జాఁదుఁ బన్నీటఁ•గలపియుడిన
కడిఁది మైపూఁతకలపంపుఁ•గమ్మతావు, లిమ్మగా నెల్లదిక్కులఁ • గ్రమ్మకొనఁగ.
సీ. పసిఁడిపక్కెరజర•బాజు మెత్తాముత్తి, యంపుజొంపములు చొ•క్కంపుఁగెంపు
టంకవన్నెలు గిల్కు•టందియల్ జల్లులు, జిలుఁగుఁగ్రొందళుకుఁగు•చ్చులతురాయి
చికిలికళ్లెము క్రొత్త•ముకమాలువాగె హొ, రంగారుజరతారు•టంగువారు
బిరుదుగంటలు గజ్జె • లరిదిలకుంపటూ, ద్రిప్పదండలు భూరి•దివ్యమణులు
తే. గలితశుభలక్షణము లురు•గతులు గడిఁది, తేజునందంబు జవమును • దిటము గలిగి
రాణఁ దనరారుమేటిసా•మ్రాణి నెక్కి, హాళి దైవార నపుడు వా•హ్యాళి వెడలె.
చ. వెలువడి యోలిఁ బ్రోలినడు•వీధిజనంబులుఁ బౌరకామినుల్
వలకొని మేలిక్రపుని•వాళు లొసంగుచుఁ బొంగి యొండొరుం
దలఁగిఁగఁ ద్రోచి యానృపవ•తంసముఁ జూచి మదిం జెలంగుచున్
జిలిబిలిక్రొత్తముత్తియపు•సేసలు చల్లిరి పెల్లు మీఱఁగన్. 86
చ. జలధరవేణు లిందుమణి•సౌధతలంబుల నిచ్చి మించుఁదీఁ
గలనిరసించుమెరుచులు • గ్రాలఁగ ముత్తెపుసేసఁబ్రాలు భూ
తలపతిమీఁదఁ జల్లిరి ము•దం బలరార ఘనాఘనంబు ల
గ్గలముగ నింగి నుండి వడ•గండ్లు పొరింబొరి రాల్చుకైవడిన్. 87
ఉ. అన్నులమిన్న యోర్తు వసు•ధాధిపనందనుఁ జూడఁ గోరి వా
ల్గన్నులఁ గుంకుమంబు నొస•ల న్నవకజ్జలమున్ ధరించి లో
నెన్నఁగ రానితత్తరము • హెచ్చఁగ నచ్చుగ రాజపద్ధతిన్

గ్రన్నన వచ్చె దానిఁ గని • కామిను లందఱు నవ్వి రొక్కటన్. 88

క. పడఁతుక యొక్కతె యపుడు దా, యొడయనిఁ బొడగనఁగ వచ్చె • నొడ్డాణము వే
మెడ నిడి మొగపులతిఁగియ, నడుమున నిడియలఁతివలపు • నాటుకొనంగన్. 89

క. వలఱేని దెగడు నాన్నపు, చెలువము నలువారఁ జూచి • చెలి యొక్కతె క్రొం
జిలిబిలివలపులఁ గులికెఁ, జిలజిల మరునిల్లు పెల్లు • చెమ్మగిలంగన్. 90

క. వనజాక్షి యొకతె కరముల, ననబంతులఁ ద్రిప్పుకొనుచు • నరపుంగవుఁ గ
న్గొనఁ జేరెఁ గనమిటారపుఁ, జనుగుబ్బలసౌరు దెలుపు • చందము దోఁపన్. 91

సీ. గురుతరవక్షోజ • కుంభసంభవగంధ, సింధూరరాగంబు • చెన్ను మీఱఁ
గమనీయమేఖలా • ఘంటామహాఘుళిం, ఘుళివిరావంబు ల • గ్గలికఁ జూపఁ
బ్రకటముఖభ్రమ • భ్రమరకానీకని, స్తులవినీలద్యుతు • ల్దళముకొనఁగ
భూరిశోభాప్రకీ • ర్ణోరుశుండాదండ, విభ్రమం బభిరామ • వృత్తిఁ జెలఁగ
తే. మందయానవిలాసంబు • సందడింప, నతనుపట్టంపుఁ జేనుఁగో • యనఁగ నొక్క
కామినీమణి శృంగార • గరిమ వెలయ, వచ్చెఁ జెచ్చెరఁ గుంభినీ • వరుని జూడ. 92

చ. కులుకుమిటారిగబ్బిచను • గుబ్బలవ్రేఁగునఁ గౌనుఁదీఁగ కం
పిలి యసియాడ ముంగురులు • బిట్టు మొగంబునఁ జిందులాడఁ గం
చెలముడి వీడఁ దత్తరపుఁ • జెయ్యుల నించుక నీవి యాడ వి
చ్చలవిడిఁ జూడ వచ్చె నొక • చంద్రనిభాస్య నృపాలమన్మథున్. 93

తే. మీనలోచన యనుమాట • మిథ్య గాక, యుండునట్టుగ నొక్క వే • దండయాన
దండ దీయక నిల్చి యు • ద్దండలీల, ఱెప్ప వేయక యన్నేల • ఱేనిఁ జూచె. 94

తే. అట్లు పురకామినీమణు • లలమి చూడ, గాయకుల్వాడ గణికాప్ర • కరము లాడ
బంట్లు వెన్నాడ నతులవై • భవముతోడఁ, బురము వెలువడె రాజన్య • పుంగవుండు.

క. వెడలి తదంతికమున నొక, యెడ నెల్లర నిలువ నాజ్ఞ • యిడి డెందమ్మునం
గడలుకొను వేడ్క చేన, య్యొడయఁడు మృగయులును దాను • నురుగతిఁ జనియెన్.

మ. చని యాభూపవరుండు గాంచె నెదుర • జంబీరనింబామ్లికా
పనసాశ్వత్థకపిత్థబిల్వబదరీ • భల్లాతకీకేతకీ
ఘనసారామలకర్ణికారవటమా • కందార్జునాచ్ఛోటచం
దనమందారముఖాఖిలద్రుమనిచయా • ధారంబుఁ గాంతారమున్. 97

సీ. ప్రత్యగ్రఫలవల • ద్ద్రాక్షాలతాకీర్ణ, తరుణామ్రశాఖాక • దంబకంబు
హిమవార్ఝరీప్రాంత • సముదగ్రఘనసార, కదళీమహీరుహో • ద్గాఢతరము

పాటీరభూమిరు•టోత్కటరాంతర్లగ్న, ఫణిఫణామణివిభా•భాసురంబు
పరిఫుల్లచంపక•ప్రసవరజశ్ఛన్న, నికటసరస్తోయ•నిస్తులంబు
తే. గంధవేదండమండల•గండయుగళ, గళితదానాంబులహరికా•మిళితలలిత
పరిణతాస్తోకమాకంద•ఫలరసప్ర, వాహమధుపూరవాస మ•వ్వనము దనరె. 98
తే. శల్యకదలిప్రియకశివా•చమరకస్త, కుంభికోహితనాగముల్ • గొఱలునందు
శల్యకదలిప్రియకశివా•చమరకస్త, కుంభిగోహితనాగముల్ • గొఱలునందు. 99
సీ. శక్రరంభాపారి•జాతకైరావత, ఖ్యాత మై నాకలో•కంబుకరణి
గాలవశాండిల్య•కౌశికకపిలాది, వాస మై ధాత్రుని•వాసమట్లు
వృషకుమారకశివా•ప్రియశివాపరికలి, తం బయి రజతభూ•ధరముమాడ్కి
మదనసుపర్ణక•మాధవలక్ష్మీస, నాథ మై వైకుంఠ•నగరిగరిమ
తే. సంతతానంతనాగేంద్ర•సహిత మగుచు, విలసితం బగునలరసా•తలముపోల్కి
నెసఁగునక్కాననంబు మ•హీతలేశ, కుంజరున కాత్మఁ బ్రమదంబు • గూర్చెనపుడు.
తే. భోగినీగాఢపరిరంభ•యోగమునఁ జె, లంగునచ్చోటి మేటిభు•జంగకోటి
పద్మినీషవ్యసంభోగ•పారవశ్య, లీలఁ బున్నాగనికరంబు • గ్రాలు నందు. 101
క. పరఁగె న్వని కరికిరికా, సరశరభతరక్షుఖడ్గ•శశవృకహరివా
నరగవయశల్యభల్లుక, హరిణవ్యాఘ్రాదిమృగకు•లాపుల మగుచున్. 102
వ. ఇట్టివిచిత్రలీలావైభవంబులకుం దానకం బైనయక్కాననంబు ప్రవేశించి యానృపాల
శేఖరుండు. 103
క. తమకమున మేల్పతాణిక్, దుమికించుచుఁ బరుగువైచి • దోర్బలవిభవం
బమర వనాంతరమునఁ జే, రిమి మెఱయఁగఁ గొంతతడవు • ద్రిమ్మరుచుండెన్. 104
తే. భటులు నటులనె నిర్భరో•ద్భటులు నిగుడ, లగుడశరభల్లఘనసర్వ•లాత్రిశూల
పరశుకరవాలికాచ్ఛురీ•ప్రముఖనిఖిల, సాధనము లూని యాతని•జంటఁ జనిరి. 105
తే. పసిఁడిగొలుసులు జరతారు•పట్టెడలును, మేలిహొంబట్టుజూలును • మెడల గొప్ప
వెండిమువ్వలు పొదలంగ • గండుమీఱి, సాగె వేగఁ దుటారంపు•జాగిలములు. 106
క. మోరలు దివి కెత్తుచు భౌ, భౌరవములతోఁ జెలంగె • భషకము లప్పుడ
త్తారాపథ మంతయు నొక, తూరి మొకబళింపఁ బూని • తొడరె ననంగన్. 107
తే. అపుడు గొందలమ్మృగయు ల•య్యడవిఁ దూఱి, ఘోరముగ నెల్లకడలఁగ•గ్గోలుగాఁగఁ
గూఁతలిడిచోఁపుటయుమృగ•కులము గలఁగి, బయలు వెడలినఁ గాంచియ•ప్పార్థివుండు.
శా. సారంగంబులఁ జెండి సింగముల ని•స్సారంబుగాఁ ద్రుంచి భూ

దారవ్యాఘ్రతరక్షుఖడ్గశశగం•ధర్వంబుల న్గంధమా
ర్జారశ్వావిధనేకపక్షిరురులన్ • జక్కాడెఁ గుంతచ్ఛురీ
నారాచాసిగదాత్రిశూలముఖనా•నాదివ్యశస్త్రంబులన్. 109

సీ. పులులమొత్తంబుల • బోనులఁ జొరఁ దోలి, గండ్రగొడ్డండ్లచేఁ • జెండి చెండి
వలలలోఁ జిక్కి పోఁ•వఁగ లేనికుందేళ్లఁ, గదిసి పెన్గుదియలఁ • జదిపి చదిపి
ఘుర్ఘురధ్వనులఁ గై•కొనవచ్చుపందులఁ, గుఱుచబల్లెంబులఁ • గుమ్మి కుమ్మి
బెదరి చెంగున దాఁటి • చెదరి పాఱెడులేళ్లఁ, జెడుగువేపుల కెర • చేసి చేసి

తే. యసినిశాతాంబకంబుల • నచ్ఛభల్ల, శల్యశంబరహర్యక్ష•శరభగవయ
చమరసృమరాదికంబులఁ • జంపి చంపి, వేఁట గావించి రాశౌని•వీరభటులు. 110

తే. ఖడ్గముల ఖడ్గములఁ ద్రుంచి • కడిమి నచ్ఛ, భల్లముల భల్లములఁ జంపి • పెల్లు మీఱ
శల్యముల శల్యముల బిట్టు • చదిపి పతికి, మోద మొసఁగిరి గొందఱు•జోదు లపుడు.

సీ. అదె కరి యిదె కిరి • యదె హరి పోనీక, పొడు పొడుం డని బొబ్బ • లిడెడువారు
పులిఁ గ్రమ్ముకొని పులి•పులిగ నీఁటెలఁ గ్రుమ్మి, యేపుతో మగటిమిఁ • జూపువారు
శరభావలుల ఘోర•శరభావలు లెలర్ప, నెలసి భూస్థలిఁ ద్రెళ్ల • నేయువారు
సారంగముల మన•సారంగఁ బైకొని, కొట్టి పెన్గట్టులఁ • బెట్టువారు

తే. కొండగొఱియల దుప్పుల • గండకముల
ఖండఖండంబులుగఁ జేర్మి • నండగొనఁగఁ
జెండు బెండాడి యుక్కునఁ • జెలఁగువారు
నగుచుఁ గ్రీడించి రొకకొంద • ఱధిపుమ్రోల. 112

సీ. పసివట్టి తోఁకలు • విసరి తారుచుఁ జెవుల్, రికిరించుకొని దిశల్ • రేసి చూచి
కొఱకొఱఁ బరువిడి • మఱలి మోరలు చాఁచి, పొదలు దూఱుచుఁ జుట్టి•పొంగువారి
గొదకొని నెమకుచు • ఘుర్ఘురధ్వనులతోఁ, బైకొని వచ్చుబల్ • పందిగమికి
మొగిసి చివ్వన మీఁది•కెగసి కొంకులు గోళ్ళ, ములు మెడ ల్గలయాయ•ములు విడంగఁ

తే. గఱచి గీపెట్టునెడల • నక్కజపులావు, లెలయఁ జీకొన నీడిచి • యేపు చూపి
మృగయులకుఁ జాలఁ బ్రమదంబు• నిగుడఁ జేసె, సరవినయ్యెడ నాడెంపు•జాగిలములు.

వ. మఱియును. 114

సీ. కాఁజుపోఁజులఁ బోవఁ • గానీక వాసియే, రణములఁ బఱపి శీ•ఘ్రింబ తునిమి
పూరేళ్లపైఁ బెల్లు • పొదలు చంచలపుడే, గల వైచి నెవ్వడి • బిలుకుమార్చి
కన్నెలేడులమీఁద • గాటంపుబీరంపుఁ, గణసరంబులఁ జొన్పి • గం డడంచి

నేల నెమళ్ళపై • నేలాపుడేగల, విడిచి యేపునఁ బీఁచ • మడఁపఁ జేసి

తే. పసపుముద్దయుఁ బాలయుఁ • బచ్చకొక్కు, పసిడికంటెయుఁ • బరజయుఁ బసులపోలి
గాఁడు ననువానిపై జల • కట్టియలను, బంచి తు్రించిరి కొందఱు • బంటు లపుడు.

తే. అట్లు దమకంబుచే వేఁట • లాడి మృగమ, దంబుఁ జామరములు గజ • దంతములును
బిల్లిగడ్డలు పులిగోళ్లు • పికిలిచెండ్లు, నాదిగాఁ దెచ్చి యిచ్చి ర • య్యవనిపతికి. 116

తే. అంత నవ్వేఁట చాలించి • యవనివిభుఁడు, సేన గొలువంగ నవ్వని • చెంత నొక్క
పటకుటీరంబు వేయించి • పాయ కెదను, మించువేడ్కలఁ దగ విశ్ర • మించి యుండె.

క. అని వనజాసనుఁ డెఱిఁగిం, చిన విని సురమౌని ముదిత • చిత్తుం డై యా
తని నవ్వలికథ యెల్లను, వినిపింపు మటంచుఁ దివిరి • వేఁడుకొనుటయున్. 118

మ. పురుహూతాగ్నిపరేతరాట్పలభుగంభోధీశవాతార్థపాం
బరకేశాబ్జభవాచ్యుతాదికమహా • బర్హిర్ముఖానీకభా
స్వరకార్తస్వరవిస్ఫురన్మకుటశ • శ్వత్పద్మరాగప్రభో
త్కరనీరాజితపాదపద్మయుగళా • కాకోలభాస్వద్గళా. 119

క. దృక్కర్ణకర్ణభూషణ, వాక్కాంతాకాంతముఖ్య • వందిత మిహికా
రుక్కోటికోటిభాస్వర, కుక్కుటలింగాభిధాన • కుతలనిధానా. 120

ఉత్సాహ. పురవిభంగ ధరనిభాంగ • భూశతాంగ శశివిభా
కరరథాంగ ముకుటగంగ • కరకురంగ సంహృత
స్మరదనంగ ధృతభుజంగ • సుగుణసంగ మునిమనో
బురుహభృంగ వృషతురంగ • భువనమంగళప్రదా. 121

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరకరుణాకటాక్షనిరీక్షణాసంలబ్ధసరసకవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్త్రసకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామతిమ్మకవిసార్వభౌమప్రణీతం బయినరసికజనమనోభిరామం బను శృంగారప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# రసికజనమనోభిరామము

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమద్ధరణీధరక
న్యామానసపద్మభృంగ! నయగుణసంగా!
సామజదనుజవిభంగా!
కోమలఘనసితావృతాంగ! కుక్కుటలింగా! 1

తే. అవధరింపుము కమలజాండమర మౌని, శేఖరున కిట్లని వేడ్కఁ జెప్పఁదొడఁగె
నవ్విధమున ఋతుధ్వజక్ష్మాధినాథుఁ, డురుబలోపేతుఁడై వని నుండుటయును.

లయగ్రాహి. అంతట వసంతమసురాంతకతనూభవమదంతనిశితప్రసవకుంతహృతపాంథ
స్వాంతము శుకీపికశకుంతకలనిస్వననిరంతరసమాకులదిగంత మసకృన్ని
ష్క్రాంతమధుపానమదదంతురితషట్చరణసంతతి విసృత్వరలతాంతము వనాంతా
క్రాంతరతికాంతరణతాంతలలనాజననితాంతసుఖదానిలనితాంతము దనర్చెన్. 3

క. శుకపికశారీమధులి, ట్ప్రకరమహానినదనిబిడబధిరీకృతస
ర్వకకుప్పతికర్ణం బై, యకలంకగతిన్ ధరిత్రి నామని యొప్పెన్. 4

తే. జీర్ణపర్ణంబు లూడ్చి కెంజిగురుటాకు, జొంపములతోడఁ దరువులు సొంపెసఁగ వ
సంతు రాక దలఁచి వనికాంత మెఱుఁగుఁ, దోడవు లెడలించి మణిభూషలిడెననఁగ.

క. కుసుమితశాల్మలులపు డిం, పెసఁగె న్విరహిణుల గెలువ నేగుచు నెలమిన్
బిసరుహశరుఁ డంపించిన, పసఁ బొసఁగెడు తమ్మి కెంపు పనితేరు లనన్. 6

సీ. శుకరాజమాగధప్రకరముల్ గీర్తింపఁ, గలకంఠకంఠకాహళులు మొరయఁ
బరిఫుల్లకింశుకకరదీపికలు గ్రాల, సాంద్రపరాగరజమ్ము గ్రమ్మ
సహకారపల్లవాంచత్కేతువులు మీఱ, సమదరోలంబసైన్యములు గొలువఁ
గేతకీగర్భ[illegible]శాంతతాస్త్రము లొప్పఁ, బృథుమరున్నినదభేరికలు చెలఁగ

తే. ప్రసవచంపకరథకదంబములు మెఱయ, దర్పకునితోడఁ గూడి చైత్రప్రభుండు
విరహిణీపాంథసందోహవిజయమునకు, హోళి దైవార నపుడు వాహ్యాళి వెడలె. 7

మ. బలవద్దర్పకవీరకాహళరవప్రాయంబులై మించి సొం
పలరం బాంథనితంబినీజనఘనస్వాంతంబు లెంతేనియుం
గలఁచెన్ బాలరసాలపల్లవలవగ్రాసావలేపోల్లస
త్కలకంఠప్రమదానిరంతరకుహూకారంబు లప్పట్టునన్. 8

క. మహిళాపున్నాగంబు, ల్రహిఁ గుసుమకదంబలీలఁ గ్రాలఁగ నచ్చో
మహిళాపున్నాగంబు, ల్రహిఁ గుసుమకదంబలీలలం గ్రాలెఁ గడున్. 9

తే. పవనదుశ్శాసనుఁడు వనీపాండవేయు, లలనజీర్ణచ్ఛదాంశుకంబులు హరింపఁ
గలికిశుకసూక్తిఁ జీరఁ గిసలయహేమ, మయపటము లీఁడె యయ్యెడ మాధవుండు.

సీ. శుకముఖద్విజమండలికి మహాఫలదుఁడై, తవిలి వేమఱు మరుత్తతి భజింపఁ
గ్రూరపలాశసంహార మొనర్చుచు, సరసను బర్ణలాంఛనము మెఱయ
నాశ్రితాళులు నితాంతామోదమునఁ గ్రాలఁ, జెలఁగి వనప్రియశ్రేణి పొగడ
ఘనతరుల్సుమనోవికాసలీల నెసంగఁ, గలితశుభశ్రీప్రకర్ష వెలయ

తే. సముధికతరాగవహనప్రశస్తి యలర, వనజసాయకగురువైభవంబు నెఱపి
భవ్యవనమాలికాసముద్భాసి యగుచు, మహిమఁ జెన్నొందె సర్వేశు మాధవుండు.

క. వసరమున మాధవునకుఁ, దనరఁగఁ బరిణయ మొనర్పఁ దటి యనుజవరా
లునిచినము త్తెపుఁబ్రాలన, మొనసి వనిం గొత్తమల్లెమొగ్గలు దనరెన్. 12

క. రాగము చిగురాకున కను, రాగము బోఁజుఁగులకు ఘనపరాగము వనికిన్
రాగము మధుకరములకు స, రాగము గృహులకును గల్గె రహి నవ్వేళన్. 18

సీ. శుకనాదములు ద్విజశ్రుతిఘోషములు గాఁగఁ, గనకకోరకము లక్షతలు గాఁగఁ
దేఁటిపాటలు పురంధ్రీగీతములు గాఁగఁ, గిసలయుల్ తోరణనిసరములుగఁ
బలుకప్పురంపుఁదిప్పలు వితర్దులు గాఁగఁ, బుప్పొడుల్వాలిగందపొడులు గాఁగఁ
దెలిమొల్లమొగ్గచాల్పులు తలఁబ్రాల్గాఁగ, విరితీఁగెపొదలు పందిరులు గాఁగఁ

తే. బుష్పితపలాశనికురుంబములు నివాళి, పళ్లెములు గాఁగ నిర్భరపవనచలిత
తరురవంబులు భద్రవాద్యములు గాఁగ, వనవధూమణిఁ జైత్రుఁ డుద్వాహమయ్యె.

సీ. వ్యాకీర్ణమదచంచచ్చంచరీకశిరోజయుఁ, బ్రచలితమంజరీకుచభరయును
గళదనూనమరందఘర్మాంబులేశయు, లతికాభుజాశ్లేషలాలసయును
బ్రకటితసంరక్తపల్లవాధరయు విస్రస్తప్రసవపరిష్కారమణియుఁ

గీరశారీరుత • కింకిణీరవయు నం, చితసరఘాస్వన • సీత్కృతియును
తే. నవపలాశద్రుకోరక • నఖపదయును, గంధమారుతనిశ్వాస • గాఢతరయు
నగుచు వనలక్ష్మి చైత్రస • మాగమమున, నలఘుసంభోగలాంఛనం • బులఁ జెలంగె. 15

సీ. పల్లవశ్రేణి క • బ్రంపురాగ మెసంగె, హితఫలంబులు ద్విజ • ప్రతతి కొదవె
సుమనోవికాస మ • చ్చుగ భూజనుల కబ్బెఁ, జాఁగెఁ బల్మఱు మరు • త్సంభ్రమములు
చండాలులకుఁ బొల్పె • సఁగె మధుపానాప్తి, యమితరసాలకాం • డములు మెఱసెఁ
బ్రసవధర్మక్రియా • పరత నొప్పిరి గృహుల్, ప్రబలె నర్చులు చిత్ర • భానునందుఁ
తే. గుంభినీవల్లభులకు మి • క్కుటపు దాన, గుణము వాటిల్లెఁ ద్రిభువన • ప్రణుతనిఖిల
జంతుసంతానహృదయరం • జకమనోజ్ఞ, లీల నలరు వసంతర్తు • వేళయందు. 16

క. అపుడా నృపుఁడటఁ దరలెన్, విపినవిహారానుమోద • విచలితమతియై
తపనఘృణివిసరవిరహిత, విపథంబున నర్మసఖుఁడు • వెంబడిఁ జనఁగన్. 17

వ. అట్లు దరలి దరీకుహరాంతరవిహరమాణాకుంఠకంఠీరవభైరవారవాకర్ణనాతిప్రకంపితాఖిలహరిదంతదంతిసంతానంబును నిర్ఝరనికుంజసంజవనాంగణానర్గళమార్గనిర్గతజాగ్రన్మహోగ్రవ్యాఘ్రకోటిధాటికపలాయితరురుకురంగప్రముఖనిఖిలక్షుద్రమృగకులాకులంబును మదోద్దండవేదండమండలగండస్థలనిస్సరద్దానధారాపూరాభిషిక్తాశేషప్రదేశంబును బరస్పరభీకరాఘాతప్రభిన్నావయవస్రవద్రుధిరధారాప్రవాహ[illegible]ప్లవరాహవాహాయితవ్యూహంబును బటుపటీరకూటస్ఫుటకోటీరకుటీరాంతర్లగ్నభుగ్నభుజంగపుంగవోత్తుంగఫణాగ్రరంగరంగన్మణిగణప్రభాభాసమానంబును నిబిడఝంఝాసమీరప్రేరితధావద్దావపావకాభీలజ్వాలాజాలజాజ్వల్యమాననానానోకహచ్ఛటాచ్ఛటచ్ఛటనినాదమేదురంబును సరససరఘావిసరఖాదనావసరశిథిలపృథులమధుకోశవినిర్గళన్మధురసాసారవర్షోత్కర్షంబును నవారితమారుతానారతపూరితభూరితరవేణునినాదాకీర్ణంబును సభ్యర్ణధరాధరాధిత్యకాసముజ్జృంభితస్ఫురత్సరిజ్ఝరీతరజ్గనిర్ఘోషనితాంతగర్జారవమనీషామహుర్నటదుత్కంఠనీలకంఠానీకాస్తోకకేకారవాక్రాంతంబును విశంకటమృగయావిహారవిలాససముల్లసద్భిల్లపల్లవోష్ఠీనిష్ఠురాలాపకోలాహలధ్వానబధిరీకృతరోదోంతరాళంబును బహుతరక్రూరోరగమృగఖగసంఘాతసంకులంబును బహుశిలాకంటకావృతంబును బహువిచిత్రాకరంబు నగు నమ్మహారణ్యంబు చొచ్చి విచ్చలవిడి నచ్చటివినోదంబులు గనుంగొనుచుం జని చని ముందట. 18

మ. కనియె న్నృపకులాఢ్యుఁ డగ్రగవియ • ద్గంగాతరంగోద్ధత
ధ్వనిసంఘాతనితాంతసంవృతమహా • ప్రత్యర్థిశంకాముహు

గ్జనితక్రోధరణన్మృగాధిపకుల • స్థాయద్దరీభాగమున్
ఘనగంభీరసరిర్ఝరీతటకట • న్నాగంబు శీతాగమున్. 19

క. కని యన్నగాగ్రభాగం, బున కేగి తదీయచిత్ర • ములు గనుఁగొనుచున్
మునుకొని తిరుగుచు నుండెన్, జనవరకుంజరుఁడు నర్మ • సచివుఁడు దానున్. 20

క. దరులం బూఁజప్పరముల, దరులన్ శృంగారలీలఁ • దనరెడుకాకో
దరుల న్విద్యాధరసుం, దరులం బొడగాంచి యతఁ డెం•దం గడు నలరెన్. 21

సీ. భిల్లయోషిత్పద•పల్లవోల్లిఖితకుం, కుమరసాంకితమణీ•కుట్టిమంబు
కాకోదరీకుచ•కలశద్వయీలిప్త, హారిద్రముద్రితా•బ్జాకరంబు
కిన్నరీజనరతి•క్రీడాంతరస్రస్త, కుసుమోత్కరాకీర్ణ•కుంజగృహము
దివిషద్వధూప్రతి•దినదోహదక్రియా, వికసితామ్రాదికో•ర్వీరుహంబు
తే. ఖచరవరవర్ణినీకర•కమలనిభృత, సురమహీజాతజాతప్ర•సూనరచిత
తతసుగంధాన్వితోదగ్ర•తాలవృంత, గంధవాహకిశోర మా•శ్మధరంబు. 22

సీ. అమరసరిత్కాంచ•నాబ్జపరాగసం, ఛన్నమహారత్న•సానువులును
క్రీడాసమాసక్త•కిన్నరీచరణలా, క్షారసాంకితఝరీ•సైకతములు
గంధద్విరదఘటా•కటగళద్దానవా, ర్బిందుసంసిక్తద•రీతలములు
శుకశారికాకోక•పికరాజహంసమ, యూరస్వనోల్లస•దుపవనములు
తే. సిద్ధవిద్యాధరోరగ•స్త్రీకుచాగ్ర, లిప్తహారిద్రచూర్ణసం•శ్లిష్టభూరి
జీవనాంచత్ప్రకృష్టస•రోవరములు, గనుఁగొని చెలంగె నప్పు డ•జ్జనవరుండు. 23

సీ. శిఖరాగ్రవిస్ఫుర•జ్జీమూతదర్శన, ప్రమదనృత్యన్మత్త•బర్హిణములు
నిర్మలకాసార•నీరనీరజనాళ, కబళనోద్ధతహంసి•కాకులములు
పరిఫుల్లమల్లికా•ప్రసవరసాస్వాద, నాలోలరోలంబ•జాలకములు
మృదులామ్రనూతన•చ్ఛదచర్వణోన్మద, కూజితోద్యదనేక•కోకిలములు
తే. సారసహకారమంజరీ•సౌరభములు, కుందబృందాచ్ఛమకరంద•బిందుసహిత
శీతలస్ఫీతమృదువాత•పోతములును, హర్ష మొనఁగూర్చె నృపతి క•య్యద్రియందు.

ఉ. క్రొన్ననతీవపందిరుల • గొజ్జఁగినీటివెడందవాఁగులన్
వెన్నెలరాచరాచలువ•విప్పుటరుంగులఁ గప్పురంపుబల్
దిన్నియల న్హొయల్మెఱయఁ • ద్రిమ్మరునచ్చరపువ్వుఁబోండ్లు రా
మిన్నకుఁ దద్ద వేడుకలు • మీఱఁగఁ జేరిరి యన్నగంబునన్. 25

సీ. అశ్రాంతసుమనస్స•మాజపూజితపాదుఁ, డవిరళకాళీస•మన్వితుండు

రంగదుత్తుంగభు•జంగమకటకుఁ డట, దద్భుతచంద్రరేఖావి•భూషణుండు
సదమలభృంగీశ•సంగీతనిరతుండు, శుకముఖద్విజగణా•సూక్తిహితుఁడు
నిరుపమానంతను•నీశిరోభాగుండు, లాలితవృషరాజ•లాంఛనుండు
తే. సురుచిరాగమవాహుఁ డా•క్షుద్రమూర్తి, యఖిలశుభఫలదాయకుఁ • డగ్గిరీశుఁ
డతులితామోద మొనగూర్చె • నపుడు మిగుల, నద్ధరిత్రీశవంశచూ•డాగ్రమణికి.
సీ. గోత్రవర్గములోన • గురుతరుం డగుబల్లి, దుండు వంశోద్ధార•కుండు గాఁడె
బహుళశైరికసమా•శ్యాంచితుం డగుప్రోడ, సతతకల్యాణభా•జనము గాఁడె
యఖిలభూజనులఁ బా•యక ప్రోచుధన్యాత్ముఁ, డురుఫలంబులు విప్ర•వరుల కీఁడె
తతవాహినీపరి•వృతుఁ డగునచలుండు, పరదళోన్మూలన•ప్రౌఢిఁ గనఁడె
తే. యౌర మేలిధరాధీశుఁ • డసదృశప్ర, భావశోభితుఁ డై యెన్నఁ•బడియె నంచుఁ
బర్వతేంద్రుని నతితగ•ప్రతిభ మెఱయఁ, బ్రస్తుతి యొనర్చె నృపుల•ప్రవరుఁ డపుడు.
శా. తోరం బొప్ప నటించె నప్పుడు వియ•త్తూర్యాలంకపోత్ఫుల్లక
ల్హారాంభోరుహమల్లికోత్పలసుగం•ధాశ్లిష్ట మాద్యన్మరు
ద్వారంబుల్ కుసుమాస్త్రసంగరనితాం•తక్లిన్నవిద్యాధరీ
హారిస్థూలకుచాగ్రఘర్మజలలే•శాంకూర మింకింపుచున్. 28
వ. అట్లు భువనాద్భుతకరాదభ్రలీలావైభవంబులకుం బట్టైనయగ్గట్టుపై నారా[illegible]నె
ట్టుకొని విహరించుచుండి యందు నొక్కచోట. 29
క. కనుఁగొనియె నెలమి దివిష, ద్వనితాకుచకుంభమిళిత•వరకస్తూరీ
ఘనసారచందనాగురు, ఘనసౌరభసంగ నభ్ర•గంగ న్మోక్రిలన్. 30
క. కనుఁగొని హర్షాద్భుతములు, మనమునఁ బెనఁగొనఁగ నా క్షమావరుఁడు గడుఁ
వినయంబున నా స్రోత, స్విని నిట్లు లటంచు వినుతి • సేయఁ దొడంగెన్. 31
సీ. జయజయ హరిపద•జలజసంబంధిని, జయజయ గిరితనూ•జాసపత్ని
జయజయ కైలాస•శైలవిహారిణి, జయజయ ఘోరదు•ష్కలుషదమని
జయజయ కైవల్య•సౌఖ్యప్రదాయిని, జయజయ భవసాధ్య•సంప్రశమని
జయజయ దేవతా•సదనప్రచారిణి, జయజయ శంకర•ప్రియవధూటి
తే. జయ మహాదేవి భగవతి • జయ సమస్త, భువనజనయిత్రి జయ నిశా•ధవపటీర
శరశరద్ఘనఘనసార•సదృశగాత్రి, సకలకల్యాణసంధాత్రి • జహ్నుపుత్త్రి. 32
మ. మదనారాతిజటాటవీతటనట•న్మల్లీగుళుచ్ఛాకృతీ
త్రిదశాధీశపురానిశాధివసతీ • దేవీ జగత్పావనీ

హృదయాహ్లాదకరీ నమజ్జనమనో•భీష్టార్థసంధాయినీ
మది నెల్లప్పుడు సంస్మరింతు నిను నే•మం బొప్ప మందాకినీ. 33

మ. అవని న్మానవుఁ డెవ్వఁడేని భవదీ•యాలోలకల్లోలవా
ర్లవసంసిక్తనిజప్రతీకుఁ డగు నా•ప్రాజ్ఞుం డమర్త్యేంద్రపూ
ర్ధవశాక్షీకరకంకణక్వణనమి•శ్రప్రోల్లసచ్చామరో
ద్భవనిస్తంద్రమరుత్కిశోరములచే•తం జొక్కుఁ బో జాహ్నవీ. 34

సీ. బ్రహ్మహత్యాదిదు•ర్భరమహాఘవిభంగ, ఘనతరతరళరం•గత్తరంగ
విపులసైకతభాగ•విలసితచక్రాంగ, హరజటాజూటకు•టాగ్రరంగ
కనకారవిందసం•గతచలన్మదభృంగ, సూరిజనస్తుత•సుప్రసంగ
యమరీకుచాలిప్త•హారిద్రసంసంగ, సతతసమాశ్రిత•శైలశృంగ

తే. యతిదయాపాంగ పుణ్యమ•యాంతరంగ, ప్రచురగంభీరనీరాంత•రప్రమగ్న
మత్తమాతంగ నీకు న•మస్కరింతు, దివ్యశోభాప్రదీప్తాంగ • దివిజగంగ. 35

తే. పరుస మించుక సోఁకి య•బ్రముగ నినుము, పసిఁడియగునట్లు తావక•ప్రవిమలాంబు
కణ మొకించుక సోఁకిన•ఖలజనుండు, మిగులఁ బరిశుద్ధుఁ డగుఁ గదా • గగనతటిని.

చ. తమి నొకనాఁడు మానవుఁడు • దవ్వులఁ దావకవీచికానినా
దము చెవిఁ గీలుకొల్పిన న•తండు వినండు గదా సురాపగా
శమనలులాయకంఠపరి•సర్పితభూరితరోగ్రఘంటికా
సముదయలోకభీకరవి•శంకటసాంద్రఘణంఘణధ్వనుల్. 37

క. యోగిజనానందకరీ, యాగమసంస్తుతలసత్ప•దాంబుజయుగళీ
భోగాపవర్గదాయిని, భాగీరథి నేఁడు ననుఁ గృ•పం గనుఁగొనవే. 38

క. ధాతృపితృచరణతలసం, భూతా భువనప్రపూత • బుధనుతసుగుణ
వ్రాతా విరజాసలిలో, పేతా నను ధన్యుఁ జేయ•వే గుహమాతా. 39

వ. అని యనేకప్రకారంబులం బ్రార్థించి తదంభఃపూరంబునఁ గృతావగాహుం డై సంధ్యాద్యనుష్ఠానక్రియాకలాపంబు నిర్వర్తించి తదంతికప్రదేశంబున విహరింపుచుండి పురోభాగంబున నొక్కచోట. 40

తే. కనకమణిమయసోపాన•గర్భగేహ, కుట్టిమాకరమంటప•కుడ్యగోపు
రేందుమణిపీఠికాసము•న్వితమహేశ, భవన మొక్కటి గాంచె సం•భ్రమ మెలర్ప.

తే. కాంచి యద్దేవలము ప్రవే•శించి యందు, విమలతేజస్సమగ్రత • వెలుఁగుచున్న
దివ్యలింగంబుఁ బొడగాంచి • నవ్యభక్తి, యమరఁ గరపంకజాతయు•గ్మము మొగిడ్చి.

ద్గిరిచాపా హారిరోపా, పరితాపాపహరణ నిన్నె • ప్రణుతింతు శివా. 53
వ. అని సంస్తుతియించును. 54

కందమణిగణనికరవృత్తము.

జయజయ పురహర • జయ గిరిశయనా, జయ తలవినిభృత•సదమలఫాతిజా
నయగుణవిలసిత•నయశుభచయదా, జయ మునివరనుత•చరణసరసిజా. 55

సగర్భస్రగ్విణీభుజంగప్రయాతద్రుతవిలంబితవృత్తసీసము.

నిగమాశ్వభూసురా•నీకసంపూజ్యశుం, భత్పవిభావా వృష•పతితురంగ
సురుచిరద్యోసరి•జ్జూటఖద్యోతసా, హస్రభాసా సమ•స్తాఘహరణ
జగతీశ మాసర•స్వత్సమామాన్యచం, చత్కృపాబ్ధీ నత•జనశరణ్య
మానితహాసర•మ్యాననాజ్ఞా లస, న్మంగళాత్మా నిశా•నాథమకుట
తే. హర సరీసృపహార భ•యాపహార, పురనిషూదన భూరివి•భూతిదాన
హరిహయప్రణతాచ్ఛప•దాంబుజాత, శరణు శంకర శాశ్వత • సాధుపాల. 56

సగర్భమత్తేభకందసీసము.

సమదవేదండని•శాచరోన్మథనభీ, మప్రౌఢదోర్విక్ర•మా కృపాబ్ధి
ప్రముదితానేకసు•పర్వ నిర్మలగుణాం, భోధీ జగత్కార•ణా ధరేశ
లసదురోభాగవి•లంబితోరగపతీ, సామప్రియా శంక•రా మహాత్మ
ప్రపదరుగ్భూషిత•పాకజిన్మకుటశుం, భద్రత్నదివ్యప్ర•భా కపర్ది
తే. శివ నిఖిలలోకపాలన • భవవిదళన, శరధితూణ భయహర వి•జయ ప్రవిమల
హృదయ శశిధర త్రిభువన•హితసుచరిత, శమితపురదితిజవరా ప్ర•శస్తకీర్తి. 57
క. అని యనివారితభక్తిం, బ్రణుతించి మహేశుకరుణ • వడసి కడుఁ గ్రొ
బ్బునఁ బ్రసాదము వెలువడి, జనవరుఁడు తదంతికమునఁ • జనియెడు నెడలన్.
తే. సరసనైఖరిశ్రుతిపుటో•త్సవము మీఱి, నాలకింపంగఁబడియె న•త్యద్భుతముగ
సకలచేతనహృదయరం•జకమనోజ్ఞ, మధురసంగీతరావంబు • మలసి యెదుట. 59
క. ఆరవము విని నృపాగ్రణి, గారవపుంజెలిమికానిఁ • గనుఁగొని యహహా
చేరువ నొకమృదుసంగీ, తారవము వినంగ నయ్యె • నల్లదె వింటే. 60
ఉ. కిన్నరకన్యలో సురమృ•గీదృశలో గరుడాంబుజాక్షులో
పన్నగకాంతలో ఖచర•భామలొ సిద్ధవధూటులో సుఖా
భ్యున్నతిఁ బాడఁ జొచ్చి రటఁ • బోయి దిటంబుగ వారిచందముల్
సన్నకసన్న నారసి వె•స న్మరలం జనుదెమ్ము నెచ్చెలీ. 61

క. వేమఱు మది కింపుగ గజ, గామిను లామనిగఁ బాడు•గానము వినుచున్
సోమరితనమునఁ దడయక, సేనుంబున మరలి యిపుడె • చెచ్చెర రమ్మా. 62
ఉ. నావుడుఁ జెల్మికాఁడు నృప•నందను వీడ్కొని వేడ్క నేగి శో
భావహలీలఁ గ్రాలునొక•యబ్బురపుంబువుఁదోఁటఁ జొచ్చి య
త్తావునఁ బ్రోవు గూడి విత•తంబుగఁ గ్రీడ యొనర్చుదివ్యరా
జీవముఖీలలామములఁ • జిత్రగతిం బొడగాంచి వెండియున్. 63
మ. తరుమూలంబులపొంతఁ బొంచి సచివో•త్తంసంబు వీక్షించె భా
స్వరకార్తస్వరవిగ్రహ న్సమదచం•చచ్చంచరీకాలకన్
శరదిందుప్రతిమానచంద్రవదనం • జక్రస్తని న్విస్ఫుర
త్సరసీజాతదళాయతాక్షి నొకకాం•తాలోకచూడామణిన్. 64
తే. అట్లు వీక్షించి దానిస•మగ్రభువన
మోహనాకారరేఖ కా•మోద మంది
యహహ యియ్యిందువదన య•య్యసమశరుని
భూరిసామ్రాజ్యలక్ష్మి గాఁ•బోలు భళిర. 65
చ. కులుకుమిటారిగుబ్బలును • గొప్పపిఱుందును గావిమోవియుం
దెలినిడువాలుఁగన్నులును • నిద్దపుముద్దుమొగంబు తళ్కుఁజె
క్కులు జిలుఁగుంగవు న్వెడఁద•క్రొమ్ముడియుం గలయీచొకారపుం
గలికియలంతిజవ్వనము • కన్నులపండువ యయ్యె నియ్యెడన్. 66
క. చూడమె ముజ్జగములఁ గల, చేడియతలమానికములఁ • జెన్నలరెడునీ
వ్రీడావతీకదంబక, చూడామణివంటిదానిఁ • జూడ మొకండున్. 67
సీ. చందమామకు లోనఁ • గందొనర్చినతప్పు, పసిఁడికిఁ దావిఁ గూ•ర్పనికొఱంత
దొండపంటికిఁ దీపి • నిండఁ జేయనికట్టు, తొగలఁ బెన్మడుగునఁ • ద్రోమవాదు
జక్కవపులుఁగుల • జత విప్పనాడిక, మించుటద్దముల మా•యించుకీడు
కరితుండములకు వ•క్రత యిడ్డ నేరమి, చివురులు గార్కొనఁ • జేయురవ్వ
తే. మలుపుకొనఁ జాలు నద్దిరా • జలజభవుఁడు, పూని యిమ్ముద్దుతలిరాకుఁ•బోఁడివదన
తనురదాంశుకలోచన•స్తనకపోల, సక్థిపదయుగ్మకము సొం పెసఁగ నొనర్చి. 68
సీ. పలుకులు నేర్చిన•తళుకుఁబుత్తడిబొమ్మ, జగతికి డిగ్గిన•చంద్రరేఖ
నిలుకడఁ గాంచిన•తొలుకరిక్రొమ్మించు, తావి చేకుఱిన నె•త్తమ్మికెంపు
నెన్నడు పొదవిన•కన్నెమామిడిగున్న, తను పూని మెలఁగు కెం•దమ్మికొలను

నగవుఁజూపులవద్దు•సొగసుఁగ్రొన్ననచెండు, చేష్ట లబ్బి మెలంగు•చిత్రరేఖ
తే. గావలయు నియ్యబల దీని•గాఢకాంతి, రూపలావణ్యశుభవైఖ•రులు గరంబు
నమ్మహారాజునకుఁ దెల్పి•యతిరయంబ, తోడుకొని వత్తు నని వేడ్క•తోడ మరలె.
తే. మరలి చనుదెంచి యమ్మహీ•వరుని గాంచి, యంచితాలాపముల నిట్టు•లంచుఁ బలికె
భూతలాధీశ నీయాజ్ఞఁ • బూని యిందుఁ, దరలి యొకయబ్బురపుఁద్రోవ•నరిగియవల.
సీ. పటికంపుదోనులఁ • బరఁగుగొజ్జెంగపూ, నీటిబల్లకకర • ల్దాఁటి దాఁటి
గుప్పుగుప్పునఁ దావు • లుప్పతిల్లఁగఁ ద్రోవ, నెలయుకప్రపుఁదిప్ప • లెక్కి యెక్కి
గాటంపునెఱపూఁత•కమ్మసంపఁగిచెట్ల, నీడల నంతంత • నిలిచి నిలిచి
యల్లిబిల్లిగఁ బ్రాఁకి • యెల్లతావులఁ బెల్లు, మీఱునేలకిపొద • ల్దూఱి దూఱి
తే. తెమ్మగ్రమ్మఁగఁ గడు నెడ•తెగక కురియు
నరిది విరిదేనెసోనలఁ • బొరసి పొరసి
యొఱపులకు నెల్ల నిక్కయై • వఱలునొక్క
మేటిచెలువంపువలిపువ్వుఁ•దోఁటఁ గంటి. 71

సీ. రామనామస్తుతిఁ • గ్రాలి ఫలాహార, వృత్తిఁ జరించుశు•కేంద్రములును
నీలకంఠాకృతి • నెఱపుచు నానంద, తాండవం బాడుచం•ద్రకిచయంబు
నమృతాశయంబునఁ • గమలజాన్వేషణే, చ్ఛఁ జెలంగుపరమహం•సవ్రజంబు
వనములఁ బడి మాధ•వప్రసాదముఁ గోరు, కృష్ణవేషద్విజ•బృందములును
తే. సతతవివిధాగమాంతవా•సనలవలన, నాద మెఱిఁగి నిరంతరా•మోదలీల
నలరుసిద్ధాళులును గల్గి • యవ్వనంబు, గనుఁగొనఁగ నబ్బ మొదవించుఁ•గద నృపాల.
క. ఆలీలావనమున ఘన, హేలామార్గమునఁ జెలఁగి • యిమ్మగ సుమనః
కేలీరతి నలరారెడు, బాలారత్నములఁ గంటి • భావజరూపా. 73

ఉ. ఆమహిళాలలామముల•యందు రహిం బొడగంటి దివ్యశో
భామృదుతాసుగంధపరి•భాసితరూపవిలాసలీలలన్
వేమఱు గోము మీఱి యర•విందశరాసనుచే వెలుంగుక్రొ
మ్మామిడిపండువంటియొక•మత్తమతంగజరాజగామినిన్. 74

ఉ. ఆమెలనాగసోయగ మ•యారె గణింప నొకించుకైన స
త్తోయజసూతిసృష్టిఁ గల•తోయరుహాననలందుఁ జెందద
క్కాయజుఁ డబ్బురంబుగ జ•గంబులు గెల్వఁగ నేర్చి యిద్దనున్
జాయకటారి గావలయుఁ • జామ నిఁ కేమని యెంతు భూవరా. 75

సీ. కలికి బంగరుబొమ్మ • గాఁబోలుఁ గాకున్నఁ, బలుకనెమ్మది కాస • పలుకఁ గలదె
కల్కి తొల్కరిమించు • గాఁబోలుఁ గాకున్న, నెఱయఁ దళుక్కని • మెఱయఁ గలదె
కన్నె కేదఁగిపూవు • గాఁబోలుఁ గాకున్న, జిలిబిలివలపులు • చిలుకఁ గలదె
కడిఁది వెన్నెలనిగ్గు • గాఁబోలుఁ గాకున్నఁ, గువలయామోదంబు • గూర్పఁ గలదె
తే. మేలి మెత్తమ్మికోలను గాఁ • బోలుఁ గాక, యున్న శృంగారరసయుక్తి • నొనరఁ గలదె
యహహ మనుజేశ మదనమా • యాకిరాత, ముక్తలీలాకురంగి యీ • మోహనాంగి. 76

సీ. కలికి బిత్తరి వాలు • తళుక్కుఁ జూపుల సౌరు, హరిణీవిలాసంబు • పరిభవించుఁ
బడఁతి యబ్బురపుఁ బెం • దొడల నిగారింపు, రంభాపటుత్వంబు • రవలి గెల్చుఁ
గొమ్మ నిద్దపుముద్దు • నెమ్మొగంబు హొరంగు, చంద్రరేఖాస్ఫూర్తిఁ • జౌకసేయుఁ
జాన నాడెంపును • న్నెమ్మి చొక్కాటంబు, హేమాతిశయలీల • నెగ్గులెన్ను
తే. సారసామోదసారశృం • గారగరిమ, చిత్రరేఖాశుభాకృతిఁ • జిన్నపుచ్చు
భళిర యాలేమ దేవతా • భామ యేమొ, కాక యీయ్యంద మిఁక నెందుఁ • గలదు భువిని.

సీ. కలకంఠిజఘనంబు • కాంచికాస్థానంబు, మధురామృతస్థలి • మొగుపమోవి
యన్నులమిన్న ప • దాగ్రంబు కూర్మంబు, పడఁతుక ఝిల్లు నె • న్నడుము మాతు
నీలజీమూతంబు • నెలఁత ధమ్మిల్లంబు, రాకేందుముఖి తోడు • రాజి కాశి
నలినలోచన నిమ్న • నాభి కేదారంబు, భామ చన్దోయి శ్రీ • పర్వతంబు
తే. గాఁగ నృపచంద్ర సుక్షేత్ర • గరిమ నెపుడుఁ, జెలఁగుచున్నది దాని భ • జింపఁ గలుగు
పరమపురుషున కత్యంత • భాసమాన, నిరుపమానందసంసిద్ధి • దొరకకున్నె. 78

సీ. అతివ చెక్కులు గొప్పు • నబ్దంబుల హసించుఁ, బదములు గుళ్ము న • బ్జములు మించుఁ
బోలఁతి నాభియుఁ గుచం • బులుఁ జక్రముల గేరు, గమనంబు నారు సా • గముల మీఱు
సతిమొగంబును నవ్వుఁ • జంద్రస్ఫురణ నేలుఁ, దనురుచు ల్వలపు కాం • చనముఁ బోలు
నువిదచూపుఁ బిఱుందుఁ • గువలయంబు జయించు; రదనముల్ గౌను హీ • రముల నెంచు
తే. నధిప యయ్యన్ను మిన్న సో • యగముఁ గన్న, ననిలసలిలచ్ఛదాహారు • లగుచు వనులఁ
దద్దఁ గృశియించు జడదారు • లెద్దలైనఁ, దాలిమంతయుఁ దూలి వి • రాలిఁ గొనరె. 79

క. మఱియును. 80

ఉ. చేరిక నెంత రాజు చెవి • చెంగటు వ్రేలుచు నున్న నీలముల్
కోరిక నచ్చకోరదృశ • క్రొవ్వెదసామ్యముఁ జెంద నేర్చునే
యూరక సారెకు న్మొఱయ • చుండు మధువ్రతకోటు లెంత ఝం
కారము చూపిన న్నివ్వెరద • గామిని వేనలిఁ బోల నేర్చునే. 81

క. ఘన మొకటియె నొక్కొక్కదె, వ్వ్న వృష్టి యొనర్పఁ గాని • కోమలితులు మఱి
ఘనము ఘన మగుచు నెల్లెడఁ, గొనకొని శృంగారరసము • గురియు నృపాలా. 82
తే. ఉవిద నెమ్మొమ్ముచక్కికి • నోడి స్రుక్కి, తద్విరోధంబు సాధింపఁ • దలఁచెఁ గాక
జనుల కెల్లను గడుఁ జల్లఁదనముఁ జూపు, తొగలరేఁ డబ్జముల కేల • పగతుఁ డయ్యె.
క. అంగన కన్బొమకవతో, సింగిణి లెదిరించి గెలుపు • చేకొల కవనిన్
వంగి శర మూని కడు నా, ర్తిం గొలుచు నుండెఁ జుమ్మ • నృపకులతిలకా. 84
క. అచ్చాననాసతోడను, టెచ్చపడక మొనసి తుదిని • చేకత్తి వడిన్
విచ్చెం జంపకముకుళము, చెచ్చెర మఱి నువ్వుఁబువ్వు • స్నేహం బూనెన్. 85
క. అహోవ్రతికన్ను లందము, తప్పక కన్గొను మ నుండి • తగ బేడిసమీ
లెప్పుడు నత్తెఱఁగలవడే, అప్పలు మోడుపక యుండె • నేపు న్మాపున్. 86
తే. మీలు మే లోర్వ లేకెంత • మిట్టిపడిన, నేణము ల్ప్రాణ మైనంత • యొగిరిపడినఁ
దూపు లేపార నీల నెంతే • తూలిపడినఁ, జెలువనిదు వాలుచూపుల • గెలువఁ గలవె. 87
క. మఱి మఱియుఁ దోమి తోమియు, మెఱుఁగిడక వెలుఁగ కుండు • మృదుదర్పణముల్
తెఱవనునుఁ జెక్కుఁగవ కె, త్తెఱఁగున నెన కచ్చు వసుమ • తీవరచంద్రా. 88
క. తామరసనేత్రవీనుల, తో మొనసి జయింప లేక • త్రోక్కటమున నెం
తే మలకలఁ బడి స్రుక్కుచు, వేమఱు శష్కులులు గ్రాఁగి • వేఁగుచు నుండున్. 89
సీ. ననఁబోఁడియధరంబు • నకు సాటిగా కేమొ, బంధుజీవకము ని • గ్గరధ మయ్యెఁ
దెలుప మెఱుఁగుగాదె • తెలు పద్దిగా కేమొ, కురువిందమణి త్రోసు • గుణము పూనెఁ
బోలఁతికెరదచ్ఛదంబు • న కెనగా కేమొ, కలు పూని చిగురాకు • కారు పొంచె
శుకవాణిమద్దుమోవి • కి జోక గా కేమొ, సహలి బింబఫలంబు • చప్పఁబడియె
తే. నరంబు జేతేణచక్కర • కెంపటెవికి, నీడుగా కేమొ విద్రుమం • బెల్ల బ్రొద్దు
ప్రేమఁబడి యురఁడే నయ్యారె • మాట లేటి, కన్ను దలమిన్న సోయగం • బెన్న నరిది.
క. చిగురాకుఁబోఁడినునుఁద్రోం, జిగిబిగిపలుచాలు పదొడరి • సేమంబున గె
ల్పు గొనం జాలక యెప్పుడును, మగరా ల్జగడాలు పూని • మట్టం గ్రాలెన్. 91
తే. లేమగళమున కుద్దిగా • లేక యోడి, సుడివడుచు లోన బిగి చెడి • యడుగు పట్టి
దరము దరమూని మొర సేయ • దానికి ప్రతిధ, దర మనెడు పేరు విడువక • తవిలియుండె.
తే. రతిమనోభవకేలికో • రామసీమఁ, బోదటునవచూతలతలు గాఁ • బోలు దాని
బాహువల్లి లట్టు గా కున్నఁ • బాణిపల్ల, వములు రాజిల నేర్చునే • వానితుదల.
సీ. పట్టినప్పుడె కెందె • పసదప్పి కడుమెత్తఁ, బాటూనుకొన్న న • బంతు లెనయొ

పట్టు నబ్బక రెచ్చి • పాటి జో డెడవాసి, కలఁగెడుకొదమజ•క్కవలు తులమె
పట్టి నొక్కిన శిలా•ప్రాయంబు లై చను, గోరు నాటక యుండు•కొండ లీడె
పట్టి రాచినయంత • బలువన్నియల గరం, గెడుమేటిజాళువా•గిండ్లు సరియె
తే. పట్టఁ బట్టఁగఁ దిరుగుడు•పడుచు నుండు, మేలిరతనంపుపలుబొంగ•రాలు దొరయె
యహహ ధరణీశ యుత్తలి•రాకుఁబోఁడి, కులుకుసిబ్బెంపువలిగబ్బి•గుబ్బకవకు. 94
క. నీలాహి యనుచుఁ దుమ్మెద, చా లనుచు న్నల్లచీమ•చా లనుచు జనుల్
తోలుదురు గాని చెలిరో, మాళి ప్రజ నైలుచుఘనని•యసిధార సుమీ. 95
తే. చంపకామోదవళుల జ•యింపఁ బూని, యేటితరగలు పెల్లున • నెగసి తద్దఁ
బెరిగి విఱుగుచు నుండె ని•ద్ధరణిలోన, నరయ జడభావుల తెఱంగు • లట్లు కావె.
క. సుడివడి కలఁగుచు స్రుక్కెడు, మడుఁగులు చెలినాభిపోల్ప • మాదిరి యగునే
యడవుల బొబ్బలు వెట్టుచు, నడలెడుహరు లింతికౌను•నాకృతిఁ గనునే. 97
క. తరుణీమణిజఘనమునకు, దొర గాక తృణంబు వూని • తుద లేక వసుం
ధర యొడితొడుకులఁ బడి మహి, దరములు చుట్టుపడి తావు • దరలక యుండెన్,
తే. పొలఁతి యూరుద్వయంబుతోఁ • బోరి మున్ను
గెల్వ గొన లేక పొర యూని • దళము లెలయఁ
గాచి యుండియు గెలఁ జేవ • గలుగకుంట
నంటులకు నెల్లఁ దలవంపు • లయ్యెఁ జుమ్మి. 99
క. లలనామణిపిఱుఁదులతోఁ, దుల యగుభ్రమ నుఱుక దిరుగఁ • దొడఁగె రథాంగం
బులు మఱియుఁ గుప్ప వడుచుం, బులినంబులు మెత్తఁబాటుఁ • బూనెం జుమ్మీ.
తే. కలమగర్భంబులౌ మహో•త్పలదళాక్షి, పిక్కలకు నోడి తద్దయుఁ • బీఁకెపాటి
వెన్ను చూపి తృణం బూని • యెన్న రాని, నానఁ దలవంచుచుండె నం•నారతంబు.
తే. పొలఁతిమీఁగాళ్లతో నెనఁ•బోలలేని, మోసు మొదవిన వంతులు • మునిఁగి మునిఁగి
మాటిమాటికి మేటితాఁ•బేటిదాఁటు, గట్టు చెడి పొట్టలోఁ దలఁ•గ్రుక్కకొనియె.
చ. రమణిపదద్వయంబుసరి • రా నెదఁ గోరి యనేకకల్పముల్
కమలము కంతగాత్రగత • గాఁగ జలంబుల నర్క వేఁడి యం
దమితవిభాసుగంధమృదు•తామలతల్ కమలాకరత్వముం
గమలభవాస్పదత్వమును • గాంచి తదంఘ్రులఁ బోల దింతయున్. 103
తే. జలరుహాత్మజపదనఖం•బులను బోలఁ, జాల కెంతయు రిక్కచా•ల్పెలపడియెఁ
గరనఖములకుఁ గేతకీ•గర్భదళము, లోడి కంటకభావంబు • వీడకుండె. 104

తే. బాలతనుకాంతితోఁ సాటి • పోలఁ గోరి, పృథ్వి ననలప్రవేశంబు • పెక్కుమాఱ్లు
చేసి యొఱపులఁబడెఁ గాని • వీస మైనఁ, బోలఁగాఁ జాల దయ్యె జాం•బూనదంబు.
సీ. వ్యాళము ల్దలవంచి • నేలఁ జాగిలఁబడెఁ, బూని నీలపురాలు • పూరిఁ గఱచె
నద్రులు పాదంబు • లాడక పడియుండె, వాలెంబు నేనుఁగుల్ • గేలు మోడ్చె
బెదరి చూచుచు లేళ్లు • చెదరి పాఱఁ దొడంగె, నీరజంబులు లోఁతు•నీటఁ బడియెఁ
గోయిలమూఁకలు • గొదకొని చెట్లెక్కె, సింగముల్ గుహల న•డంగి డాఁగె
తే. నవనినాయక నిఖిలలో•కాద్భుతాభి, నవవిలాసవిభా సము•న్నతిఁ దనర్చు
కలికిరోమాళికచకుచ•గమననయన, ముఖవచోమధ్యములతోడ • మొనసి యోడి. 106
మ. పలుకు ల్వేయు నిఁకేల భూరమణ యా•బంగారుకీల్బొమ్మ యా
వలికప్రంపుటనంటిక్రొమ్మొలక యా•వాల్గంటి యాశ్యామ యా
యలివేణీజనమాళికాభరణ మ•య్యంభోజపత్రాక్షి యా
తలిరుంబ్రాయపుఁగల్కిరాచిలుక యా•తన్వంగి నీకే తగున్. 107
క. అని సంగడికాఁ డెఱిఁగిం,చిన విని యత్యంతముదిత•చిత్తుం డగుచున్
జనవరుఁ డటఁ దరలి రయం,బునఁ జనియె వధూటిఁ జూచు•భులు పెదఁ బొదలన్.
క. చని చని వని వనితం బెనఁ,గొన మోహాం బంతకంత•కు న్మనమున నూ
ల్కొన నజ్జనపతి సఖునిం, గనుఁగొని యి ట్లనియె నర్మ•గర్భము గాఁగన్. 109
చ. కనుఁగొను సంగడీఁడ వన•కన్యకుఁ గాలభుజంగుఁ డిడ్డనూ
తననఖరేఖలో యనఁగ • దద్దయు మోదుగమొగ్గ లొప్పెడిన్
జనవర నీవు నవ్వికచ•సారసలోచనగుబ్బదోయిపైఁ
దనరునఖాంకురాంకములు • దద్దయు నించెదు కూర్మి మీఱఁగన్. 110
తే. అఱరుగుత్తులపై భ్రాలి • యదె మరంద, మానుచున్నది మగతేఁటి • యనఁగఁ జూడు
సామి యాలేమకుచగుళు•చ్ఛములమీఁద, భ్రాలి కెమ్మోవి తేనియ • ల్గ్రోలె దీవు.
క. చెలికాఁడ గండుఁగోయిల, నలిఁ గెందలిరాకు గం ట్లొ•నర్చెడుఁ గంటే
భళిభళి యచ్చెలివాతెఱఁ, బలుగం ట్లొనరించె దీవుఁ • భ్రమదమున నృపా. 112
క. పున్నాగముతోఁ బెనఁగొను, చున్నది లతకూన చూడు • మోహో సఖుఁడా
పున్నాగము నీతో న, చ్చిన్నెలఁ గ్రొందీఁగఁ బోఁడి • చెలిమిఁ బెనంగున్. 113
చ. పలుకుఱుఁ గీరదంపతులు • భావభవప్రధనక్రియారతిన్
మెలఁగుచు మింటిదాఁకఁ బొద•మిద్దియఁ గేరెడుఁ జూడు నెచ్చెలీ
భళిభళి రాజచంద్ర యల•పంకజపత్రవిశాలలోచనం

గలసి సువర్ణగేహమునఁ • గామసుఖోన్నతిఁ గేరెదీవికన్. 114

క. కప్పురపుబూది పైపైఁ, గప్పుచు నున్నది యనంటిఁ • గనుఁగొనుము సఖా
యప్పొలఁతి సురతవేళలఁ, గప్పను నీమేన వలపుఁ • గప్పుర మధిపా. 115

క. కలరవ మల్లదె యింపుగఁ, బలుకుచు నున్నయది చూడు • ప్రాణసఖా నిన్
గలసి రతికేళివేళల, గళరవ మొనరించు నట్లు • కలికి నృపాలా. 116

క. పలుమఱుఁ బూఁదేనెలు మెయిఁ, జిలికెడు నిదె చూడు పొగడ • చెలికాఁడ మహీ
తలనాథ నీపయిన్ హిమ, జలపూరం బిట్లు లలన • చల్లెడుఁ జుమ్మీ. 117

క. లికుచము లివె చూడుము కే, ళికి సొం పొనరింపఁ జాఁగె • లీలాసఖుఁడా
యెకిమీఁడ యల్ల జవరా, లికుచంబులు నిట్టు లలరు • లే నీచేతన్. 118

తే. హరిణి నల్లదె కాంచు మొ • య్యన వయస్యః పట్టి నబ్బిక వడి లేచి • పఱచుచున్న
దహహ ధరణీశ యమ్మనో • హరవిలాస, హరిణి నీ క్రమముగఁ జేతి • కబ్బుఁ జుమ్మి.

తే. అనుచు నర్మోక్తు లాడుచు • నవనిజాని, వనపదవినోదములు గనుం • గొనుచు నుండె
ననిన విని దేవముని నల్వ • నవలికతయుఁ, దెలుపవే యని తవిలి ప్రా • ర్థించుటయును.

మ. దళితారాతినిశాట భాసురవియ • ద్గంగాజటాజూట మం
జులరాజార్ధకిరీట ఘోరసమర • క్షోణీనిరాఘాట ని
స్తులవేదత్రయఘోట పాణితమహా • దోషాటవీఝూట ని
ర్మలధౌతాచలకూట మష్టకులభూ • గ్భామ్యత్పురోఘాటనా. 121

క. డిండీరపుండరీకా, ఖండలశుండాలచంద్ర • ఖండపయశ్శ్రీ
ఖండాఖండయశోవృత, కుండలిమండలవిభూష • కుక్కుటవేషా. 122

మాలిని. కథితశుభచరిత్రా • గ్రావకన్యాకళత్రా
మథితవిమతగోత్రా • మానిసంస్తోత్రపాత్రా
ప్రథనధృతిజిజైత్రా • భక్తచిత్తాబ్జమిత్రా
పృథులధవళగాత్రా • భీకరోగ్రాగ్నినేత్రా. 123

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రా
జ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపు
త్త్రి సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామతిమ్మకవిసార్వభౌమప్రణీతం బ
యినరసికజనమనోభిరామం బను శృంగారరసప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# రసికజనమనోభిరామము

## తృతీయాశ్వాసము.

లలితవృషతురంగా
శైలసుతాసంగ కలశ•జలధినిషంగా
కాలోన్మదభంగా ధృత
హేలాసారంగ కుక్కు•టేశ్వరలింగా. 1

తే. అవధరింపుము సురమౌని•కబ్జగర్భుఁ, డవలికత దెల్పఁ బూని యి•ట్లనుచుఁ బలికె
నట్లు వనవీథిఁ దిరుగుచు•నరిగి నృపతి, యక్కజంబుగ ముందఱ•నొక్కచోట. 2

సీ. గుజ్జులమావిమ్రాఁ•కుల నంటిఁ బ్రాఁకిన, పరువంపుదాఁకపం•దిరులదరులఁ
జలువచెంగలువబా•వులక్రేవ జాల్గొను, వలపుగొజ్జఁగినీటి•వంతచెంతఁ
బ్రోడికప్రపనంటి•బోదెచాలుప్రమోలఁ, బొరలుపూఁదేనెజ•క్కరలపజ్జ
మొల్లంపుఁదావు లీ•న్మల్లెక్రొన్ననతీవ, వెసఁగొన్నగున్నసం•పెగలనీడ
తే. మెఱుఁగుచందురురానిగ్గు•టరఁగుమీఁద, నీటుగా గోర వీణియ•మీటుకొనుచు
బోటులను గూడి జిలిబిలి•పాటఁ బాడు, చున్నయొలజవ్వనపుటన్ను•మిన్నఁ గనియె.

చ. కని యొన లేని వేడ్క నెదఁ•గ్రమ్మఁగ నమ్మగమిన్న మిన్నకా
వనజదళాక్షి చెంత కని•వారణఁ జేరి జగజ్జనానురం
జన మొనగూర్చు దానివిల•సన్మృదుగానకథాప్రశస్తి కా
త్మను గడు సోలి యి ట్లను ము•దంబున నబ్బురముం బెనంగొనన్. 4

సీ. సగసపారంగాతి•శయనిరూఢిఁ దనర్చెఁ, బొలఁతివాల్చూపులు•పొలుపు మీఱి
లాలితగతిని వ•రాళివైఖరిఁ బొల్చెఁ, బల్లవపాణిధ•మ్మిల్లగరిమ
శంకరాభరణంబు•సౌష్ఠవంబును మించె, భామినీరత్నంబు•రోమరాజి
రహిని బున్నాగాభి•రామలీల నెసంగె, నీలనీలాలక•నిమ్ననాభి

తే. యహాహా యీచాన గానవి•ద్యావిధాన
మునఁ జెలఁగి రాగ మొనగూర్చు • చొనరె దీనిఁ
గన్న మృగఖగపన్నగా•గమము లెలమి
నుల్ల సిల్లవె యని సోలు • చున్న యెడల. 5

క. అచలావల్లభుఁ గనుఁగొని, సచివగ్రామణి నితాంత•సంతోషరస
ప్రచురత నెమ్మదిఁ బొదువఁగ, వచియించెన్ హితమృదూక్తి•వైఖరి మెఱయన్. 6

మ. తలుకార్శైల్యపసిండిబొమ్మకరణిన్ • దట్టంపునెమ్మేనిచా
యలు నల్దిక్కులఁ గ్రమ్మి పర్వఁగ వయః•స్యామధ్యభాగంబునం
బలుకుంగిన్నరవీణె మీటుచుఁ గథా•ప్రాగల్భ్యము ల్చూపుని
క్కలకంఠీజనమాలికాభరణముం • గంటే నృపాలాగ్రణీ. 7

చ. ఉవిదవయోవిలాసవిభ•వోజ్జ్వలరూపకళాప్రచారముల్
తవిలినవేడ్క నీకు విత•తంబుగ ము న్నెఱిఁగించితిం గదా
ప్రవిమలలీల నీ విపుడు • పద్మముఖిం గనుఁగొంటివే కదా
యవనితలేంద్ర నావచన • మాత్మఁ దలంచిన నిక్కమే కదా. 8

ఉ. కూరిమి మీఱ నవ్వికచ•కోమలతామరసాయతాక్షి నిన్
గోరి వరించె నేని యిదుఁ•గో పదియాఱవన్నె మేల్మిబం
గారముతోడ దివ్యతర•కాంతిసముల్లసదబ్జరాగముం
గూరిచినట్లు సుమ్ము నృప•కుంజర మాటలు వేయు నేటికిన్. 9

చ. పలుకుల కేమి భూపకుల•పావన యీవనరాశివేష్టితా
చలఁ గలమేల్పొలంతుకల • సారెకుఁ గన్గొనుచుందుమే కదా
భళిభళి యెందు నేని యొక•పట్టున నీభువనైకమోహనో
జ్జ్వలలలితాంగివంటి నెఱ•చందపుఁగుల్కుమిటారిఁ గంటిమే. 10

తే. కంజముఖి నీమనోహరా•కారరేఖ, మంజుగతిఁ గన్గొనితి నేని • మదనవిశిఖ
పుంజనిష్పీడ్యమాన మై•పొదలి యాత్మ, రంజిలుచునిన్నుఁ గవయుఁ బో• రాజచంద్ర.

వ. అనిన నాసచివగ్రామణికి నృపాలాగ్రణి యి ట్లనియె. 12

సీ. అద్దిరా యీచిన్ని•ముద్దుగ్రొన్ననఁబోఁడి, కలికినిద్దంపుఁగ్రొ•క్కారుమెఱుఁగు
మెఱుఁగుగా దిది యల్ల • చెఱకువిల్దొరచేతి, కడిఁది నెత్తావి చెం•గలువదండ
దండగా దిది నల్వ • దంటతనం బేను, పడ నొనర్చినమేల్మి•పసిఁడిబొమ్మ
బొమ్మ గా దిది జగం•బుల కెల్ల మిన్న యై, సొంపారుబలుమాని•కంపుఁదొడవు

తే. తొడవు గా దిది వలరాచ•పడఁతిమిన్న, వలను గా నిడ్డ శృంగార•వనములోన
మలయు నెఱపూఁతగుజ్జులే•మావి మొక, యహాహా వనజాస్యఁబొగడ శ•క్య మెవయస్య•

ఉ. అందని మ్రానుపండులకు • నాస వహించినరీతి దివ్యసం
క్రందనపట్టణద్విరద•గామినిపొం దెదఁ గోరి వేడ్కమై
నిందుల కేగుదెంచుట కొ•కించుక నెయ్య మెలర్ప నీజగ
త్సుందరి దా ననుం గవయఁ • జూచునొ లేదొ కదా సుహృద్వరా. 14

ఉ. కన్నియ వన్నియ ల్బెరయఁ • గ్రన్నన నన్ననవిల్తుకేళికిన్
న న్నొన లేనికూర్మి మది • నాటుకొనం గవకూడ కున్నచోఁ
గ్రొన్నెలవెన్నెల న్సమద•కోకిలకాకలికారవంబులం
జెన్నతి యెన్నిబన్నములఁ • జెందఁగఁ గూడు నె యేమి సేయుదున్. 15

ఆ. అని వచించి యిర్వు•రును దమ కొకతూరి, చనిన నవ్విశాల•జలజనయన
సి గ్గసంగ నెచట • దిగ్గన జరుగునొ, యనుచుఁ దలఁచి మరల • నతని కనియె.

ఆ. చెలిమికాఁడ నీవు • వల నొప్ప ముంగలఁ, జని కడంకతోన • యనుఁగుఁజెలులఁ
గూడి క్రీడ సేయు•చేడెల తలమిన్నఁ, గాంచి వేగ దాని•కరుణ వడసి. 17

క. తిన్ననిజిలిబిలిపలుకులఁ, గన్నియ డెందంబు మిగులఁ • గరఁగింపుచు నీ
వున్నయెడ న్నెనచటికి, సన్నకసన్నన్ రయంబ • చనుదెంతుఁ జుమీ. 18

శా. ఏచందంబున నింతిచెంత కఱ లే • కీ వేగి దర్శించెదో
యేచందంబున మాటలాడి మదిలో • నింపొందఁగాఁ జేసెదో
యాచంద్రాననపొందు నా కెటువలెన్ • హత్తించెదో మేలు నీ
వాచాప్రౌఢిమ నేఁడు చూతము గదా • బాలేందులీలాసఖా. 19

తే. అని యతని వీడుకొల్పి య•జ్జనవిభుండు
గోర్కి దై వార నొకచోటఁ • గూరుచుండె
నృపసఖుండును వేల్పుఁగ•న్నియలచెంత
క్రమముగ నేగి నిలుచున్న•యవసరమున. 20

ఉ. సామజరాజకుంభవిల•సత్కుచకుంభభరానతాంగు లై
నేమ మెలర్ప లేచి యతని•నిం బ్రియమారఁగఁ జూచి భూరిసు
త్రామమణిప్రభావళివి•రాజితదివ్యసువర్ణపీఠికం
దామరసాయతాక్షులరు ము•దంబున నిల్పిరి రాజదూతునిన్. 21

వ. అట్లు గూర్చుండం జేసి యున్న సమయంబున. 22

సీ. నీలంపుగాజుల • నెఱిఘటించుపచ్చల, కీలుకడెంబుడా • కేలుమెఱుఁగు
వలిగబ్బిగుబ్బచ • న్గైలనికిఁ దార్చుచు, సాలపుక్రేఁగంటిచా • లూచ్పు లలరఁ
జిన్నారితెలినవ్వు • చెక్కుటద్దములు లే, వెన్నెలనిగ్గుల • విధ మొనర్పఁ
గమ్మచక్కెరపాన • కమ్ము లిమ్ముగఁ గ్రమ్ము, ముద్దునిద్దంపుకె • మ్మోవి గదలఁ
తే. గలికి యారాచనెచ్చెలిఁ • గని నయ మ్మెుర, నయ వసంతాగమారంభ • నమరసాల
కిసలయగ్రాసమత్తకో • కిలవధూస, మంచితాలాపముల నిట్టు • లనుచుఁ బలికె. 23
ఉ. ఎచ్చట నుండి యెచ్చటికి • సేగద వెవ్వరివాఁడ విచ్చమై
నిచ్చటి కేగుదేరఁ బని • యెయ్యది నీవు వసించునున్కిప
ట్టెచ్చట నిన్ను నేలుమను • జేశ్వరుఁ డెవ్వఁడు దప్పు కిన్నియుం
జెచ్చెర నింక మాకెఱుఁగఁ • జేయుము మాటలు వేయు నేటికిన్. 24
చ. అన విని రాచదూత వినయమ్మువ నమ్మధురాధరోష్ఠిఁ గ
న్గొని యనియె న్సరోజదళ • కోమలచారుశరీర యేను స
జ్జనపరిపాలనప్రథిత • సారగుణాకరుఁ డై సమున్నతిన్
దనరుబుతుధ్వజప్రభువ • తంసముగారవపున్వయస్యుఁడన్. 25
క. పేరు మతిమంతుఁ డం డ్రీ, ధారుణిఁ గల్యాణపురము • తరుణీమణి మా
యూరిచటికి వేఁటకు నా, భూరమణుఁడు వేనఁ గూడి • పొలుపుగ వచ్చెన్.
ఆ. వచ్చి కొంతతడవు • వనవిహారము సల్పి, యిన్న గ్రామమున ను • పేక్షఁ గొల్చె
చనుచు నీవిచిత్ర • సంగీతనాదంబు, వీను లలర నిపుడు • విని చెలంగి. 27
ఆ. నిన్నుఁ జూచి వేడ్క • నివ్వటిల్లఁగఁ గొన్ని, మాట లాడి చనఁగ • మదిఁ దలంచి
వచ్చుచున్నవాఁడు • వనజాక్షి మారాజు, మునుపడంగ నన్నుఁ • బనిచె నిటుల. 28
క. ఆపృథ్వీవరకుంజరు, రూపవయఃప్రాభవములు • రూఢిగ నీ విం
దేపారఁ జూచి మదిలో, నోపైదలి యరిది వేడ్క • నొందెదు సుమ్మీ. 29
శా. ఓరాజీవదళేక్షణాజనమణీ • యోవాక్సుధాధోరణీ
యోరాకామిహిరాకరోజ్జ్వలముఖీ • యోగానవిద్యానిధీ
యోరోలంబకదంబలంబకబరీ • యోభవ్యదివ్యాకృతీ
మారాజన్యమహేంద్రుఁ డొంపు వినుతింప న్శక్యమే యేరికిన్. 30
మ. తరుణాంభోజదళాయతాక్షి వినుమా • తథ్యంబు నామాట కి
న్నరగంధర్వనిలింపమర్త్యపతుల • న్వ్యాక్రమవ్వఁగా వేల యూ
సరసాగ్రేసరుసోయగంబు దెగడం • జాలు న్వసంతు న్నలుం

బురహూతప్రభవస్మరైలబిలతు•ష్వారూరవస్నోములన్. 31

ఉ. ఇంచుక సేపుఁబోన జగ • మెల్ల వెలుంగఁగఁ జేయుతేజుచేఁ
బంచశరోపమానుఁ డగు•పార్థివశేఖరుఁ డిందు వచ్చినం
గాంచి మనోనురాగమునఁ • గామిను లెల్లఁ గరంగి పాఱఁగాఁ
జంచలనేత్ర నాపలుకు • సత్యము గా నపు డాత్మ నెంచుమా. 32

ఉ. చెప్పెడి దేమి యానృపతి•శేఖరుచక్కఁదనంబు కన్నులం
దప్పక చూచిరేని పటు•దర్పకఘోరశిలీముఖార్తలై
యొప్పులకుప్పలైనగరు•డోరగయక్షసుపర్వకన్యలున్
ముప్పిరి గొన్న మోహమున • ముద్దియ తద్ద చలింప కుందురే. 33

క. చనఁ బూని యొక్కపలుకే, ననఁ బూనిన నెచటఁ గోప • మగునో యని లో
ననుమానించెద నైన, న్వినుమా నావిన్నపంబు • వికచాబ్జముఖీ. 34

మ. విమలాంగీతతుల న్మఖాకృతుల ము • న్వీక్షింపమో తత్ప్రకా
రము లెల్లం బరికింపమో యహహ యే•రాజాస్యలం దైన నీ
రమణీయోజ్జ్వలరూపవిభ్రమకళా•ప్రాగల్భ్యముల్ గంటిమే
రమణీ సంతతసంశ్రితామరమణీ • రామాజనగ్రామణీ. 35

క. తలుకారుకుందనముతోఁ, దొలుకారుమెఱుంగుఁదీఁగె•తోఁ దుల యగునీ
చెలువంపుమేని కారా, నెలపొం దలవడక యున్న•నిష్ఫలము గదా. 36

తే. వెలఁది నీరూపలావణ్య•విభ్రమముల, కమ్మహారాజుతోఁ జెల్మి • యబ్బెనేని
కోరి పదియాఱువన్నెబం•గారుతోడఁ, బద్మరాగంబుఁ గూర్చిన•పదిగిఁ జువ్వె. 37

క. బంధురతేజస్స్మరసిజ, బంధుఁడు గుణసింధుఁ డగుచుఁ • బరఁగెడుభూభృ
ద్గంధగజేంద్రము నిప్పుడు, గాంధర్వవివాహమునను • గైకొను మబలా. 38

చ. పలుకులు వేయు నేటికిఁక • భావభవప్రతిమానుఁ డైనయా
చెలువునితోడుతం జెలిమి • చేకుఱ కున్న నయారె నీమెయిం
గలయలజవ్వనం బడవిఁ • గాచినవెన్నెలసుమ్మ ముద్దులేఁ
జిలుకలకొల్కి నాపలుకు • చిత్తమునం దలపోసి చూడుమా. 39

సీ. కనకంబునకుఁ దావి • గలుగంగఁ జేయక, పిల్లిగడ్డలకుఁ గ•ల్పించినట్లు
పనసపంటికి మంచి•పస యొడఁ గూర్పక, ముసిడిపండ్లకుఁ దద్ద • యొసఁగినట్లు
బుధపుంగవులకు ధం•బులఁ గల్మి యొసఁగక, కూళల కిరవారఁ • గూర్చినట్లు
చిలుకను దత్తశేండ్లు • జీవింప వీయక, మటిపులి కాకుల • మనిచినట్లు

తే. గాక యుండక సత్కళా • కౌశలమునఁ, గోరి యా రాజుతో నిన్నుఁ • గూర్చ నేని
తమ్మిపూచాలిప్రౌఢత • నమ్మ మిగుల, మెచ్చవచ్చుఁ గదా నేఁడు • మచ్చకంటి.

తే. అనుచు నతఁ డిట్లు పలికిన • నాత్మలోనఁ
జాన యొకకొంత మెత్తఁబా • టూని తేనిఁ
గనుఁగొనఁగఁ గోరి యత్తెఱం • గనుఁగుఁజెలుల
కగుపడక యుండఁ గ్రమ్మిచు • నతని కనియె. 41

చ. అవు నవు మంచిప్రౌఢవె బ • ళా యళు కించుక లేక మానినీ
నివహసభాగ్రభాగమున • నిల్చి వినం గొఱగానివాక్యముల్
తవిలి వచింపఁ జాగితివి • తాళుదు మే మతియొక్కఁడైన దూ
తవు నిను నేమియుం బలుక • ధర్మము గా దని యుంటి మిత్తఱిన్. 42

కం. సురనారీమణు లెచ్చట, ధరణీజను లెచట నహహ • తరతమభావం
బరయంగ హస్తిమశకాం, తర మిట్టివెడంగుపనులు • దలఁపం జనునే. 43

తే. దూత వగుటను నోరికిఁ • దోఁచినట్లు, దివిరి మోమోడ కాడెదు • దిట్ట వగుచుఁ
గటకటా ధూర్త మేము నీ • కంటె కిప్పు, డింత యెల్లిద మైతి మిం • కేమి చెప్ప.

ఉ. మాటికి నొక్కభూవరకు • మారుని నీ విపుడే మొ తద్దయుఁ
మేటి యటంచు నెంచెదవు • మే లహహా యతఁ డెన్న మామరు
తోఁటలలోన నేరి కెన • గూరుపఁ గాఁ దగుఁ జాలుఁ జాలు నీ
మాటలు గట్టిపెట్టి చను • మా మును వచ్చినత్రోవ చొప్పునన్. 45

తే. అనుచు నవ్వేల్పుఁ గొందలి • రాకఁబోఁడి
పలుకుటయు నాతఁ డెదఁ గొంత • గలఁగుచుండె
నపుడు నృపుఁ డచ్చటికి వేగ • నరిగి దాని
పజ్జ నిలిచిన నబ్బుర • పాటుతోడ. 46

సీ. జిలుఁగుపైటాణికం • చెల పిక్కటిలి వలి, బిలుకుపసిబ్బెపుగబ్బి • గుబ్బ లుబ్బ
బిత్తరంపుఁబిసాళి • బెళుకువాల్చూపు మొ, త్తమ్ములు తమ్ములఁ • గ్రమ్మరింప
గాటంపునిడుదకీ • ల్జడంటు పెకల్ వేఁగున, నసదు నెన్నడుము జ • వ్వాడి వడఁకఁ
గట్టాణిముత్యాల • కమ్మలనును డాలు, తళుకులేఁ జెక్కుట • ద్దములఁ బొదల

తే. మంపు ధులకింపుము త్తిగ • మానికపుల, మొలకనిద్దాకడానిసొ • మ్ములమెఱుంగు
లుమ్మడిగఁ గ్రమ్మి నెమ్మేన • నొఱపు మాష, రాజవరుఁ గాంచె తేటీ యా • రాజవదన.

తే. కాంచి యాతని మోహనా•కార రేఖ
కద్భుతం బంది మేల్మే లఁ•యారె యిట్టి
సొగసుకాని మఱెం దైనఁ • జూచి యెఱుఁగ
నంచుఁ దల యూఁచి యచ్చెల్వ•మించుఁబోఁడి. 48

తే. చెలఁగి జగ మెల్ల మోహింపఁ • జేయఁ జాలు
నవవిలాసాప్తి నెసఁగుచు•న్నాఁడు చూడ
నహహ యీరాచమిన్నసో•యగముఁ గన్న
వలసి పై వ్రాలరే యెట్టి•పొలఁతు లైన. 49

ఉ. కన్నులవింటిదంటయును • గల్వల నెచ్చెలియు న్వసంతుఁడుం
గిన్నరరాజనందనుఁడు • గి మ్మనఁ జాల రొకింత యైన ని
వ్వన్నెలప్రోక మేనిచెలు•వమ్ము గనుంగొని మేలుమే లహో
కన్నులపండు వై యలరుఁ•గా జవరాండ్రకు వీనియందముల్. 50

ఉ. తుమ్మెదదిమ్మఁ బొమ్మనుచుఁ • ద్రోచునిగారపుసోగపెన్నెరుల్
కమ్మనితమ్మిక్రొన్ననలఁ • గాదనుముద్దుమొగంబు మించుట
ద్దమ్ముల నిమ్ములన్ గెలువఁ • దార్కొనునిద్దపుఁజెక్కుదోయి డా
లమ్మిక చెల్ల వీనిచెలు • వమ్మకరాంకుని నేలఁ జాలెడిన్. 51

సీ. మొలకనవ్వులవాఁడు • తళుకునిద్దామేల్కొ, డానిడాల్గలచుమే•జానువాఁడు
తొగరువాతెఱవాఁడు • తొగలసంగడికానిఁ, దెగడునునుముద్దునె•మ్మొగమువాఁడు
వెడఁదకన్నులవాఁడు • వేల్పురారాపొరు, నిరసించుసోగపెం•న్నెఱులవాఁడు
మెఱుఁగుఁజెక్కులవాఁడు•మేటిసింగపుగున్న, నడలించుజిలుఁగునె•న్నడుమువాఁడు
తే. డంబు మీఱినబవిరిగ•డ్డంబువాఁడు, కంబునిభ మై తనర్చుకం•ఠంబువాఁడు
భళిర యీరాజకందర్పు•చెలిమి నాకుఁ, గలుగ వలవదె తొలుపుణ్య•ఫలము కలిమి.

క. అని యగ్గించుచు నెదుటం, గనుపట్టువధూలలామఁ • గనుఁగొని యొకమీఁ
దనుపమహర్షాన్వితహృ, ద్వనరుహుఁ డై యరిదివలపు•వలనం బలికెన్. 53

క. మవ్వములప్రోఁక యతనుని, క్రొవ్వాఁడిలకోరి పూఁత•గొజ్జఁగివలపున్
బువ్వులచెం డహహా యీ, జవ్వని యెవ్వనియనుంగు•జాణయొ కదరా. 54

ఉ. వాలికమీల నేలునిడు•వాలుకనుంగవ మేలిజాలువా
డాలు గలంచు మేను పగ•డాల నిసీ యను మోవి వేల్పురా
తాల జయించు వేనలి తె•లంగు హొరంగు గవురయ్యె ముజ్జగం

చేలుట గాదె యీకువలయేక్షణఁ గౌఁగిటఁ గూర్పఁ గల్గినన్. 55

ఉ. దీని మెఱుంగుఁజెక్కులును • దీని వెడందపిఱుందు నందముల్
దీనిచొకారపుందుఱుము • దీనిమిటారపుగబ్బిగుబ్బలుల్
దీనిని గారపుందొడలు • దీని మొగంబును దీనికన్నులుల్
దీనివిలాసముం గని మఁదిం గడు సోలరె యెట్టిదిట్టలున్. 56

క. ఈహాటకనిభవిగ్రహ, నీహాపరితృప్తి యొదవ • నెనసిన రొండలన్
బాహాలింగనసౌఖ్యం, బాహా యింతింత యనుచు • నలవియె తెలుపన్. 57

ఉ. అద్దిర దీనిచక్కఁదన • మద్దివిజాంగనలందుఁ జెంద దీ
ముద్దులగుమ్మకౌఁగిటఁ బ్రమోద మెలర్ప వసింప కున్న రేల్
నిద్దుర వచ్చునే మరుఁడు • నిల్వఁగ నిచ్చునె కోర్కె హెచ్చునే
సుద్దుల కేమి దీనిఁ గొని • సూనశరాహవకేళిఁ దేలెదన్. 58

ఉ. ఉబ్బుచు మాటిమాటికి సముద్ధతమోహనిబద్ధబుద్ధినై
గొబ్బున నీసరోజదళకోమలవిగ్రహమోవిచక్కెరల్
జుబ్బనజాఱగాఁ దవిలి • జొత్తిక కానిక నించు కైనన
బ్బబ్బ నితాంతకంతువిశిఖాగ్ని శిఖాపరితాప మాఱునే. 59

శా. తలిరుంబోఁడులు లేరె రూపవతులో ధాత్రీస్థలిన్ వారని
రత్నాలసౌందర్యవయోవిలాసవిభవప్రాగల్భ్యశ్రీ మేరయెక్కుడీ
యలివేణీజనచూళికామణిని గన్నంతన్ మనోజాస్త్రసం
చలితస్వాంతసరోజులై తిరుగరే • సన్యాసులు న్స్వైరంబడిన్. 60

సీ. పుండరీకాక్షి యీ • భువనైకసుందరి, యాత్రేయవదన యీ • యబ్జగంధి
పర్వతజఘన యీ • భామాశిరోమణి, మాతంగగమన యీ • మంజువాణి
శాండిల్యకచ యీ • యఖండతేజోనిధి, శుకవాణి యీ • మణిప్రకరరదన
భృంగకటిభాగ యీ • బింబఫలాధర, నారదవేణి యీ • స్వాతిమిన్న

తే. యారయ నియ్యింతి పరమహం • సాకృతిని బొ, సంగి యయ్యెన్నదీ మది నరయఁగ దీని
నెయ్య మొనగూడువానికి • నిస్తంద్ర నిబిడ, నిరుపమానందయోగంబు • దొరకకుండె.

సీ. ముగుదచూపులతో శిలీ • ముఖములు నిరసించుఁ, గచపాళి ఘనసీల • రుచుల నెంచు
సతిమోము కమల • శశిలీల నలరారు, మధురాధరము విద్రు • మముల గేరుఁ
గలికిపాదములు సౌ • గంధికంబులఁ బోలు, నఖరాళి తారాళి • నవ్వఁ జాలు
నతివపిఱుందు ధ • రామితోన్నతిఁ బొల్చుఁ, గళసీమ శంఖపూ • గముల గెల్చు

తే. నలినశరాభ్రేంద్రమణిశిలాజలజకిసల, యప్రవాళాబ్జరాగకల్హారవర్తి
కర్త నగభూధరక్రమకములు సంగ్ర, హించుకొని నల్వ దీని సృజించె నేమొ. 62
సీ. తరుణి వేనలి పయోధరములఁ దెగడుఁ బ, యోధరంబులు బల్ధరాధరముల
నదలించు నెఱి యధరాధరం బెన్నఁ బ, ల్లవముల మఱియుఁ బల్లవము లంబు
జంబుల గెల్చు భుజంబులు బిసనిక, రంబుల గేరుఁ గరంబు లెప్పుడుఁ
గలఁగించు హల్లకావళులను వళు లుదం, చితజలరాశివీచికల ఖిన్నంచు
తే. మించు నెమ్మేనిడాలు గఱించుఁ బసిఁడి, నారయాగారగమహిళల సౌరు సౌర
సారసాక్షుల చెలువంబు సవతు సేయ, నీలలనయంఘ్రినఖములఁ బోలఁ గలవె. 63
తే. పస నెసంగెడుగజనిమ్మపండ్లు గిండ్లు, సిరులఁ జెన్నారుకుసుమమంజరులు గిరులు
నరయ నిమ్ముద్దుకెందలిరాకుఁ బోఁడి, కులుకుసిబ్బెంపుగబ్బిగుబ్బలకు దొరయె. 64
సీ. అవిరళవజ్రహారంబులకుఁ దద్ద, చలియించు ముత్తాలశైలములును
దుహినాంబుబిందువుల్ దొరలిన బిగి చెడి, క్రుంకెడు రాజీవకుట్మలములు
నగ్నిశిఖావాప్తి ననయంబు బిగి దప్పి, కరఁగి పాఱుసువర్ణకలశములును
జంద్రయోగమునకుఁ జాలఁ దల్లడమంది, జత వీడి చనుచలిజక్కవలును
తే. సాటియే వజ్రహారతుషారనీర, కుంకుమసితాభ్రయుతములై కుదురు మీఱి
జిగియుబిగి గల్గి యెడయక చెన్నొసంగు, కన్నియలమిన్న యిఱిగుబ్బచన్నుఁదోవకు
తే. కమలభవలీలఁ గాంచె మొగంబు నడుము, హరివిలాసంబుఁ దాల్చె బిత్తరపుగుబ్బ
చన్నులు గిరీశవైఖరిఁ జెన్నుమీఱె, నహహ యియ్యింతిమూర్తిత్రయాత్మక గద.
సీ. అలికశశికార్ముకతిలకుసుమోత్పల, కుందసౌగంధికకందుకములు
దర్పణశ్రీకారదరబిసాంబుజచక్ర, వాకగుహాహోరగావర్తములును
కదళికాతరంగసైకతపిప్పలచ్ఛదా, చలకరిశుండనిషంగములును
గచ్ఛపవల్లవకల్హారతారకా, వసుధటీరశిరీషకుసుమములును
తే. గూర్చి నల్వ ధార నలువ యొక్కొమ్మ యుంగఁ
బోఁడిఁ బోడిమి నొనరింపఁ బోలు నట్లు
గాక యుండిన నీభువనైకమోహ
నాద్భుతాకారరేఖ యెట్లైనఁ గల్గదె. 67
క. సదమా పొక్కిలి జాంబూ, నదమా మెయిచాయ కోకనదమా పద మా
పదమా జడ నడ్డుమ్ము విద్యు, త్పదమా స్వాఁ గాడు గూఢపదమా చెలికిన్. 68
తే. రాజీవముఖికనుంగవ, రాజద్గతి నెప్పుడుం దిరస్కృతి సేయుఁజ

రాజీవముల న్విచలిత, రాజీవములం బ్రఫుల్ల • రాజీవములన్. 69

తే. సరసలీలమహాఘన • చయము నాత్మ, దర్శకశ్రేణియును గూడి • తరళనయన
కచకపోలవిలాసవై • ఖరులు పొగడ, మొగి ననేకశతాబ్దంబు • లగుచు నుండు. 70

మ. గజయానం గముదాక్షిం గేసరివల • గ్న న్నీలనీకాశమ
స్తజం దారేశముఖి న్ఘనాంగదవిరా • జద్బాహ నుద్దీప్తతో
యజగర్భప్రసవోపమానరద రా • మాంగిం దగం దీని వే
భజియింప న్మనమః కదంబవరదర్పం బెల్లం జల్లాఱదే. 71

సీ. చంద్రబింబమూర్తి • జా నొప్పె నీనాతి, హాసాధరంబులు • నాననంబుం
గోకనదాకృతిం • గొనబారె నీకొమ్మ, స్తననాభిబిలములు • చరణయుగముం
గమలధరోద్వృత్తిం • గనుపట్టె నీయింతి, కరజఘనంబులు • కచభరంబు
మధుకరసాదృశ్య • విధి నొప్పె నీలేమ, మృదువచనోరువు • లెమ్మెలుంగుటారు

తే. వజ్రపుష్పాతిశయలీల • వఱలె నీవి, లాసినిరదాంగకంబులు • నాసికయును
ఛళిర యీరామ సౌందర్య • పటిమ యెన్న, నన్నలినగర్భునకు నైన • నలువ యగు నె.

క. అని యితరేతరమోహము, లనివారితగతులం బెరుంగ • ననిమిషనారీ
జనరత్నంబును భూభృ, త్తనయశిఖామణియు వగలం • దగిలిరి మిగులన్. 73

శా. ఆవేళం జిగురాకుబాకుదొర ప్రత్యాలీఢపాదస్థుండై
చేవ ల్దీరెడుతుంటవింట మధుసం • సేవాంచదిందిందిర
జ్యావల్లీనిబిడార్భటు ల్నినిచి కో • పాటోప మేపార బల్
పూవుందూపులు చిమ్మె నిర్భరపయిం • బుంఖానుపుంఖంబుగన్. 74

తే. లేమవీక్షణమాలా శి • లీముఖములు, శంబరారాతి శితసుమ • సాయకములు
గాటముగం బర్వియు నెదం • గాండుటయును, వసుమతీజానిపరవశ • స్వాంతుం డయ్యె.

క. అత్తటి బిత్తరిం గని భూ, భృత్తనయోత్తముండు దత్తరిలుచి త్తమునన్
మెత్తంబడి క్రొత్తవలపులు, హత్తంగ నెత్తెఱవ కిట్టు • లనియెం బ్రేమన్. 76

క. ఎవ్వరిదానవు నీపే, రెవ్వతె యేమిటికి వచ్చి • తిచ్చోటికి ని
న్నెవ్వడి నీ తెలం గంతయుం, బువ్వారుంబోండి నాకు • బొంకక చెపుమా. 77

చ. తొలకరిక్రొమ్మెఱుంగుక్రియం • దోంపం దళుక్కని నీవు ముంగలన్
నిలిచిన గుండె ఝల్లుమని • నీసొ సెల్లం గడంక మీఱం గ
న్నులం గనినంత నుండియు మ • నోభవుం డేమియు నిల్వనీం డహో
చిలుకలకొల్కి నన్నెదను • జేర్చి కృపామతి నుద్ధరింపవే. 78

క. అకటా మరుఁ డిపు డుల్లం, బకటావికటముగఁ జేసి • యడ లూన్చెను నీ
నికటాగ్రసీమ నిడి పూని కటాక్షవిలోకనమున • నెటిఁ బ్రోవు చెలీ. 79

క. వీటీపాటీరాగరు, హాటకతాటంకమణిమ • యాభరణంబుల్
గూటువలుగ నిడియెద నిఁక, జోటీ మాటాడి ముద్దు • చూపం గదవే. 80

క. ఈరేడుజగములం దిఁక, నేరీ నీరీతిగోతు • లెన్నిక గనునో
య్యారీ తీరగుకులుకుమి, టారీ వలతేని మేల్క • టారీ నారీ. 81

క. అలికీరపికమరాళా, వలికిం గరువలికి మరుని • వాలారుంబూ
ములికిగమిసోఁకులకు నో, కలికీ మదిఁ దాళఁ జాలఁ • గలఁత లిఁ కేలా. 82

క. కులుకుచు జిలిబిలిపలుకులు, చిలుకుచు వలిగుబ్బ లెదను • జేర్పవె మరుపూ
ములికీ కలికీ చిలుకల, కొలికీ మది నాలుకొనెను • కోరిక దీరన్. 83

క. కొమ్మా మదనునిపూవుం, గొమ్మా నెమ్మది యెలర్పఁ • గొమ్మా కడుఁ దో
ర మ్మైనసొమ్ము లిడియెద, రమ్మా ననుఁ గూడి మాపు • రమ్మన కెలమిన్. 84

వ. అని యనేకప్రకారంబులం బ్రార్థించిన నమ్మించుఁబోఁడి యించుక దల వంచి మిన్న
కున్న సన్న యెఱింగి • యన్నెలంతుక బోటికత్తియ యగుమదనమోహిని యన్న రేం
ద్రచంద్రుం గాంచి యిట్లనియె. 85

తే. అవనినాయక సుశ్యామ • యనెడుపేర, నలరు గంధర్వరాజక • న్యాలలామ
యివ్వెలందుక దీనికై • యిట్లు వగలఁ, దగులఁ దగునయ్య నీవంటి • తగవరులకు. 86

తే. కన్నవారెల్ల నగఁదముఁ • గన్నవారి, మిన్న కెంతయుఁ బో నాడి • యెన్న రాని
మున్నటీకెల మెలంగుట • చన్నె యెందుఁ, జిన్నప్రాయంపుముద్దుగా • కన్నియలకు.

తే. అని పలికి కల్కిఁ దోడ్కొని • యనుఁగుఁజెలులు
వెసఁ దదంత్రికలీత్రాని • వేశమునకుఁ
జని రటు ల్పనుచున్నఁ గ • న్గొని మహీవి
భుండు డాయంగఁ బోయి పూఁ • బోఁడి కనియె. 88

చ. నిలు నిలు పోకు బాల హరి • నీలనిభాలకజాల నీకు నే
వలసితిఁ జాల నన్నిటుల • వంచన సేయఁగ నేల చూడఁ బూ
విలుతుఁడు కూళ వాఁ డిడెను • వేదన కోరువఁ జాలఁ బ్రేమ న
న్గలయుము వేళ నమ్మరుని • గర్వము దూల విలాసలీలలన్. 89

ఉ. చక్కఁదనంబు జవ్వనము • జాణతనంబును గల్గి తీవిఁ బెం
పెక్కినదాన నంచు నొక • యించుక గర్వము పర్వ నన్నిటుల్

గిక్కురవెట్టఁ జూచెదు చెంతీ పదమా మదమార నింక నా
చక్కెరవింటిదంటునమఁజాయలకోరుల నేమి యయ్యెదోస్. 90

క. బాలా వేలాగుల బలి, మాలిన వివ కిగ్గయాళిమదఁతుల వెఱటన్
జేల వయి చనెదు మరువిరి, గోలలపాలైకరంబు గుండెదు సుమీ. 91

సీ. నీవు మాటలు నేర్పి • నెమ్మితోఁ బ్రోచిన, చిలుకచిల్కలుగుఁజుమ్ము • చిగురుఁబోఁడి
నీ వాటు దిద్ది మన్నించి పెంచినబర్హి, బర్హి యౌఁ జుమ్ము శంపాలతాంగి
నీకొలంకులఁ జేరి • నెక్కొన్న కోకంబు, కోకమౌఁ జుమ్ము చకోరనయన
నీతోఁటమధు వాని • నీటు గాంచినయలి, యలి యగుఁ జుమ్ము మత్తాలివేణి

తే. దైవబల మేరికి నొకింత • దప్పెనేని
ప్రాణబంధువు లైనను • బగతు లగుదు
రింతి యటు గాన వేగ న • న్నేలుకొనుము
కాయజుఁడు నిన్నేనఁక కొండఁ • గాచువాఁడు. 92

క. అనుమానమునఁ బ్రాణ మిడిగి వినుమా, వను మారుని బారిఁ బ్రోచి • వనఁబోఁడి కృపం
జనఁ జూచెద వలవిధి నె, క్కొనునికొలల నిన్నుఁ గట్టి • కొడితెడిఁ జుమీ. 93

సీ. వల కోఁడు వాఁడి పూ • ములికి మొత్తము లేయఁ, జలివెలుం గుడుసు వెన్నెలలు గాయ
గద్దరిజమిలి మ్రుక్కాలి బాలులు మ్రోయ, బలితంపు గంటుగోయిలలు గూయఁ
దుల్లువ ధాఁచిలుక బోదలు హాళిహాళి సేయఁ, గొల్లలజక్కవ షాఁజు • లెల్లఁ బరేయఁ
గొదమ నట్టువపిట్ట రొదలు తాలిమిఁ ద్రోయ, వెలిలావు పుప్పొడుఁ గుచాల్విసము గ్రాయఁ

తే. గమ్మకపురంపు వెనుదుమారమ్ము రేఁచి, పొరిఁబొరిఁ బ్రస్తాలితాలి తెమ్మెరలు డాయ
నయ్యయో గోల నలువకు • నలవి గాని, కడిఁది వలవంత సైకకోర్వఁ • గల్లవై చెప్పుమా.

తే. చాన ననుఁ జూడు గడితంపు • నాన వీడు, కేరి మాటాడు కుసుమాస్త్ర • కేళిఁ గూడు
చెలులఁ దెగనాడు నీకు • నీచేత నాఁడు, తల్లియాన యంచు ముద్దరాఁ • చిలుకతోడు.

క. అనుమాటలు విని మానిని, యనుమానించుచు వట్టువ • వ్వడవాన్యాపదుక్
నెన రొదవ మదనమోహిని, గన్గొని యిట్లనియె నేర్పు • గడలుకొనంగన్. 96

ఉ. మోహసమగ్రతం బ్రియుఁడు • ముద్దియయుం గవగూడి కోరి యు
త్సాహమునం జెలంగ నెడ • జంట దొలంగి చనంగఁ జేయుటల్
ద్రోహము గాదె హెచ్చరిక తో నిను వేఁడెద నాకు నీజగ
న్మోహినిఁ గూర్పవే మదన • మోహిని శాశ్వతపుణ్య మబ్బెడిన్. 97

ఉ. కామదురాపతాపమ్మాత్రిఁ • గ్రాఁగుచుఁ జక్కని కోడెకాఁడు దైదన్

శేమఱుఁ బ్రేమ యుల్లసిల వేఁడుకొనంగ ననంగసంగరో
ద్దామవిహారలీలలు ముదం బొనరించి కటంచ లేనియా
కామినిసోయగం బడవిఁ గాచినవెన్నెల గాదె చూడఁగన్. 98

క. మీరామామణి కడిఁదియొ, యారమణితో మమ్ముబోంట్లు కాస కొలుపుచుం
గారా మారఁగ గడితఁపు, టారామముల న్నెలంగు టన్మాటె చెపుమా. 99

తే. తలిరుఁబోఁడికి గాదిలి చెలులు మీర
లిందఱును గల్గుటకుఁ జేతి కందినట్టి
మేలు పోఁ ద్రోచెదరు గాని మీఁద వచ్చు
చెపు గొంకించుక యైనఁ బో నిడఁగఁ గలరె. 100

క. శుకవాణికి నాపై నిం, చుక కూరిమి గలిగి యున్న చో నప్పనయకె యాఁ
రక యెడ సేయఁగఁ జూచెదె, వకటా మునుకొనస్య సరసుశాలవు గదవే. 101

తే. అరచెంతని యెందు నీయందు వదనపొందు, నాకు సమకూర్చి తేని యానేకమణివి
భూషణాదు లొసంగి యొప్పుదును మదిని, మదనమోహిని నీమేలు మఱువ సుమ్మి.

క. అని పలుకునెడలఁ జెలు లె, ల్లని దేమిటిజోలి సరి బాలా పదపదరే
యని చెలిఁ దోడ్కొని పొబ్బనఁ, జని రంత విభుండు గుండె ఝల్లన లీలన్. 103

వ. అచట నొక్కచక్కటి పుటిక్కరారాచట్టుపయిం జతికిలం బడి నెమ్మొగంబున
దైన్యం బిగురొత్త వెచ్చ నూర్చుచు సంగడికాని మొగంబు చూచి యి ట్లనియె.

ఉ. అక్కట మిక్కుటంపుగొన బారఁ దళుక్కని తో లెమ్మటుంగున
ట్లక్కజ మొప్పఁ గాఁబడి యాసలు చూపి కటంచి యిప్పు డా
చక్కరబొమ్మ రొచ్చటికిఁ జాఁగెనొ నన్నిసురించి యింక నా
చక్కరవింటిజోదు కొసుసు జాతు లకోరుల కోర్వ వచ్చునే. 105

చ. ఎటువలెఁ దాళువాఁడ నిపు డెవ్వరి నేమని దూఱువాఁడ న
క్కటికలశీరోజ నెయ్యెడల గొబ్బనఁ గన్గొనువాఁడ నెట్టు లె
క్కటితలిరాకుబాకు మొన గానిహాళాహళి కోర్చువాఁడ న
క్కటకట చెల్మికాఁడ వలకాఁకలఁ దాళ నిఁకేమి సేయుదున్. 106

సీ. పాలఁతుక జిలిబిలి పలుకు బోటులకును మగమనిద్దపుముద్దుమాటలకును
ననఁబోఁడిచిన్నారినగవు చూపులకును, గొమ్మ బళుకు మేలొక్కపులకును
రాకేందుముఖిచొక్కారపువెన్నెలకును, జేడియమురిపెంపుఁజిన్నెలకును
గలికిచన్గుబ్బగుబ్బలలాలిత్యకును, జెలువచొక్కపుఁదళుక్కుఁజెక్కులకును

తే. వలసి సొలసితి నది నన్నుఁ • గలసి మెలసి, బలసి కోర్కులు దీర్పక • తులువకలువ
విరిలకోరీవజీరుబ•ల్వైతలఁ ద్రోచి, చనె నయారె యిఁకేజాడ • సైఁపువాఁడ. 107

సీ. బలితంపుగండుఁగో•యిలలకూఁకలకును, దలిరువాల్దులువబ•ల్దాఁకులకును
గొలఁకునెత్తావిసో•కుడులవీఁకలకును, వలపుగొజ్జెఁగనీటి•వాఁకలకును
మెదలుటాటోటుతు•మ్మెదలప్రోఁకలకును, గలువసంగడికాని•కాఁకలకును
జొన్నెందుకలికిరా•చిలుకమూఁకలకును, మురిమించుక్రొమ్మావి•మోఁకలకును

తే. జాలఁ దూలెద నిఁకఁ దాళఁ • జాలఁ జాల, మేలు మేలుర నమ్మోద్దు•బాల లీల
వైళ మివ్వేళఁ గూర్చిన•స్నేలుకొనుము, చెలిమి గడు డెందమున నిండఁ•జెలిమికాఁడ.

వ. అని యనేకప్రకారంబులం దగిలి వగలం బొగులుచున్న యారాచమిన్నం గనుంగొని నర్మసఖుం డిట్లనియె. 109

క. ఓ ఱేఁడ నీవు పలుమఱుఁ, గాఱడవులవెంట నన్య•కామినికొఱకై
కాఱియలఁ బడుచు వలపులు, మీఱఁగ నవియింపఁ జనునె • మే నలయంగన్. 110

క. పలుదెఱఁగులఁ బెఱచెలికై, వలకాఁకలఁ గ్రాఁగి వేఁగ • వలవదు నీకున్
వలచిన మఱి యొందును వలి, కులుకుంబ్రాయంపుము•ద్దుగుమ్మలు లేరే. 111

చ. పటుమతిఁ జిత్తగింపుము నృ•పాల విరోధివధూధినీధవ
స్ఫుటమకుటాగ్రరత్నఘృణి•శోభితపాదసరోరుహుండ వీ
విటు లొకయన్యపంకజద•ళేక్షణకై పలుమాఱు సోలుచున్
గటకట యింత గాసిఁ బడఁ • గార్యణ మేమి కడింది మీఱఁగన్. 112

క. వేలాగుల నన్యవధూ, లోలుఁడవై నాన యుడిగి • లోఁగెదు ధరణీ
పాల విను "కాముకస్య కుతో లజ్జా" యనెడునుడువు • తుది నిజ మయ్యెన్. 113

క. కొదలేనివగలఁ బొగులుచుఁ, గొదకొని వనిఁ దిరుగ నేల • గొబ్బున నిపు డో
సుదతీజననవమన్మథ, పదమా ముద మార వసన•భవనంబునకున్. 114

వ. అని యనునయింపుచు నర్మసఖుం డతనిం గ్రమ్మఱ దోడ్కొని వచ్చుచున్నయెడ నారాజన్యపుంగవుండు మున్ను న్నిలింపవనితంబినీమణులు విహరించి చనినవనంబు చొచ్చె. 115

సీ. పద్మరేఖావృతాం•బరచరప్రమదాంఘ్రి, పద్మలాక్షాంకిత•ప్రాంగణములు
దివిషన్నితంబవ•తీకబరీభర, ప్రస్తామరద్రుప్ర•సవచయములు
గంధర్వకులరాజ•కన్యాస్తనాలిప్త, హరిద్రముద్రితా•బ్జాకరములు
పౌరనారీమణీ•సరసవిహారక్రి, యాప్రఫుల్లన్మనో•జ్ఞాగమములు

తే. క్రతుభుగంభోజలోచనా•కృతమనోజ, పూజనాయత్తఫలగంధ•పుష్పధూప
దీపనైవేద్యముఖ్యవి•స్తీర్ణవస్తు, సంతతులు చూచి పరవశ•స్వాంతుఁ డగుచు. 116

సీ. ఈకళావళిచెంత • రాకేందుబింబాస్య, తివిరి యంచకు నడ • ల్దిద్దుచుండె
నీమహీజమునీడ • నిందీవరేక్షణ, చిలుకకుఁ బలుకులు • చెప్పుచుండె
నీదరీతటిదరి • నిభరాజగామిని, నెమ్మికి నాటలు • నేర్పుచుండె
నీనికుంజముదండ • మానినీతిలకంబు, తొడరి శారికి మేఁత • లిడుచునుండె
తే. నీనిశాకాంతకాంతమ•ణీనిశాంత, కాంతనవరత్నమయవేది•కాంతరమునఁ
గాంత జిలిబిలిపాట లే•కాంతలీలఁ, బాడుచుండెఁ గదా చెల్మి•పడఁతు లలర. 117

సీ. సకియక్రొందళుకుపి•సాళిచూపులకోపు, ముగుదనిద్దపుముద్దు•మోముగోము
కొమ్మసిబ్బెపుగబ్బి•గుబ్బచన్నులచెన్ను, కోమలాంగివెడంద•కొప్పుకప్పు
రాకేందుముఖినిగా•రంపుఁజెక్కులటెక్కు, సుందరివలుదపి•ఱుందునందు
గంధసింధురయాన•ఘనతరోరులతీరు, హరిణనేత్రమెఱుంగు•టారుసౌరు
తే. దలఁచుకొన్న జగం బెల్లఁ•దన్మయముగఁ, గనఁబడుచు నున్న దింక న•క్కలికిమిన్న
నెందుఁ గన్గొనువాఁడ నా•డెందమునకు, నక్కటా మిక్కుటం బైన•యార్తి వొదవె.

క. ఏలా హేలాలీలల, నోలిం గ్రీడించునద్ది•వౌకఃకులరా
డ్బాలామణిఁ బోఁ బనిచితి, బేలతనం బొదవ రిత్త • బెదరించి యయో. 119

క. నిర్భరపుణ్యఫలప్రా, దుర్భవు లగుసుజనులకును • దొరకుం గా కా
స్వర్భామాసాంగత్యము, నిర్భాగ్యుఁడ నైననాకు • నేఁ డెటు లబ్బున్. 120

వ. అని తలంచుచుండి మఱియు సంగడికాని కి ట్లనియె. 121

క. చెలికాఁడ యెట్టినోములు, సలిపెనొ యిగ్గోఁగుమ్రాను • జలజేక్షణ నుక్
జిలిబిలిముద్దుంబలుకుల, నలరించినఁ బెంపుఁ గాంచె • నభినవలీలన్. 122

చ. చెలిమి దలిర్ప నానవకు•శేశయపత్రవిశాలనేత్ర ను
న్నలపపుఁగమ్మఁదావులు ఘు•మ్మనఁగ నిమ్ముగఁ గ్రుమ్మరించుబ
ల్కులుకుమిటారిగబ్బిచను•గుబ్బల నొత్తి కవుంగిలించె నా
భళిభళి యిక్కురంటకము•భాగ్యము చెప్పఁ దరంబె నెచ్చెలీ. 123

చ. వలఁతితనం బెలర్ప నల•వారిజపత్రవిశాలలోచనా
తిలకము నన్నొకించుకయుఁ • దేఱి కనుంగొన దయ్యెఁ గాని యీ
తిలకమహీజరాజము న•తిప్రియతం దనసోయగంపుఁడా
ల్సోలపుఁబిసాళిక్రొందళుకుఁ•జూపుల బి ట్టలరించెఁ బో సఖా. 124

క. విధుబింబానన పుక్కిటి, మధు విడి యిప్పాగడమ్రాను • మన్నించెఁ జెలీ
మధురాధరాధరాంచ, న్మధురస మిడి కనికరమున • నన్ బ్రోవదుగా. 125

క. మహిళామణిపాణిసరో, రుహసంస్పర్శం జెలంగి • క్రొన్ననలెత్తెన్ •
సహకారభూజరాజం, బహహా నా కిట్టిభాగ్య • మబ్బునె సఖుఁడా. 126

క. వలనుగ నమ్ముద్దుం బై, దలి వలి నిట్టూర్పుకమ్మ • తావులచే వా
విలి కనిచె ననఁగ నిది వే, ల్పుల ము న్నెవ్వారి నెట్లు • పూజించెనొకో. 127

తే. చేడియలమిన్న మృదుపద • తాడనంబు
గాంచి యంచితసుమనోవి • కాసలీల
నలరుచున్నది కంకేళి • యహహా దీని
పుణ్యఫల మెన్నఁ దరమె యిం • పుగ వయస్య. 128

క. పాటలగంధిచొకారపుఁ, బాటల నీప్రేంఖణంబు • బహుతరసుమనః
పాటనమున నలరెడు ని, ప్పాటలిఁ బాడింప నెంత • భాగ్య మనుంగా. 129

తే. కన్నియలమిన్న చిన్నారి • క్రొన్నగవుల, వన్నియలు మీఱ నిప్పొన్న • గన్న నలరఁ
జేసెఁ గాని యయ్యో నేఁడు • చెలిమికాఁడ, నన్నుఁ గన్గొని యొక్కింత • నవ్వ దయ్యె.

క. చెలిమోము కళలసంపఁగి, నల రొందం జేసె నది వ • యస్యా ననుఁ దాఁ
దల యెత్తి చూడ దయ్యెను, జెలువకు నే నేమి తప్పు • చేసితిఁ జెపుమా. 131

వ. అనుచు వెండియు. 132

క. అమ్మానిని జేఁదు వనిం, ద్రిమ్మరుచో నొక్కపువ్వు • దీవియపై జుం
జుమ్మని మొఱయుచు నాడెడు, తుమ్మెదఁ గనుఁగొని కడంక • తో నిట్లనియెన్.

చ. అమరనితంబినీముకుచి • రాననసారససారసౌరభ
భ్రమఁ బఱతెంచె దేమొ మద • బంభరరాజమ శంబరాహితా
సమసుమసాయకవ్యథలఁ • జాలఁ గలంగుచు నున్న నా తెఱం
గమలకృపాంతరంగమున • నప్పువ్వుఁబోఁడి కెఱుంగఁ జెప్పుమా. 134

క. అలికులతిలకమ నినుఁ గ, న్నులఁ జూచినయంతలోనె • నూల్కొను ప్రేమం
జెలితుఱుము నాఁటఁ జూపులఁ, దలఁప మ్మెడు నింక నెట్లు • దాళుదుఁ జెపుమా.

మ. క్రతుభుక్కంజముఖీవియోగభరవి • క్లాంతుండనై యివ్వనిన్
వెతలం గుందుచు నున్న నన్నుఁ గరుణన్ • వీక్షించి నీ వీమెడన్
బ్రతికింపంగఁ దలంచి వచ్చితివి మే • ల్భళ్యాంగశోభాధరీ
కృతజంభారిశిలావినిర్మలఘృణీ • యిందిందిరగ్రామణీ. 136

ఉ. అక్కట మిక్కుటంపువిరహానలవేదన కోర్వలేక ని
న్నక్కఱతోడ వేఁడెద దయామతి నోయెలదేఁటిమిన్న నీ
చెక్కులమీఁద నన్నునిచి తెంగున నుప్పరవీథి నేగి యా
చక్కరబొమ్మపాదజలజమ్ములసన్నిధిఁ జేర్పు నేర్పునన్. 137

తే. అక్కటా నీవుఁ గల్గిన చెక్కు లిపుడు
నాకుఁ గల్గిన మింటు నందముగఁ బఱచి
యమరభామినికుచగిరులమీఁద
వ్రాలి సుఖియింతుఁ గద మధువ్రతకులేంద్ర. 138

సీ. అవనిఁ బరోపకారార్థ మిదం శరీ, ర మ్మని యార్యజనమ్ము లెపుడుఁ
బలికెడుమాట యేర్పాటుగా నీవు ము, న్నిని యుండుదువె కద విను మళీంద్ర
నాకొఱ కిపుడు క్రన్నన నేగి గంధర్వ, కాంతాలలామంబు గాంచి వెరవు
మెఱయ నిత్తెఱఁ గెల్ల నెఱిఁగించి దాని నె, ట్లును బుజగించి తోడ్కొని రమ్ము
తే. కాక యుండిన నామొఱ గాఁ దదంఘ్రి, వనజయుగ్మంబుపై వ్రాలి వినతు లొసఁగి
యదుగకోనిద్దైన నిచటికి నప్పుడే తెచ్చి, యనుపమాగణ్యపుణ్యవ్రతనలమనుము.

వ. అని యొడయని తొడరుల బడలి యడలుచున్న యొడయని మెల్లనె యూఱార్చి స
ఖుం డెట్టకేలకుఁ బటకుటీరాభ్యంతరంబునం జేర్చిన నమ్మహారాజచంద్రుండు. 140

సీ. పగడంపుఁగంబము లచ్చరాబోదెలు, గోనబారు వెలుకమాలు గోడబారు
పలితీగఁ డారు తళుక్కుపసిండిపందిళ్లు, జరబాబుచందువా సౌరుమీఁఱు
గుజరాతికెంపు రాగంపుజొంపములు ము, త్తెంపుజాలీలు దట్టంపుతావి
నిరవు నునుగ్రంచిగండంపుమేకులు జగా, డంబాటుపరాంబట్టుపంబుదాళ్లు
తే. గలిగి యభినవశృంగారగౌరవమునఁ, జాల నలరారు డేరాహజారమునను
గడిదిడంతెపుఁగోళ్ల చెక్కడపుఁబనిక, డానిమంచముమీఁద నెమ్మేను చేర్చి.

క. ఉసు సను రంచుం బొరలుచుఁ, గసరుచుఁ గ్రొవ్వేఁడియూర్పు గాడ్పులు నిగుడన్
బసచెడి బుసకొట్టుచు వెస, మసఁ గిడి వలకాకక డల్లి మునుఁగుచు నుండెన్.

వ. మఱియును నర్ధరాత్రపుఁగవుండు నిజాంతరంగం బయ్యంగనామణి జగన్మోహనాంగ
శృంగారరసాభంగరంగత్తరంగిణీసంగతం బై మునుంగ నింగితం బెఱుంగక లొంగి
కలంగి బెంగగొని నింగియుఁ బుడమియుం గనరానియనంగభవదురాపతాపాటోప
మహాంధకారంబు ఘోరంబుగఁ దొరంపుఁగన్నుంగవం గప్పనం గప్పుకొన్న నే
త్రద్వయం గానరాక చీకాకుపడి వీఁక చెడి యుడలి బడలి యొడలిబిగి సడలి గడగడ

వడంకుచుం గొంకుచు బెగడి దైవంబుఁ దెగడి నిగనిగ జిగిదళుకొత్తు క్రొత్తనెత్తమ్మి ఱేకులపస న్నిరసించునిడువాలుకన్నుంగవం దొఱంగుబుడిబుడి వేఁడికన్నీరుబడిబడి నిద్దంపులేఁజెక్కుటద్దంబులం జాలువాఱ రాకానిశాకరబింబప్రతిమానమానితవదనా రవిందంబు వాడుదేఱ గుజరాతిపచ్చరాతి మెఱుంగుహారంగులం బొంగారుబంగా రుచిలుకతాళిమేలిపసిండివన్నియజన్నిదంపుగుంపుతోడం బెనంగొని కరంబునురంబు నందారజగానిగారంపుసొంపు పెంపునంగనుపట్టు హొంబట్టుబొందుపొందుపడం జుట్టి కట్టినవెడందక్రొమ్ముడి సడలి నెత్తావిక్రొత్తచెంగలువక్రొవ్విరులు వ్రీలంగూరఁ జిన్నా రిక్రొన్నెలనెన్ను నెన్నొసలం జెన్నారుతిన్ననిసన్నంపుకమ్మకస్తురిరేఖ యొక్కుమ్మ డి ముమ్మరంపుచెమ్మటంబుం బద నెక్కి నెమ్మొగంబునం గ్రమ్మ పాఱ హారకేయూ రకటకకంకణక్షుద్రముద్రికాదిమహాభరణంబులు సడలి జాఱ బలితంపువేఁడినిట్టూ ర్పుగాడ్పుసెగలం గంది కెందలిరుటాకుబ్బృందంబులం దెగడుతొగరువాతెఱ తెలు పు మీఱ నుస్సురనుచు నమ్మలింపుచు నుదరిపడుచు బెదరి బెదరినడెందంబుతోడం గళవళింపుచుం గటకటా యనుచుం గ్రన్నన లేచి తల యూఁచి దిశలు చూచి వి వేకంబు ద్రోచి విరిసరంబు లవని వైచి యేచినతమకంబున నాచిగురుటాకుంబోఁడి నాడెంపుఁగడాని మేనిజానుమానసంబునం దలపోసి గాసిలి వాసిం బాసి చెయువులు దోసి కఱకుబెఱకుచెఱకువిలుకాఁడు బిఱబిఱం బఱగించు చుఱుకువిరిచిలుకుమొత్తంబు లు చుఱచుఱ నదరంటం గాఁడిన సోలితూలి తాలిమి వ్రీలి పర్యంకభాగంబున వ్రా లి ఘోరమారవికారాపస్మారదూరితవివేకుం డగుచు నంత నప్పంకజాక్షీసమక్షంబు న సాక్షాత్కరించినట్లు గనుపట్టినఁ బట్టరానియాశాపాశంబులం గట్టువడి గుట్టు చె డి బిట్టువడి నెట్టకేలకు హాబాలఫాలతలాలోలనీలనీలాలకజాల జాల మేల జాలిం దా ళఁ జాలఁ జాల నిక్కరాళమయూరకీరశారిహారీతపారావతపరభృతప్రముఖవివిధవ్రా తసమేతాయాతమనోజాతకిరాతకరాతతాతిశాతసీతచూతాబ్జాతశిలీముఖసంఘాత యాతనోద్ధూతభీతభీతచేతస్కుండ నైననన్ను నన్యుంగాఁ గనుంగొనక కనకకలశోప మానానూనపీనపయోధరద్వయం బురంబునం గదియించి కుదియించుచు హాళిం బైకొ ని మనోజసరోంతరాళనాళీకమృణాళనాళసదృగ్భుజలతాయుగంబున బిగ్గఁ గౌఁగి లించుచు ధగద్ధగాయమానమానితహీరప్రభాపుంజరంజితహాటకతాటంకంబులు మక రకేతననూతనముకురఫలకోపమానంబు లగుగండభాగంబులం దాండవం బాడ సురేం ద్రనీలనీకాశకేశపాశం బవటుప్రదేశంబునం జిందాడఁ దిన్ననిసన్నంపువెన్ను ఝుము గడ గడ వడంకఁ గ్రొత్తహురుమంజిముత్తియంపుసరంబులు దిరంబుగఁ గులుకుసిబ్బెంపు

గబ్బిగుబ్బలపయిం బరిపరిగతుల నర్తింప మంజుమంజీరకంకణకింకిణీవిరావంబులును
గళరవసీత్కారంబులం జెలంగ నఱమోడ్పుకన్నుంగవం జాఱుకుఁదళుకువాలుంజూపు
లేపు మూపఁ గమ్మకస్తురికలపంపుఁబూఁత దట్టంపుజెమ్మటసోనలం గరంగి నెమ్మె
యిం జాలువాఱఁ గేరి డాకేలం జెక్కిలి గొట్టి ధట్టించి రెట్టించుతమకంబున నుప్పొం
గి విప్పుగ నాగొప్పకన్నుంగవం గప్పుకొనం గప్పురంపురజం బొప్పుగ గుప్పుగుప్పున
గుప్పిళ్లకొలందిగ గుప్పుచుం జక్కెరకెమ్మోవిపంటం బట్టి చుఱుక్కున నొక్కి చొ
క్కుచుఁ గులికి కిలకిల నగి కిలికించితరసంబు చిలుకుచుఁ దేనియ లొలుకం బలుకు
చుఁ బలుదెఱంగులఁ బుంభావసంభోగక్రీడావినోదంబుల మోదం బొడఁగూర్చి
యాదరించి మనుచు మనుచుం బాణియుగం బెత్తి మ్రొక్కి బతిమాలుచు బయలు
కౌఁగిలింపుచుఁ బలుకరింపుచు బాష్పాంబుపూరంబు నించుచుఁ బలవరింపుచు నుండి
కొంతసేపునకుఁ దెలివిం దెచ్చుకొని మరునిప్రభావంబునకు మెచ్చుకొని తనుఁ దా
నె నొచ్చుకొని క్రచ్చుకొని యింక నెవ్వా రివ్విధం బప్పువ్వుఁబోఁడికి నెఱింగించి
మది కరంగించి కూర్చి పేర్చునిమ్మదనవేదనానలంబు చల్లార్పం గలవా రని యనేక
ప్రకారంబుల మనోవికారంబులం బొరలుచుండి దానహీనభూనాయకుండునుం
బోలె నాకుకవిసంభాషణప్రసంగవిముఖుం డై శాస్త్రజ్ఞానానభిజ్ఞభిషగ్వరుండునుం
బోలె సంపూర్ణచంద్రోదయలక్షణపరీక్షానపేక్షితుం డై కుకవియుంబోలె సుశబ్దా
లంకారమార్గరహితుం డై సమరభీరుండునుంబోలెఁ బరశిలీముఖగరుత్మరుద్ఝంకార
వికంపితస్వాంతుం డై బలవంతం బగువలవంతం బొగులుచుం డె వెండియు. 143

ఆ. పరవశాత్ముఁ డై ప్రపంచంబు మఱచి జ, గంబు దన్మయంబు • గాఁగఁ దలఁచి
గుణవిహీనుఁ డగుచు • గణుతింప నతఁడు ని, యోగి యై కృశింపు • చున్నయెడల,

క. మతిమంతుఁ డట్టిగాటపు, వెతలం బడి పొరలునవని•విభుఁ గన్గొని హా
క్షితివర నీ వి ట్లెఱుఁగున, ధృతి చెడి యడలంగఁ దగునె • దీనతతోడన్. 145

క. పురములు విడి పాఱవె కుల, తరుణులు వెత పడరె బుధులు • త ప్పెన్నరె నీ
సరిదొరలు నగరె వంతలఁ, గర మడలరె ప్రజలు నీప్ర•కారము విన్నన్. 146

మ. అకటా భూపకులాగ్రగణ్య నయవి•ద్యాభ్యాసపారీణతా
ధికసంశుద్ధమనస్సరోరుహుఁడ వై • దీపించునీ విట్లు నేఁ
డొకసీమంతవతీవతంసమునకై • యో ర్పింతయు న్లేక యూ
ర్థక చింతాకులవృత్తి నుండఁ దగునే • ప్రజ్ఞావిహీనుండ వై. 147

మ. కరు లశ్వంబులు నందలంబులు శతాం•గంబు ల్మణీభూషణాం

బరమేష్టిమృగనాభిచందనధన • ప్రాసాదదాసాదులుం
దరుణుల్ కాళులు ఛత్రచామరము లుం • ద్యల్లీలలం గ్రాలునీ
ర్భరసామ్రాజ్యభరంబు వో విడిచి చే • డ్పాటొంద నీ కేటికిన్. 148

క. ధరణిం గలజను లందఱు, దిరముగఁ దమయాజ్ఞ మెలఁగ • దృఢతరసామ్రా
జ్యరమాయుతు లగునరపా, లుర కెందును దైన్యవృత్తి • లోఁగం దగునే. 149

క. వసుధాధిప మృగయాద్యా, తసతీముఖ్యంబు లగుచుఁ • దనరెడు సప్త
వ్యసనములఁ బొరలుమనుజుం,డు నెడుం గడుసౌఖ్య మెన్న • డుం గనకార్తిన్. 150

క. భళిభళి విను విటవేదలోఁ, దలఁచినఁ బదివేలు ముద్దు • తలిరుం బోఁడుల్
గలిగెదరిటువలె గడితపు, వలవంతం జెందికంద • వలదు నృపాలా. 151

క. మదిరాక్షులవలలం బడి, మొదలం జెక్కుండ్రు బన్న • ములఁ జెందిరహో
పదివేలు వచ్చె నింకం, బొడ్డమా రొద మాని వేగ • బురవరమునకున్. 152

వ. అనిన నతని కానృపతి యిట్లనియె. 153

మ. పురము ల్పోయినఁ బోవనీ బుధులు త • ప్పు ల్పట్టినం బట్టనీ
తరుణు ల్గుందినఁ గుందనీ ప్రజలు వం • తం జెందినం జెందనీ
సరివార్న వ్విన నవ్వనీ సచివ సే • సంప్రీతిఁ దద్దేవతా
హరిణాక్షీనిబిడోపగూహనసుఖా • యత్తుండనై యుండెదన్. 154

సీ. కలకంఠిపిల్పింపు • గబ్బిగుబ్బలసౌరు, తరుణిలేఁజెక్కుట • ద్దములతీరు
నెలఁతనిద్దపుముద్దు • నెమ్మొగంబుహొరంగు, చానవాడెంపునె • న్నెమ్మేనిరంగు
కలికిబిత్తరివాలు • తళుకుఁజూపుల యొప్పు, విరిఁబోఁడిమెఱుఁగు • పెందుఱుముదువ్వు
కరిరాజయానచ • క్కెరకెంపుఁబెదవిసొంపు, సుందరివలుదపి • ఱుందుపెంపు

తే. డెందమున నాటు మిగులఁ గ • డిందివలపు, గందళించుచు నున్న న • మ్మందయాన
పొందు చేకూఱ కెవ్వ రే • చందమునను, మందలించిన సడలదే • మందు సఖుఁడ. 155

క. వారవతు లందలంబులు, వారణహయమణిమణీని • వసనవసనభూ
షారజితకాంచనము లా, నారీమణిజోక లేక • నా కేమిటికిన్. 156

ఉ. సంగడికాఁడ చేడియలు • చాలఁ గలా రని నీవు నివ్వడి
భంగి వచింపఁగాఁ దగునె • భావమునం బరికించి చూడుమా
యంగన లెంద ఱైన సరి • యాదురె యాపదియాఱువన్నె మే
ల్బంగరుబొమ్మకున్ దలిరుఁ • బ్రాయపువేలుపుముద్దుగుమ్మకున్. 157

చ. సచివకులేంద్ర యువ్విక చ • సారసపత్రవిశాలనేత్రపొం

దచిరగతి ఘటించి నను • నర్మిలిఁ బ్రోవుము కాకయున్న నీ
యచలగృహప్రదేశమున • యందుఁ దపం బొనరించుచుందు నీ
విచటఁ దొలంగి వేగఁ బురి • కేగుము మాటలు వేయు నేటికిన్. 158

తే. అనుడు వెయ్యేఁడు వెఱఁగంది • యకట యితని, కగ్గలం బయ్యె విరహార్తి • యంతకంత
కింకఁ గానకుఁ దోడ్కొని • యేగి కొంత, వంత మరలింతు నని యంత • సంతసమున.

వ. అతనిం దోడ్కొని చని వనిం బ్రవేశించిన నమ్మహీమహేంద్రుండు. 160

సీ. పొలఁతిపాలిం డ్లంచుఁ • బొన్నకాయలు వట్టి, హా యివి పొన్నకా • యలె యటంచు
నతివ వెన్నొడ లంచు • నంటికంబము లంటి, భళి యివి యంటికం • బములె యంచుఁ
గలికిముంగురు లంచు • నెలదేంట్లఁ బట్టి య, య్యో యివి యెలదేటు • లే యటంచు
మగువ కేల్గవ యంచుఁ • జిగురుటాకులు ముట్టి, చెల్లఁబో యివి తేఁజి • గుళ్లె యనుచు

తే. వనితవాతెఱ యని పరు • వంపుదొండ, పండు వట్టి యహా యిది • పరువు గూరి
యెలుపు మీఱినదొండపం • డే యటంచు, నెంచుకొంచు విరాలిం జ • లించుచుండె.

తే. అపుడు చెలికాఁడు నృపతి క • య్యలివమీఁది
తలఁ పొకించుక మఱలింపఁ • దలఁచి కొనియు
నచట నచటఁ జరించుచుఁ • బ్రచురఫణితి
నింపు రాణింప నాతని • కిట్టు లనియె. 162

క. అవె చూతలతలు నునుఁగెం, జివురులతోఁ దేజరిలెడు • క్షితివర కంటే
యవు నవు ననుంగ యివి య, య్యువిదకరాబ్జములఁ బోలి • యున్నవి సుమ్మీ. 163

క. వసుధాధీశ శిరీష, ప్రసవము లవె చూడు సిరులఁ • బరఁగెడు నా నా
రసికుఁడ యిత్తెఱఁగునఁ బొ, ల్పెసఁగుం గద దాని మేని • మృదులత మిగులన్. 164

ఉ. మారెడుపండ్లు చూడు మవె • మానవనాథకులావతంస సొం
పారుచు నెమ్మనంబునకు • హర్ష మొనర్చుచు నున్న వా భళా
కూరిమిసంగడీఁడ యల • కోకిలకాక్షలికానులాపవ
క్షోరుహయుగ్మ మిప్పగిది • సొంపు వహించుఁ గదా యుదారతన్. 165

క. జననాథ మొల్ల మొగ్గలు, గనుఁగొను మవె మదికి ముదము • గదియించుచు సొం
పునఁ దనరెడు నా నిట్టులె, తనరుం గద సఖుఁడ దాని • దంతాళిరుచుల్. 166

క. రంభాస్తంభము లవె సం, రంభం బలరారఁ జూడు • రాజోత్తమ యా
య్యంభోజవదనయూరు, స్తంభము లిట్లలరుఁ జుమ్మ • సంగడికాఁడా. 167

సీ. కనుఁగొను కేతకీకుసుమ • గర్భదళంబు లుదగ్రవైఖరిజా

దనరుచు నున్నవల్లవె శ•తక్రతుసన్నిభ మే లయారె య
వ్వనజముఖీశిరోమణియ•వక్రనఖాంకురపంక్తి యివ్విధం
బునఁ దనరుం గదా సచివ•పుంగవ నవ్యవిలాసలీలలన్. 168

తే. ప్రభుజనోత్తమ చూడు జ•పాప్రసూన, మదె మనోహరలీలచే • నలరుచున్న
దాభళా సంగడీఁడ యా•య్యన్నమిన్న, ముద్దుకెమ్మోవి యివ్విధం•బుననె యలరు.

క. ఏకిమీఁడ చూడు మిదె చం, పకముకులము లెదకుఁ జాలఁ • బ్రమద మిడెడు న
వ్వికచాంబుజాతముఖినా, సిక యిట్లలరారుఁ జుమ్ము • చెలికాఁడ కడున్. 170

క. పున్నాగమ కనుఁగొను మదె, పున్నాగము ననిచి సిరులఁ • బొలుపారెడు నా
సన్నాగయానపాక్కిలి, యన్నా యిన్నలపగిది • నలరారుఁ గదా. 171

తే. అని వచించుచు వార ల•వ్వనిఁ జరించు, చున్నచోఁ గీరశారీమ•యూరపికమ
రాళకోలంబజాలంబు • ప్రాలి కడు హ, ళాహళి యొనర్ప నులికి యి•లావిభుండు. 173

వ. వెండియు నతని కిట్లనియె.

సీ. కొఅవిదయ్యమ్మల•తెఱఁగునఁ జిగురాకు, గుబురులయం దున్న•కోకిలములు
బమ్మరాకాసుల•భంగిని జెట్టెక్కి, పదరుచు నున్నట్టి•బర్హిణములు
పురుటిండ్లబూచుల•పోల్కిఁ బూఁబొదలపై, సందడి నెఱపునిం•దిందిరములు
పెనుసత్తులట్ల కం•పిలఁ జేయుచును గోనఁ, బొదలి యావడి సేయు•మదశుకములు

తే. మఱియుఁ గపురంపుకమ్మదు•మార మెలయ
వీఁకఁ బైకొనుచిఱుగాడ్పు•సోఁకుతులును
నలముకొనఁగ భూతాక్రోశ • మైనయిట్టి
వనికి నన్నేల తెచ్చితి • వనుఁగ యిపుడు. 174

తే. కుసుమబాణున కెప్పుడు • కువలయనవ
మాలికాశోకకమలర•సాలములను
సాయకము లైదు గల వంద్రు • సఖుఁడ యిపుడి
దేమి వని యెల్లఁ దూపు లై • హెచ్చు మీఱె. 175

తే. మరునిపూఁదూపు లిందాఁకఁ • గెరలి వెలికిఁ
గానరా కుండ నెదలోనఁ • గాఁడుఁ గాని
కడఁగి యిపు డేమి మే నెల్లఁ • గాఁడఁ జాఁగె
ననుఁగ యని సోలెఁ బై రాలు•నవల కులికి. 176

వ. అట్లు సోలినధరావరామరాధీశ్వరుం గ్రమంబున శిశిరోపచారంబుల సేదఁ దీర్చి

నర్మసఖుండు యథాస్థానంబునం జేర్చె నని నారదునకు శారదామనోహరుం డెఱిం
గించిన నతం డతని నవ్వాలికథావిధానం బడుగుటయును. 177

చ. పరమకృపానివేశమృదు•భాషణ భోగికులేంద్రభూషణా
హరిహయముఖ్యనిర్జరగ•ణావన సంతతవిశ్వభావనా
కరిదనుజేంద్రదుర్మదవి•ఖండన బాలశశాంకమండనా
యరిబలహృద్భయంకరమ•హాగ్రహ కుక్కుటరాజవిగ్రహా. 178

క. స్వర్గాపవర్గఫలదని, సర్గా దుర్గాధినాథ • సంభృతసుమనో
వర్గా దుర్గాయితనగ, భర్గా గర్గాదివినుత•పటుసన్మార్గా. 179

సుగంధివృత్తము.

తారకాళతారకాళ•తారకాళరాట్ప్రియ
శ్వారదాభ్రశారదాభ్ర•సామజామరద్రునీ
హారఫేనహారఫేన•హారిభూరికీర్తివి
స్తార ఘోరబాహుసార•దారితారిమండలా. 180

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్య
ధురంధరఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్త్ర
సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామతిమ్మకవిసార్వభౌమప్రణీతం బైనరసి
కజనమనోభిరామం బను శృంగారరసప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# రసికజనమనోభిరామము

## చతుర్థాశ్వాసము.

క. విజితకూచిమంచిమ
హావంశాభరణగంగ • నార్యమనోహరా
జీవాకరచక్రాంగా
గోవల్లభశుభతురంగ • కుక్కుటలింగా. 1

వ. అవధరింపుము వారిజాసనుండు నారదున కిట్లని చెప్పం దొడంగె నట్లు ఋతుధ్వజమహీమండలాఖండలుం డఖండపుండ్రేక్షుకోదండప్రచండకాండపరంపరాకంపితస్వాంతుం డై కలఁగుచుండె నంత నక్కడ. 2

తే. వేల్పుకన్నియు నద్ధరా • విభునుదగ్ర, మోహనాకారశేఖు సమ్మోద మొదవ
డెందమున నిల్పి మిగులఁ గ • డిందివలపు, మొలక లెత్తఁగ నిజగృహం • బునకుఁ జేరి.

సీ. పగడంపుఁగోళ్ల హొం • బట్టెమంచము దోమ, తెర జరతారు మే • ల్వరపు తగటు
చందువా ముత్యాల • జాలీలు కుతినీత, లాడ దంతపుఁబావ • జోడు పసిఁడి
దువ్వెన చిటిచాప • తూఁగుటుయ్యెల దివ్వె, గంబము ల్పచ్చల • గద్దెపీఁట
జాళువాచందువ • ల్జాలవల్లిక తమ్మ, పడిగము నెత్తంపుఁ • బలక ముద్ర
తే. వీణె వింజామరలు వట్టి • వేళ్లసురటి యబుకు కప్పురంపుబరిణె గం • దంపుఁగుడక
చిన్నియడపంబు రతనంపుఁ • జిలుకపంజ, రమ్ము లునాఁగల యొకమిద్దె • టిమ్మనందు. 4

తే. తొడవు లన్నియు నెడలించి • యడలు మించి
యొడలు బడలంగ మది జాలి • గడలుకొనఁగ
మెఱుఁగుకొనగోళ్లఁ గన్నీరు • మీటుకొనుచు
పెడఁదచిటిచాపపై వడి • నొడలు వైచి. 5

తే. కళవళింపుచు మేన్గడ • గడ వడంకఁ, బండ్లు గొఱుకుచు మూల్గుచుఁ • బదరి నగుచు

నోలిఁ బండుచు లేచుచు సొలికి పడుచు నుండె వలరాచ బలుబూచిఁ దొఱఁగి యబల. 6

వ. మఱియును. 7

సీ. తలయూఁచు నెదలోన దలఁకి గుప్పున లేచుఁ, జిలుకలఁ గొట్టు నెచ్చెలులఁ దిట్టుఁ
దనలోనఁ దా నవ్వుఁ గినిసి యంచల నవ్వుఁ, గన్నులు మూయు నల్లడలు రోయు
దైవంబు దూఱుఁ జిత్తవికారమునఁ దూఁగుఁ, దహతహఁ జెందు వేదనలఁ గుందుఁ
బిలువకే పల్కుఁ గోయిలకూఁకలకు నుల్కుఁ, గలవరించు నభంబుఁ గౌఁగిలించుఁ
తే. గలఁగుఁ బిమ్మిటిఁ గుడుచు బెగ్గిలు వడంకు, బెదరుఁ గన్నీరు నించు దూపిలు గృశించుఁ
బరచశర ఘోరశితచూతభల్లభగ్న, మానసాంభోజ యగుచు నమ్మంబుజాక్షి. 8

క. అటు లుండి కొంతవడి కా, కుటిలాలక యంతకంత కున్మాదమున మి
క్కుట మై పెరిఁగిడు వెతలం, గటికటఁ బడి యిట్లనుం దనలోనన్. 9

ఉ. అక్కట పావశాతి చెలు లక్కటికం బొకయింత లేక తా
రక్కడ నడ్డు దాఁకి బిగియారఁగ నవ్వగ కానికౌఁగిటం
దక్కఁ బెనంగనీక మగఁడేఁ గొని తెచ్చి మనోజవేదనల్
జిక్కువడంగఁ జేసి యిటుఁ జేసి రహో యిఁక నేమి సేయుదున్. 10

ఉ. ఎవ్వరి వేడుకొందు నిఁక నేగతి నివ్వెత వీడుకొందు నేఁ
డివ్విధ మెల్ల నెచ్చెలుల కేర్పడఁ జెప్పిన దిట్టకూళ లై
నవ్వులఁ బెట్టి యందఱు వినం గడుసాహసమునఁ ద్రుళ్లుకొంచుఁ దా
రవ్వల అవ్వతిం దెలిపి యొంకిలి సేయక మాన నేర్తురే. 11

ఉ. అద్దిర సాని చేల్వము జయంతునిఁ గంతుని నవ్వసంతునిం
దద్దయు గెల్వఁగాఁ దివురుఁ దప్పక యొప్పులకుప్ప లైనచే
ముద్దులగుమ్మ లాభువనమోహనవిగ్రహుఁ గాంచినంతలో
నుద్ది యిడంగ రానివిరహోదధి బిట్టు మునుంగ కుందురే. 12

ఉ. పున్నమచందురుం దెగడుఁ బూపనిగారి ప్రముద్దుమోము వా
ల్గన్నులు తమ్మిరేకులచొకారము దూరము సేయు జాళువా
వన్నియఁ గేరుఁ జెక్కులు కపోలయుదీటు వెడందటొమ్ము పా
కన్నులఁ గట్టిన ట్టిపుడు గానఁగ నయ్యెడు వానియందముల్. 13

ఉ. పంటికొలందిఁ జక్కెరలపానక మూరెడు కావిమోవి పె
న్గంటి యొనర్చి గుబ్బ లెదఁ గట్టిగఁ జేర్చి కవుంగిలించి పూ
వింటివజీరునాలమునఁ బేముటఁ బ్రేమ దలిర్ప వానితో

జంటఁ బెనంగ లేనియల•జవ్వన మేటికి మవ్వ మేటికిన్. 14

క. అని యిటు లనివారిత మగు, మనసిజవేదనఁ గలంగు•మహిళామణిఁ గ
న్గొని యనుఁగుంజెలు లందఱు, ఘనతరచింతాభరంబు • గడలుకొనంగన్. 15

ఆ. పొలఁతులార యిపుడు • నెలఁతకు విరహార్తి, బలిత మయ్యెఁ జేయు•పని యిఁ కెద్ది
గలదు చూడుఁ డంచు • వలగొని యందఱు, నిందువదనఁ జూచి • యిట్టు లనిరి. 16

క. నీహారకరముఖీ యిటు, లాహా మోహాతిరేక • మలరారఁ గడున్
హాహా యని పొలయుచు ఘన, సాహసవృత్తిన్ మెలంగఁ • జనునే చెపుమా. 17

తే. కన్నియవు గాని ప్రౌఢవు • గావు నీవు, కువలయాక్షి రోసి గ్గల్లఁ • గొల్లఁ బెట్టి
పలుదెఱంగుల నొఱలంగఁ •బాడి యగునె, యహహా నీడెందమున నింత•యళుకు లేక.

క. బాలా నవమృగమదజం, బాలాతతమృదుకపోల•భాలా మేలం
బేలా బేలా యిటువలె, మేలా మేలాగు సడల • మెలఁగఁగ నీకున్. 19

చ. తలఁపున నొక్క-యన్యవసు•ధాతలనాథకుమారుఁ గోరి క్రొం
దళుకుఁబసిండివన్నియలఁ • దద్దయుఁ గేర్చె ఱసోయగంపుమే
న్పలువలకాఁకలం గరఁగి • పాఱఁగఁ జేసెది దేమి మేల్బళా
చిలుకలకొల్కి- నీవెడఁగుఁ•జిన్నియ లెన్నఁగఁ గ్రొత్త లయ్యెడిన్. 20

సీ. పెంపార వలిజిలి•బిలిపాటఁ బాడుచు, నింపుగా వీణ వా•యింప వేమి
గమగమవలచు చ•క్కనిమంచిగందంబు, వలుదచన్గుబ్బల • నలఁద వేమి
జిగిమించుక్రొత్తగో•జ్జఁగివిరిసరములు, సొగసుగాఁ గ్రొమ్ముడిఁ • జుట్ట వేమి
తళుకుఁ గ్రొమ్మించుట•ద్దము చూచి నొసలను, దీరుగాఁ గస్తూరి • దిద్ద వేమి

తే. చిలుకబోదల మచ్చికఁ • జేసి ముద్దు
చిలుక మురిపెంపుమాటలు • చెప్ప వేమి
కడిఁదిరతనంపుఁదొడవులు • దొడుగ వేమి
తెలవ నీ కిది యేలాటి• తెఱఁగు చెపుమ. 21

ఉ. చెంత మెఱుంగునూడిగపుఁ•జేడెల బి ట్టదలించె దేమి ము
న్నెంతయుఁ బ్రేమతోఁ బెనిచి • యిడ్డ మయూరమరాళశారికా
సంతతులం గన న్మొఱయ • సారెకుఁ బాఱ నడంచె దేమి సీ
మంతవతీలలామ యది • మంచిదె నీమది నెంచి చూడుమా. 22

చ. మదనసమానమూర్తి యని • మానవనాథకుమారశేఖరున్
మదిఁ దలపోసి యిట్లు పలు•మాఱుఁ గృశింపఁగ నేల నీకు స

మ్మద మగున ట్లొనర్చెదము • మాపలు కిపుడ్మగ నాదరించి యో
మదకలహంసయాన విను • మా యనుమాన మిఁకింత యేటికిన్. 28

ఆ. అనుచు నిటు లనుంగు•ననఁబోఁడు లాడిన, పలుకు లాలకించి • కలికిమిన్న
కడఁకతో నొకింత • కలఁకలో నుడిగి య, య్యగురుఁబోండ్లఁ జూచి • యిట్టు లనియె.

సీ. చెలులార వినుఁడు క•ల్వలఱేని వలఱేని, నలువారఁ బలుమాఱు • గెలువఁ జాలు
వలఱేనిసోయగం • బెలమిఁ గన్నులఁ జూచి, నంత నుండియు డెంద • మతనియందె
తవిలి క్రమ్మఱక వం•తలఁ గలఁగఁగఁ జాఁగె, నహహా మోహము నిల్వ • నలవి గాదు
శుకమయూరమరాళ•పికశారికామధు, వ్రతచమూసహితుఁ డై • రతివరుండు

తే. వెతలఁ బఱచుచున్నాఁడు • వేయుగతులఁ
దఱచు లిం కేల యీ వేళఁ • దాళఁ జాలఁ
జక్కఁగా మీకుఁ గేలు మోడ్చి • మ్రొక్కు లిడెదఁ
జెలిమి దైవార నుసురులు • నిలుపరమ్మ. 25

చ. వినుఁ డొకమాట చెప్పెద న•వీనకృపామతి నాదరించి యి
ప్పని యొనరించి వేదనలఁ • బాపుఁడు మీ రిటు గాక యున్నచో
నెన రెడలించి నాయెడల • నేరము లెంచి చలంబు మించ నో
యనుఁగు వెలందులార కడు • నారడిఁ బెట్టకు రమ్మ వేఁడెదన్. 26

ఆ. అనిన బోటికత్తె • లమ్మ నీకిపు డింత, చింత యేల వట్టి•ఱంతు లేల
నెమ్మి నుండి నీవు • సమ్మదం బొనఁగూర్తు, మనుచు నూరడించి • యనిచి రెలమి.

తే. అటులఁ జెలు లూరడించిన • నాసఁ దవిలి
యన్నిలింపాంబుజాతద•ళాయతాక్షి
యతితరాభీప్సితావృత•స్వాంత యగుచుఁ
గొంతదిటు మాని యున్న య•నంతరమున. 28

సీ. చెఱకుసింగిణివింటఁ • గఱకుతుమ్మెదనారిఁ, దవిలించి విరిదొన • ల్రవళిఁ బూని
కడిఁది గేఁదంగి రే•కడిదంబు మొలఁ జెక్కి, సురపొన్న క్రొన్న న•జోడు దొడిగి
పలుమొల్లసరముల•పాగ బాగుగఁ జుట్టి, మేలినెత్తమ్మిపూ•డాలు వట్టి
రాణించుచిలుకప•తాణి తేజీ నెక్కి, గండుఁగోయిలదండు • నిండి కొలువ

తే. నలరువిలుకాఁ డనెడి పేరి•బలుసిపాయి, హోళిఁ బైకొని కో యని • యార్చి పేర్చి
కలికివలిగబ్బిగుబ్బగు•బ్బలులనడుమ, వాఁడివిరిములికి డుస్సి పో•వంగ నేసె. 29

క. ఏసిన హా యని సోలి వి, లాసిని వడిఁ దెలిసి పెక్కు•లాగుల వెతలఁ

వేసరి యేమియుఁ దోఁచక, గాసిలుచుం జెలిమిచెలఁదుకల మొఱఁగి వేసన్. 30

సీ. పట్టెలఁ గే లూని • పోవ్వ పెల్లన డిగ్గి, గిలుకుపసిండిపావలు దొడుగక
మినుకుచేలచెఱంగు • మేలిముసుంగిడి, పుడమిపైఁ దడఁబడ • నడుగు లిడుచు
వీడిన సిగకొప్పు • వీఁపున జీరాడ, గాటంపుటూర్పులు • గడలుకొనఁగ
జిలిబిలిచెమటసోనలు మేన జాల్గొన, జిలుఁగుసన్నడుమునఁ • జేయిఁ జేర్చి
తే. జంటఁ బిలపిలఁ జనుశుక • శారికామ, యూరకాదంబవితతుల • నులికిపాటఁ
దలఁకకొనుచు నొకర్తును • దారి వట్టి, తరలెఁ దరలాక్షి యంతికో • ద్యానమునకు.

వ. అట్లు తరలి చని వనిం బ్రవేశించి. 32

సీ. కమ్మపుప్పొడి ముండ్ల • కరణి నంఘ్రులు గాఁడ, నలరులు మరునాపు • లట్లు తగులఁ
బికరావములు పెద్ద • పిడుగుల ట్లదలింపఁ, గేకులు పులులట్లు • ఢాక చూపఁ
గొదమతేంట్లు తుపాకి • గుండ్లపోలికఁ దాఁక, నలఁతిగాడ్పులు బూచు • లట్లు పొదువఁ
దలిరుటాకులు కటా • రులమాడ్కి మెయి సోఁకఁ, గపురంబు పెంధూళి • గతిని గప్ప
తే. నడలి యెచ్చోటఁ గాలూన • నలవి గాక, మరలి పూఁదేనెసోనలు • గురియుచున్న
తలిరుజొంపంపు లేమావి • తరులనడుమ, మొలకపురంపుఁదిన్నెపై • మేను చేర్చె. 33

తే. ఏమి సేయుదుఁ గిటికిటా • యంచు విల్తుఁ, డేఁచ నిలువెల్ల వనిఁ • జేరు టెల్ల నిపుడు
గన్గొనఁగఁ బీడ విడఁబడి బిగాది పట్టి, కట్టు లయ్యె నిం కెచ్చోటి • కరుగ వలయు.

సీ. గడితంపుమొగిలిరేకడిదంబు లొమ్మనఁ, గదియుంచి దుస్సిపో • నడుమదాన
పొటిగొజ్జఁగనీటి • పొటికాలువలోనఁ, జాఱు కూని చివ్వన • నొడుకుదాన
దాకతీవను బూవు • దండ చేరిచి మెడ, యాటియంగ నురి బిగి • యించుదాన
విరిదేనెలోనఁ గ • ప్పురము వోసి మెదించి, తడయక కొనకొట్ట • ద్రాపుదాన
తే. గాక యుండిన సితగరు • తోఁక శౌక, కోకిలానీకమత్తమ • యూకచంచ
రీక శారీకదంబంబు • లేక పేళ్ళి, దాఁకి పైకొన నిఁక నిల్వఁ • దరమె యిపుడు. 35

చ. అళులుఁ బికంబులు న్శుకము • లంచలు శారికలు న్మయూరముల్
గొలగొలలాడుచుండ నివి • కూఁత లిడక్ బెగ డొంది యయ్యయో
చెలులఁ బెంబెలింగి యిచ్చటికిఁ • జేరుట యెల్లఁ దలంచి చూడఁగా
ములు వెడలించి కొట్టు బిగ • మొత్తినచందము దోఁచె నిర్ద్యోదన్. 36

వ. అని మఱియును. 37

తే. హారహారా యంచు రామ రామా యటంచుఁ
జక్రధర యంచుఁ బలుమాఱు • సంస్మరించు

దలదిమ్మ ఘటియిల్లఁ • దవిలియాతాటోటు, మొకరితుమ్మెదదిమ్మ • మొరయుచుండఁ
గనుదోయి నెఱిఁ గప్పఁ • గడఁగి యాబలితంపు, చుఱుకుఁగ్రపుబూది • పఱచుచుండ
తే. నొక్కఁతెయుఁ గోనఁ ద్రిమ్మరు • చుండి మెండు
కొనుదొసంగులఁ బిమ్మటఁ • గొనుచు మనలఁ
దలఁచి యమ్మకచెల్ల య • వ్వేలఁ ది యెంత
వంత నడలెనో కదరమ్మ • యింతులార. 45
సీ. ఈబిసంబులు చూచి • హేలావతీమణి, పాఁపకూటువ లంచు • భ్రమసె నేమొ
యీపికంబులఁ జూచి • యిందీవరేక్షణ, చెడుగుసోఁకుడు లంచు • జడిసె నేమొ
యీనెమళ్లను జూచి • మానినీతిలకంబు, బలుకార్ముకము లంచుఁ • బఱచె నేమొ
యీకెందలిరుఁ జూచి • రాకేందుబింబాస్య, దవవహ్ని యనుచు లోఁ • దలఁకె నేమొ
తే. యహాహ పసిబిడ్డ కిట్టి ఘో • రార్తి యొదవె
నేమి సేయుద మే మంద • మెటకుఁ బోద
మెవ్వరిని వేఁడుకొంద మిం • కిపు డటంచు
నోలిఁ దిరుగుచుఁ జని చని • యొక్కచోట. 46
సీ. ముసుఁగువాయుఁగఁ ద్రోచి • కసరి దిగ్గన లేచి, యత్తైత్తి నలుగడ • లరయుదాని
మాటి కబ్రపుజాలి • నాటి క్రొవ్వేఁడిక, న్నీటిజాల్గొనగోట • మీటుదాని
హెచ్చారుమరునంప • చిచ్చుఱసెకఁ గంది, యుసు రంచు నిట్టూర్పు • లుచ్చుదాని
బెడిదంపుమదకీర • పికరావముల కులికి, పెల్లుగా మదిఁ దల్ల • డిల్లుదాని
తే. నుసురు లూడాడ విసవిస • విసరి మూసరి
దొసఁగు లెసఁగించుసురుగాడ్పు • తుటుము దాడి
కడలి తద్దయు గడగడ • వడఁకుదాని
వేల్పురాకన్నెఁ గాంచి రా • వెలఁదు లపుడు. 47
తే. కాంచి దవ్వుల నుండియే • కడఁకఁ బఱచి
పొదవికొని యశ్రుజలపూర • మున మెఱుంగుఁ
బోఁడిమై తాప మార్చుచుఁ • బ్రోడ లైన
యనుఁగుఁగెందలిరాకుఁబోం • డ్లాదరమున. 48
తే. చెంగలువపూలు మేలిసం • పెంగవిరులు, పడఁతిమిన్నకుఁ జుట్టి రా • బడిసి వైచి
కప్పురపుబూది నిటలభా • గమునఁ బెట్టి, యఱుతఁ గురువేరు గట్టి నెయ్యమున ననిరి.
ఉ. కొమ్మరొ ముమ్మరంపువెతఁ • గుందుచు నిల్లెడఁబాసి యిమ్మెయిన్

మమ్మఱచేసి యొంటిగ వనంబున కేటికి వచ్చి తమ్మి నె
త్తమ్ములఁ గేరునీమృదుపదంబులు గందెఁ గదమ్మ మేలు మే
లమ్మ కచెల్ల నీబలుగయాళితనమ్ములు చెప్పఁ జిత్రముల్. 50

క. కన్నుల నెందటినేనియుఁ, గన్నులఁ జూచితిమి గాని • కటకట యిటులన్
మున్నెన్నఁడు నీపగిది, న్మిన్నటికలఁ బొరలుమాని•నులఁ జూచితిమే. 51

సీ. కుజనులఁ జేరి చొక్కుచు శీధుపానంబు, సేయుచుండాలు లీ•చెఱఁటితేఁటు
లడవులఁ దెరువరు • లడలఁ గేకలు వెట్టి, పఱచుశిఖండు లీ•బర్హిణములు
పలుగాకిమూఁకలో • బ్రతికి పంచమరీతి, నెసఁగుకాలాకృతు • లీపికములు
విషము విదుల్చుచు • వెస ఘనవిముఖతఁ, జనుజాలపదము లీ•సారసములు
తే. పూని నిరతంబు చెలరేగి • పుణ్యతరుల, ఫలము లెల్లను బడఁ ద్రోయు•పత్తిపాళు
లీశుకంబులు హా వెఱ • పింత లేక, వనజదళనేత్ర యిందేల • వచ్చితమ్మ. 52

తే. ఆమెఁ గానిమ్ము మంచిది • యబల యింకఁ, గొంక వలవదు నీమది•కోర్కె లెల్లఁ
దీఱ నిప్పుడు వనిలోనఁ • దూఱి పూలు, గోయుదము రమ్ము తహతహ•కొంతదీఱ.

తే. అనుచు వనజాతలోచన • నత్తెఱఁగున, నాడి సంగడిపూఁబోఁడు • లంత నచటఁ
దరలి పుష్పాపచయబుద్ధి•దలముకొనఁగ, వరుస నందఱు శృంగార•వనము సొచ్చి.

తే. క్రొమ్ముడులు దిద్ది కంచెలల్ • గుదియఁ గట్టి
మొలల నవరత్నమయకాంచి•కలు బిగించి
యందియ ల్పాదకటకము • లొప్పందుపఱచి
యొండొరుల మీఱి వేడుక • లెన్నుకొనఁగ. 55

మ. అళులం జోపుచుఁ బువ్వుఁదేనియల నెయ్యం బొప్పఁగాఁ గ్రోలుచున్
ఫలము ల్మెక్కుచుఁ దీవపందిరులలోఁ • బల్మాఱుఁ గ్రీడించుచున్
గలకంఠంబులఁ దోలుచున్ సుమపరాగం బుద్ధతిం జిమ్ముచుం
దలిరుల్ జొంపము లెల్లఁ ద్రుంచుచు సుధాధామాననల్ నెమ్మదిన్. 56

మ. వలిగ్రంపుఁబుటనంటిబోదియఁ గ్రేవ న్గుజ్జులేమావిమ్రాఁ
కులనీడన్ బలుద్రాకపందిరులలో • గొజ్జెంగపూనీటివాఁ
కలపొంతం గురువిందపెన్బొదలలో • గాటంపుఁజెంగల్వబా
వులపజ్జ న్నెలరాలదిన్నియలఁ బ్రోవు ల్గూడి క్రీడించుచున్. 57

సీ. మిహికాంశుముఖి యొత్తు • సహకారభూజంబు, కలికి యొక్కతె తిల•కద్రుమంబు
కరిరాజయాన యొక్కతె సింధువారంబు, కోమలి యొక్కతె • కురువకంబు

# చతుర్థాశ్వాసము

పూని పూని నిలిచి వెల్ల వనచిన • పొన్నపొన్నల వీథ నాడక
పూవి పూవినను లెల్ల వెల్లన • మల్లిమల్లియ లాఁగి కోరక
తెలివ తెలివడిఁ బూని కదలిచి • తేని తేనియ సోనవానలు
నెలయు నెలయువిధలను వేడుక • నించు నింపుక యలరుఁగోవలు
సారసారససౌరభము వెద • చల్లిచల్లని కొలని చెంతను
జేరి చేరిక నాడుకొందము • చెలువ చెలు వలరఁగ నొకంతను
ద్రాక్ష ద్రాక్షలెడ్డు విరులు దొరకిన • దాఁక దాకఫలంబు లేరక
యలసి యలపిక తామయుంబుల • యందు యందలు నుంటివి యూరక
మాను మానను మెలుగ్లక్రొంబొద • మణులుగ మరుగరుపదము భామిని
కాన కానఁబోండ్లు చనియెం • గదలఁ గదలక నిలిచి గామిని
నెన్న నెన్నడుఁ జూడ ముట్టు పరు • వేల వేలతరంబు పువ్వులు
కన్నె కన్నెలఁ జేసి కోపము • గ్రమ్మఁ గ్రమ్మలఁ జనెదు దవ్వులు
కొమ్మ కొమ్మదుపూఁతపం పెఁగ • కొమ్మ కొమ్మని తలిమి చూపకు
మమ్మ మమ్మల చేసి తేఁటుల • మాటిమాటికి నెడలు వాపకు
౮౭ మహిల మహిల కడిందియలరుల • మనికి మనికిత ముడిగి చూడుము
బహుల బహులలకొలను నెల్లెడఁ • బర్వి పర్విడఁ బోక వీడుము
సేనసేనలు గూడి ముద్దులు • చిలుకఁ జిలుకలు మొలయు నిచ్చటఁ
జానజా నగునవలు వేడుకఁగఁ • జాఁగి జా గేటు లేమి ముచ్చట
యేమె యేమెడ త్రోవఁ జని వన • మెల్ల మెల్లన గాలు చేసెదు
రామ రామకలీలఁ గ్రాలు సర • స్మరస్మరుఁ దీసి వ్రేసెదు
పొగడ పొగడఁగఁ దగు సహా నిను • బోఁటిబోటికి దీపితావులు
తగవె తగవె మరందము పొదలకుఁ • దారి తారి తొలంగఁ దీవులు
మధుపమధుపవశేందులను బగ • మాన మానసమునఁ దలంత మె
మధురమధురసకుసుమములు పలు • మాఱు మారున కిడి భజింత మె.

తే. అనుచు వనకేళి సలిపి లతాంగు లెల్ల, జాల నల్లరులు పలుకులు • సంగ్రహించి
ఘర్మజలబిందువులఁ దోఁగి • కడఁక మొలయ నంత జలకేళి గావింప • నదను దలఁచి.

శ్రీ. యతునాయకునిభాం • డాగారము • బోలె, మకరకచ్ఛపవర • మహిత మగుచుఁ
గమలామనోహరు • కరతలంబునుబోలెఁ, బటుశంఖచక్రవి • స్ఫార మగుచు
బృందారకాధీశు • మందిరంబునుబోలె, నతిశోభామృతపరి • వ్యాప్త మగుచుఁ
గామనీయకతార • కాపథంబునుబోలె, ఘనరాజహంససం • కలిత మగుచు

తే. భూరిదిఙ్మండలముఁబోలెఁ • బుండరీక, కుముదసంసక్త మగుచు న•త్యుగ్రలీలఁ
జాల నొప్పారుసారకా•సార మొకటి, గాంచి రపు డవ్వియచ్చర•కమలముఖులు.

సీ. సమదరథాంగభా•స్వరపయోధరయు స, మీచీనపాఠీన•లోచనయును
శైవాలవల్లరీ•జాలధమ్మిలయు, వికచనవీనార•విందముఖియు
నతులగంభీరత•రావర్తనాభియు, రంగదుత్తుంగత•రంగవళియు
విలసన్మహోద్యగ్ర•పులిననితంబయు, డిండీరదరహాస•మండితయును
తే. గంబుకంఠియుఁ గలహంస•గామినియును, రామకమిళిందమాలికా•రోమలతయు
నగుసరోవరలక్ష్మి య•య్యబ్జముఖుల, కతులితామోద మొసఁగె న•య్యవసరమున.
తే. అమరనారీశిరోమణు • లతితరప్ర, హర్షమానసలై యపు • డక్కడింది
తమ్మికొలను నిరీక్షించి • తత్తటమున, వసనమణిమయభూషణా•వలులు వెట్టి. 68
చ. గడితపుఁగావిపావడలు • గట్టి కుచంబులబంటి నీటిలోఁ
దడయక చొచ్చి హెచ్చరిక • దార్కొన నుమ్మడి నోలలాడుచున్
దొడరి పిసాళిజక్కవలఁ • దుమ్మెదకాటుల నంచబోదలన్
మడువునఁ బాఱఁ దోలుచు స•మగ్రవిలాసవిహారలీలలన్. 69

చ. కరివరయాన యోర్తు బిస•కాండము చిమ్మనగ్రోవి చేసి య
బ్బురముగ నూర్తు మీఁదఁ దనపు•క్కిటినీరము చల్లి నీటిలోఁ
సరగ మునింగె దానికచ•సంతతి యంచును నాఁచుఁదీవ ని
బ్బరముగ లాగె నచ్చెలువ • సైదలు లందఱు నవ్వి రొక్కటన్. 70
తే. ఉవిద యొక్కతె వెతికిల•నుండి నీటఁ, దేలుచో నొక్కరాయంచ • తివిరి తమ్మి
మొగ్గ యంచును దానిచ•న్గొగడ వొడువఁ, గలికి యలికి యొకించుక • యులికిపడియె.
క. నలినకుముదాదికము ల, త్తలునీమణు లెల్లఁ గోయు•తఱి నొకచెలి చే
తుల ముట్ట దయ్యె నలినం, బులు కన్నులఁ జూడ దయ్యెఁ • బో కుముదంబుల్.
ఉ. చంపకగంధి యోర్తు మద•షట్పదపంక్తులఁ దోలె నంచలన్
బెంపఱఁ జేసె నొక్క జల•భృద్ఘనవేణి మృణాళనాళముల్
ద్రుంపఁ దొడంగె నెచ్చరిక•తో నొకమత్తగజేంద్రయాన కం
పింపఁగఁ జేసె నొక్క శశి•బింబనిభానన చక్రవాకులన్. 73
చ. మెలఁతుక యోర్తు తమ్మిపిరి•మీఁదటితేఁటులఁ జోఁప నయ్యళుల్
చెలివదనాంబుజంబునకుఁ • జేరినఁ గేళిసరోరుహంబుచేఁ
బలుమఱుఁ దోలుకొన్న విడి • పాఱక యున్నఁ గలంగి దానిపైఁ

దలఁగక చల్లె వేసలిని • దాల్చిన గాటపుఁగ్రొత్తసంపెఁగల్. 74

క. అలివేణి యొకతె యొకతో, య్యాలిపై నోలయిడి పఱచి • యంబుజషండం
బుల నడుమ డాఁగ దానిం, బలిమిం బోనీక పట్టి • పడఁతి గలంచెన్. 75

క. అప్పలఁ బడి యొకచేడియ, తెప్పనఁ దేలంగ లేక • తిరుగుడుపడుచోఁ
గొప్పొడిసి తిగిచె నొకచెలి, యప్పలఁ బడువారిబ్రదుకు • లట్టివ కావే. 76

తే. ముగుద లుమ్మడి సరసిలో • మునిఁగి తేలు, నపుడు కచముల జాలు నీ • రనువు మీఱెఁ
గలికిమిన్నలఁ గ్రొవ్వెద • ల్ఘనము లగుటఁ, బెరసి ధారాళవర్షము • ల్గురిసె ననఁగ. 77

చ. నెలఁతలు నీటిలోనఁ దమ • నీడలు గన్గొని చిల్వచెల్వ లం
చెలమిని గౌఁగిలించుకొన • నేగెడు చందము దోఁప బాహుశా
ఖలు నెఱిఁ జాచి యీఁదుచును • గ్రన్నన లోనికి డిగ్గి డిగ్గి యం
గలఁగఁగఁ ద్రొక్కి యేమియును • గానక యబ్బురమంది రందఱున్. 78

సీ. కరిరాజయాన యొక్కతె గాసివెట్టఁ దా, మృగసాక్షి హరిమధ్య • మఱుగుదూఱెఁ
దుహినాంశువదన యోర్తు గలంపఁ జక్రస్తని యహిరోమాళి • వెనుక నీఁగె
మదకీరవాణి యోర్తు దలంకఁ జేయ బిం, బోష్ఠి సాంకవగంధి • యొద్దఁ జేరెఁ
గలకంఠకంఠి యొక్కతె నొంపఁ దలిరాకుఁ, బోఁడి రామాంగి దా • పున వసించెఁ

తే. గమలకల్హారకువలయ • కుముదసముద, యాంచితామోదమేదురో • ద్యత్సరోవ
రాంతరంబున లీలావి • హారసరణి, నమర హిమరుగ్వదన లోల • లాడునపుడు. 79

క. మునుఁగుచుఁ దేలుచు నీఁదుచు, ననువుగ నుదకంబుఁ జల్లు • లాడుచుఁ బసుపుల్
గొని యోల లిడుచు చొండోరుఁ, జెనఁకుచుఁ జేడియలు క్రీడఁ • జేసిరి నెమ్మిన్. 80

ఆ. అంతఁ గొలను వెడలి • యింతులు దరిఁ జేరి, కుంతలంబు లార్చు • కొని విభూష
ణాంబరాదికంబు • లలరించుకొని సంత, సమున మరల వనికిఁ • జని యొకెడల. 81

తే. వలపుఁ గ్రంపుటనఁటిమ్రాఁ • కుల కెలఁకుల, జాలువాఱెడుచలువగో • జంగి నీటి
యేటికాల్వల నేపొందు • మేటి దాక, తీవ వలిగొన్న గుజ్జుశే • మావిక్రింద. 82

తే. కొమరుదళుకొత్తఁ జెఱకుఁ గం • బములు నిలిపి, యలరుపందిరి వైచి కెం • దలిరుటాకుఁ
దోరణంబులు గట్టి సిం • గార మెలయఁ, గమ్మగేదంగిరేకుద • ళ్లిమ్ము పఱచి. 83

క. నును పగుమృగమదపంకం, బున దీనియ దిద్ది కప్ర • పుంబొడి ముగ్గుల్
నినిచి లవలిదళములపై, మనసిజరతిసతుల వ్రాసి • మఱి యద్దరులన్. 84

తే. తద్బలంబుల వ్రాసి గం • ధప్రసూన, ధూపదీపప్రముఖషోడ • శోపచార
ములు నిరంతరభక్తిచేఁ • బూజ సేసి, చిగురుఁబోఁడులు డాకొని • పొగడి రపుడు.

క. దండము నీ కిదె జగదు, ద్దండభుజాదండనిహితతతసుమశరకో
దండవినిర్జితసకలా, జాండస్థితజంతుజాత • హారిసంజాతా. 86

సీ. ఎడప కెప్పుడుఁ గన్ను • లెఱ్ఱఁజేయుచుఁ బలంబు, గంటి సేయక మోద • కంటుతూపు
వట్టిమాఁకులు చివు • ర్పెట్టించు దళవాయి, మిన్నంది యేపున • మెలఁగు తేరు
తునిఁగియు మొలచున • ద్భుతపుఁగన్నులవిల్లు, తనకుఁ దా మొఱయుబి • త్తరపు నారి
చుఱుకు మీఱఁగఁ బండ్లు • గొఱుకు టెక్కులజక్కి, నీళ్లలో జాడలు • నెఱుకు సిడము
తే. గలిగి యలిగినపతుల శృం • గారవతుల, గతులఁ బెనయించి ఫాళిమై • నతుల గతులఁ
గేరు నేరుపు నీకె చే • కూఱె నౌర, మహితసుకుమార మార ర • మాకుమార. 87

క. కొంకక యెప్పుడును నీపద, పంకరుహాభ్యాసరూఢిఁ • బరఁగెడు మదసక్
సంకల్పసిద్ధి యిడుదువు వి, శంకటశృంగారవిభవ • సంకల్పభవా. 88

క. కమలభవభవముఖామర, సముదయ మళుకొందు నీని • శాతప్రసవా
స్త్రముల కిఁక నన్య లేదు ర్వే, సమదోద్యత్కీరగమన • శంబరదమనా. 89

తే. ఫాళిఁ జలపట్టి మదనసుమాశుగములఁ, యతులదృష్ణమానసములు వ్ర • య్యలుగఁ జేయు
నీపరాక్రమరూఢి వ • ర్ణింపఁ దరమె, విరహిణీపాంథజనజైత్ర • విష్ణుపుత్ర. 90

చ. పనివడి యింత నీయెదుర • బల్కుఁ డెల్లఁగ నేల బాల న
జ్జనవరసార్వభౌముఁడు వ • శంవదుఁడై కడు గారవించి నీ
పనులఁ గరంగఁ జేయు నెడ • బాళి దలిర్పఁగ నీకు నెంతయున్
ననిచినకూర్మి నుత్సవ మె • నర్చుఁ జుమీ సరసీరుహాంబకా. 91

తే. అనుచు నతనుని బ్రార్థించు • కొని చెలంగఁ
బోఁడు లక్కన్నెఁ దోడ్కొని • పోయి విజని
కేతనము చేర్చి యతితర • ప్రీతి మెఱయ
నరయుచుండిరి మఱి తద • నంతరమున. 92

క. బంధూకప్రసవనిభా, బంధురయై యపుడు పద్మ • బంధుఁడు ప్రాంకేక్
సింధుపరమణీవేణీ, బంధంబున జాఱుపికిలి • బంతియపోలెన్. 93

సీ. చరమాద్రిశిఖరసం • చరదభ్రచరవధూ, శ్రేణి గట్టినతోఁపు • జీర లనఁగ
నంబరారణ్యభా • గంబునఁ దలకొత్తు, గుజ్జుతేమావిచి • గురు లనఁగ
నంబుధీశ్వరురాణి • వారాశిగర్భి త్రిపై, బొలుపారు జేవురు • పూఁత లనఁగ
దిక్సతీమణులు మం • త్రిలి చల్లు లాడెదు, గడితంపుబగ్గండి • పొడు లనఁగఁ
తే. దిమిరమత్తేభరాజ ము • ద్వృత్తి నలుల, వెడలుచో మేనఁ గనుపట్టు • విత్తుగైరి

రజనీజలజపాణి • రహిఁ గేల నిడి యాడు, బలుదమ్మికెంపురా•బలె యనఁగ
విరహులపై దాడి • వెడలుచు మరుఁ డిమ్మ, గొలిపినశకలాతు•గొల్లైన యన

తే. విన్ను ద్రిమ్మరి నవఁబోండ్లు • వెన్నవజ్జఁ
బూజ సల్పినకెందమ్మి•పూ వనంగఁ
గొమరుదళుకొత్తఁ దూరుపు•కొండమీఁద
డంబు మీఱుచు నిందుబిం•బంబు వొడమె. 102

క. వినుపుడమిం జిగిరిచి జిగి, ననువారెడుగుజ్జుమావి • యన శశిబింబం
బొనరార నందుబొందుగ, గొనబారెం గందు గండుఁ•గోయిల యనఁగన్. 103

మ. సరసం బై వసుగంధసంకలిత మై • సన్మార్గసంవర్తి యై
పరరుజ్మండలహారి యై శతభిష•క్స్వామిప్రియం బై విభా
స్వరలీలం దమ మెల్లఁ బో నిడుచు శే•వం బూర్ణచంద్రోదయం
బరు దై శోభిలె నత్తఱిం గువలయా•హ్లాదంబు గావించుచున్. 104

క. మఱఁ డొకటి నఖిలపథికాం, బురహరు శేక్షణాల నేయఁ • బూనిన తెలిదా
మరవిరి యన నంత సుధాం, కరబింబము ధవళరుచులఁ • గర మలరారెన్. 105

క. తిమిరపిశాచం బాశా, రమణీమణి నాక్రమించి • రాయిడిఁ బెట్టన్
సమయోగ్రమాంత్రికుఁడు వే, గమ చల్లినబూది యనఁగఁ • గౌముది యొప్పెన్. 106

సీ. బహుళజీవంజీవ•సటలి మాపలు దీఱెఁ, గవ వీడి జక్కవల్ • కడలఁబాఱె
గడితంపుచిమ్మచీఁ•కటులు దిగ్గన జాఱె, శశికాంతమణితతు • ల్జాలువాఱెఁ
దెరువరిగములపై • మరుఁడు గైదువు నూఱె, విరహిణీనికరంబు • వెతలఁ దారెఁ
గులటల కాత్మసం•గ్గలపుఖేదం బూరెఁ, దొంగలేమ కరిదిసో•యగము మీఱెఁ

తే. గమలముకుళాంతరముల భృం•గములు దూఱెఁ, దవిలి క్రీడించుభోగుల•తాపమాఱె
ధర నశేషజనామోద•కరము లగుచుఁ, బండువెన్నెల లెల్లెడ • నిండుటయును. 107

తే. అప్పు డమరాంగనలు మనో•హరవిలాస, లీలఁ జెలరేగి మద్యంబు • గ్రోలఁ గోరి
కనకపాత్రల శీధువు • నునిచి యునిచి, కూర్మి నందఱు నొక్కచోఁ•గూరుచుండి.

ఆ. కనకమయగళంతి•కల నాసవము ముంచి, యానుకొనుచు సోలసి • వీనుగవలు
మూసికొనుచుఁ గంద•ముల నిచ్చగించుచు, విప్పి మీఱ గ్రుడ్లు • ద్రిప్పుకొనుచు.

క. అహహా యని సొలయుచుఁ గడు, నిహిహీ యని నవ్వుకొనుచు • హేలాగతిమై
నుహుహూ యని వడఁకుచు న, మ్మిహికాకరవదన లామ•మీఱఁగ మఱియున్.

తే. సుధ యిఁకేటికి నిపు డివ్వ•సుధఁ దనర్చ

మదిర దొరకెను మనభాగ్య • మదిర యనుచు
నమరవరవర్ణినులు కోర్కె • లమర నప్పు
డానఁ దొడఁగిరి మధు వెద • నాన వెడలి. 111

క. ఆసవముచవి యెఱుంగక, యాసవభాగములు గోరి • యడ లొంది రహో
వాసవముఖు లైనస్వరా, వాసవరుల్ దెలివి లేని•వారలు గారే. 112

సీ. మధుదైత్యమదనుఁ డిమ్మధువు గ్రోలక కదా, యతితరం బైనకార్శ్యంబు నొందె
మదనవిద్వేషి యిమ్మదిర యానక కదా, కడిఁది మీఱఁగ నీలకంఠుఁ డయ్యె
వాసవుఁ డీయాసవంబు ద్రావక కదా, తనువున దుర్భగత్వము వహించె
నరుణగభస్తి యీసుర భజింపక కదా, ప్రబలయక్ష్మమయబాధఁ గాంచెఁ
తే. గరటిముఖునకుఁ గడుఁ బెద్దకడుపు యక్షు,నాథునకుఁ గుష్ఠరోగంబు నాటుకొనియెఁ
జెనఁటు లై శీధుపానంబు • సేయ కున్న, కతన మనభాగ్యమున నిది • గలిగె భళిర.

వ. అని మఱియుం దమలోన. 114

తే. చంద్రికలు గాయుపరిపూర్ణ•చంద్రుఁ జూచి
యోయి వెన్నెలదొర బావ • యొరక నన్నుఁ
జూచి నగియెద వే మంచు • సుదతి యొకతె
యెంచి పకపక యిహిహీ యంటుంచు నవ్వె. 115

క. తనమది రాకలశంబులఁ, గాన నీ కేయోజ యనుచుఁ • గొమ్మ యొకతె యా
మున నొకచెలిమచకలశము, లనివారణఁ బట్టి లాగు•లాడుచు నుండెన్. 116

సీ. మమ్మరిసారెలాగున నేల దిర్దిరఁ, దిరిగ నంచును ద్రేలు • ద్రిప్పె నొకతె
వలరాచబావ కన్నులు మూసి గిలిగింత, లిడియె నంచును బొబ్బ•లిడియె నొకతె
చోరుఁ డై కోరలొ•జొచ్చి యాసవ మెత్తె, కోని చాన విధుఁ డంచుఁ•గాంచె నొకతె
వలిగాలిపయ్యెద • దొలఁగించి కలువగు,బ్బలు నొక్కె నని రిత్త•యలిగె నొకతె
తే. రిక్కచా లిమ్మంటి నంటి యమ్మకక్క దన్ను
వెక్కిరించె నటంచు నా•మొక్కె మిగులఁ
జొక్కి విక్కుచు దిక్కులు • నిక్కి చూచి
వెక్కసంబుగ నవు డొర్త్తు • వెక్కిరించె. 117

క. అల్లదె జాబిలి దవ్వ్రక్క తిల్లడు మని త్రొక్కికె నన్నుఁ • గన్గిలిపెడి నో
చెల్లకనుంగొను మని యొక, పల్లవకర వలుకె నొర్త్తు • పకపక నవ్వెన్. 118

చ. వెడవిలుకాఁడు పోఁకముడి • విప్పవు గుబ్బలు ముట్టరాదు క్రొ

మ్మడి సడలింపఁ బోకు జిగి • మోవియు నానకు మే లయారె రే
యొడయఁడు చూచుచుండ నిది • యోజయె నీ కని నిల్వరింపఁగాఁ
దొడ్డఁగ నొకర్తు మైమఱచి • తూరెకు మద్యమదంబు పెంపునన్. 119

తే. అపుడు నాశ్యామసాంద్రచం • ద్రాతపంబు, హాళిఁ బొడగాంచి చాల వి • రాళిమించి
నింగిఁ బొంగి కరంబు వె • లుంగుచున్న, నీరజారాతి నిట్లు నిం • దింపఁ దొడఁగె. 120

క. రాజీవలాంఛనుఁడ వగు, రాజవు నీ విట్లు క్రోధ • రససహితుఁడ వై
రాజీవరిపుఁడ వంచున్, రాజీవాక్షులఁ గలంప • రాకు శశాంకా. 121

సీ. క్షీరవారాశికి • గారాపుకొమరుండ, వాదిలక్ష్మికిఁ బ్రియ • సోదరుఁడవు
మురదానవారికి • ముద్దుమఱందివి, హరున కుదగ్రచూ • డాగ్రమణివి
దక్షప్రజాధినే • తకుఁ గూర్మియల్లుఁడ, వక్రాంతబుధజనా • హ్లాదకరుఁడ
వసమబాణునకు నె • య్యపు మేనమామవు, జగముచుట్టమునకు • సంగడీఁడ
తే. విట్టి నీ వయ్యయో నయ • మింత లేక, సారెసారెకు నజ్ఞుల • చందమునను
సుందరులమీఁద వేఁడిమి • చూపఁ దగునె, గురుజనాత్యంతనుతిపాత్ర • కుముదమిత్ర.

క. శ్యామావధూప్రియుండవు, శ్యామలపక్షంబు వీక్ష • నైఁప దటంచున్
శ్యామల నేఁచకు మే సు, శ్యామఁ జూమీ తుహినధామ • జగదభిరామా. 123

సీ. కువలయప్రియుఁ డని • కొనియాడుటకుఁ జాలఁ, జక్రాహితత్వంబు • సలుపుచున్న
బుధవత్సలుం డని • పొగడుట కెంతేని, గురువిరోధంబునఁ • గొఱలుచున్న
గోత్రాభ్యుదయుఁ డను • కొనుటకు నాత్మసం, తతి నడఁగింప • దలఁచుచున్న
మనుమార్గవర్తి యం • చు నుతించుటకు రాజ, కాంతావలుల బిట్టు • కలఁచుచున్న
తే. రాజశబ్దంబు నీకు సా • ర్థముగఁ జెల్లుఁ, గాక యయ్యాగకె లోకాప • కారి వగుచు
నెఱయు నీరాజశబ్దంబు • నేతిబీర, కాయచందంబు గాదె ప్రా • లేయకిరణ. 124

క. వీచి తమిం జక్రావళి, నేఁచెదు తెరువరులు సతులు • నిల నడ లొందన్
హా చంద్ర యేమి చెప్ప ని, శాచరకృత్యములు నీకు • సహజములు గదా. 125

చ. గురువరవర్ణినీమణిని • గూడిన ద్రోహి వటం చెఱింగియున్
బరువడి లింగధారి వని • భావమునం దలపోసి యేమొ ని
గ్గిరిశుఁడు నెత్తిఁ బెట్టుకొనెఁ • గీడు దలంపక చంద్ర యెట్టిదు
శ్చరితుల నైన బ్రోచుఁ గద • శంభుఁ డహా తనుఁ గొల్చువారలన్. 126

సీ. బడబానలంబుతో • జలధిలోన వెలుంగి, కాకకూటంబుతోఁ • బైలు వెడలి
సెకకంటి మొకవిషా • సికలోన నెలకొని, యుదయాద్రిదవశిఖి • నొరసి వెలికి

రాహుదంష్ట్రాంకురో•గ్రవిషాగ్నిఁ బెనఁగొని, ప్రతిమాసమును జండ•భాను బొదివి
యత్యుగ్రపతాపము•హాతాపమునఁ గ్రాఁగి, మునితపోవహ్నిచే • మును జనించి
తే. నట్టినీ వెవ్వరికి నైన • నహహ మహిని, జల్లనై యుందు వనుటెల్లఁ • గల్ల గాదె
యజ్ఞు లెఱుఁగక శీతాంశుఁ • డండ్రు గాని, గురువధూటీమనోహారి • సరసిజారి.

సీ. అర్జునాశుగలీల • నలరుట కబ్జచ, క్రములఁ జేఁబట్టుట • గాంచినావొ
శ్రీవత్సలాంఛన•సిద్ధి వహించుస, త్సంతతిఁ బ్రభవింపఁ • జాలినావొ
విధుసమాహ్వయము వా•విరిఁ బూనుటకు నేపు, చెడిపోవఁ గుజనుల • నడఁచినావొ
విష్ణుపదారూఢి • వెలయుట కేడ్తెఱ, మధుమదోన్మాదంబు • మాన్పినావొ
తే. కువలయోద్ధారకాభిఖ్యఁ • గొఱలుటకును, గరుణ మీఱ వియోగులఁ•గాచినావొ
హస్తిమశకాంతరము గాఁగ•హరికినీవు, జోక యగుదువె మది జనిం•చుటనె చంద్ర.

క. హరునితల పట్టితివి గురు, తరుణిం బట్టితివి నీవు • దైవము గురుఁడుం
బరికింప నాస్తి యగుచో, విరిఁబోఁడుల నేచు టెంత•వింత శశాంకా. 129

తే. జనులు శ్రీతోడఁ బుట్టితి•వనుచు నిన్ను, నెన్నుదురు గానియామర్మ•మెఱుఁగలేరు
కాలకూటంబుతోడ నా•భీలలీలఁ, బుట్టినాఁడవు గద నీవు • భువి మృగాంక. 130

సీ. చెలియలియింటిబా•ల్సిరి యొల్ల హరియించి, తండ్రికి భంగంబు • తగులుపఱచి
సత్సంతతులఁ బ్రకా•శం బంతయు నడంచి, కడు సద్దకుని గ్రిందు•పడఁగఁజేసి
తమ్ములకార్తి దం•ట్టమ్ముగ నొడఁగూర్చి, వదినెబిడ్డనితోడ • వాదు పూని
యేపు మీఱ మఱంది • హృదయంబు భేదించి, గురునిసంసారంబు • గూలఁ ద్రోసి
తే. కుజనులను బెంపు సేయుచుఁ • గొఱఁతలేక, తమునివిహరించుదుష్టవ•ర్తనుఁడ వీవు
తెఱవరులచోట నీకుఁ జో•ట్టరిక మింక, నెవ్విధంబున సమకూఱు • హిమమయూఖ.

తే. గురుసతిఁ గొని రమయింట్టి•సిరి హరించి
చెలఁగి విషబిందుబృందముల్ • చిలుకుచుండు
నాతతాయివి నీకుఁ దో•య్యలులమీఁద
నగ్గి చల్లుట యరుదె నీ•హారకిరణ. 132

తే. సతుల నేఁచకు నీసొరు • సన్నముగను, గదిసె నినుఁ బట్టికొని పెద్ద•గాము గ్రింగ
నీనిలువు నీరుగాను నీ•మేను పెక్కు•తునియలుగ దొండి నీమేను • నెనయఁ జంద్ర.

తే. అనుచు సురనారి సరసీరు•హారి దూఱి, కేరి తనుఁజేరి పూవులు•కోరు తేయు
నించువిలుకానిఁ దద్బల్లో•పేతముగఁ గు, తించి యిట్లని మిగుల నిం•దించి పలికె.

క. వలకోఁడ కడిఁడిసిరి గల్గ, బలుదొరకొమరుండ నటుంచు • భావాష్మణులు

గలఁచకు నీపని యీశుఁడు, చలపట్టి యొకింతలోనె • చక్కఁజేయున్. 185

సీ. అచలకార్ముకము నా•రాయణాస్త్రంబును, బగడతాలుపునారి • పుడమి తేరు
ప్రాఁబల్కు తేజీలు • ప్రమథబలంబును, వెలుఁగొంద నలరు బ•ల్వేల్పుమీఁదఁ
జెఱకువిల్లును విరి•చిలుకును జమిలిము, క్కాలినారియు వలి•గాడ్పు తేరు
చిలుకతత్తడియుఁ గో•యిలమూఁకయును గ్రాలఁ, జలమునమార్కొని•గెలుపుగొన్న

తే. జగమగండపు నీ విల్లు • తగవు మాలి, భీరువులమీఁదఁ దొడరు టే • పెద్దతనము
వలదు లెస్సగ మదిలోనఁ • దలఁచుకొనుము, నిరుపమాభంగశృంగార•హారిసుమార.

క. జగములకుఁ దల్లి దండ్రియు, నగుసిరికి న్హరికిఁ బుట్టి•నట్టిదొరవు నీ
కగునే తోఁబుట్టువు లని, తగ వెన్నక సతుల నేఁపఁ • దతసుమచాపా. 187

సీ. వసుమతీజనుల సు•వర్ణకలాపము, ల్హరియించుతులువ నీ•వరసచివుఁడు
గురుతల్పగమనుఁడై • సరవిఁ జక్రద్వేష, మూనుఖలుండు నీ•మేనమామ
మాన కెల్లప్పుడుం • మధుపానమదమునఁ, బొదలుదుర్మదులు నీ• మొదలిబంట్లు
జగము లెఱుంగ హే•చ్ఛరికఁ బైకొని బ్రహ్మ, ఘాత యొనర్చుట•క్కరివి నీవు

తే. జాతివైరస్యరతుఁడు నీ•సంగడీఁడు, భళి మహాఘోరదురితాన్వి•తులరు మీరు
విరహిణుల నేచు టిది యెంత•వింత తలఁప, వంచితాశేషగీర్వాణ•పంచబాణ. 188

తే. అకట భవదంబలీలాగృ•హంబుసిరి హ
రించు తెక్కలి శశి నాద•రింపఁ బోకు
మదన మును "సర్వనాశాయ • మాతుల" యని
చిందు రాణింప స్మృతులు వ•చింప వినవె. 189

సీ. విషయలిప్తంబులై • వెలయు నారాచంబు, లూరక మొఱయుచు • నుండు నారి
యిలఁబడి నూరాళ్లు • మొలచునబ్రపువిల్లు, పెల్లార్చి పొదలెడు•నల్లమూఁక
నీళ్లలో జాడలు • నెమకెడు టెక్కెంబు, కడు నగ్గి చాయల • నడరు సురియ
యడవిఁ గాచుక యుండు • గడుసరి సంగాతి, యీలవెట్టిన నొద్ద • వ్రాలు సచివుఁ

తే. డొరుల కేరికిఁ గనఁబడ•కుండు రూపు
దనరఁ బొంధులచిత్తవి•త్తములు దోఁచు
తస్కరుఁడ వీవు మగుదలఁ • దలుము టరుదె
కుంఠితామర్త్యనగచాప • కుసుమచాప. 140

సీ. హరికి బుత్రకుఁడవై•యవతరించుటయును, శివునిచేఁ బన్నంబు • జెందుటయును
విషమకాండప్రాప్తి • విహరించుటయును ఘన, కాలరూపంబునఁ • గ్రాలుటయును.

వజితపరాక్రాంత•వాహుఁడ వగుటను, భయదాతనూద్వృత్తిఁ • బరఁగుటయును
బ్రజలమారకుఁడ వై • బాధించుటయు సదా, ఖండధర్మనిరూఢి • నుండుటయును
తే. దలఁచి చూచిన నీకును • ధర్మరాజు, నకును భేదం బిఁ కెద్ది యె•న్నఁడు వియోగి
జనుల గారింపఁ బోవఁ డా•ఘనతరుండు, చంచలాక్షీమనోహారి • శంబరారి. 141

సీ. శిరమున నిద్దంపుఁ•జిన్నిక్రొన్నెల గాదు, పాలుపారు గేదంగి•పువ్వు గాని
గళమున నాభీల•కాలకూటము గాదు, శ్రీమించుమృగమద•రేఖ గాని
తనువున భూతిగం•ధవిలేపనము గాదు, మలయుచందనకర్ద•మంబు గాని
వీఁపున గాటంపు•వెడదకెంజెడ గాదు, డంబారువేణీభ•రంబు గాని
తే. తహి నురమ్మున భుజగహా•రములు గావు
మల్లికానూనపుష్పదా•మములు గాని
యకట మకరాంక శంకరుఁ.• డనెడుశంకఁ
జెలఁగి నామీఁద నిటు దాడి • సేయ వలదు. 142

వ. అని మఱియుం గోపావేశంబున. 143

సీ. నెత్తి మించి నీవిల్లు • విఱిగి ధూళి నడంగ, మలయక నీరూపు • మాసిపోను
బడిబడి నీబలం • బడవిపాలై చన, నేపైన నీటెక్కెం • మేటఁ గలయఁ
గొమ్మలఁ బొదవు నీ•యమ్ముదుమ్మై పోవఁ, దూలి నీయరదంబు • మూలవట్టఁ
గదిసి నీచెలికాని • గాము పట్టుక మ్రింగ, నిలఁ బాసి నీగుజ్జు • మొగసి పోవ
తే. సకట దర్పక ఘోరద•ర్పాతిరేక, మెనయఁ బని పూని విరహిణీ•జనవధంబు
సేయుచుండెదు నీ కిది • చేటు సుమ్ము, పెల్లు పడి యింక నామునఁ • ద్రుల్లవలదు.

తే. అని మనోభవు నాడి యఁ•య్యలరుఁబోఁడి, వేఁడి మీఱంగఁ బయిపయి • వీచుచున్న
మలయధరణీధరాలయ•మందగంధ, వహుని నిందింపఁ దొడఁగె భా•వమునఁ గినిసి.

క. ఇల మరుదాఖ్యుఁడవు మహా, బలుఁడవు శూరుఁడవు నీకుఁ • బౌరుషమె చలం
బెలయఁగ నబలలఁ గలఁచుట, మలయమహీధరసమీర • మందవిహారా. 146

తే. విషధరము నిన్నుఁ గబళించి • విడువ దానిఁ, జెనకి సాధింప నేమియుఁ • జేతఁగాక
విషధరాభిఖ్య గలమేఘ•విసరములను, దరమెదవు శూరుఁడవె నీవు • ధర సమీర.

సీ. మున్ను మహాబిలం•బున సముద్భవ మొంది, శైలాగ్రమున నుండి • బైలు వెడలి
ఘనవనాంతరముల• ననయంబు మెలఁగుచు, నమితనికుంజగు•ల్మములఁ దూఱి
జంతుకోటికిఁ బ్రభం•జనలీలఁ జూపుచు, విస్ఫుటమృగచర•వృత్తి నలరి
పాంథులగుండియ•లవగలింగ నడఁచుచు, వితతమహోబలో•ద్ధతి నెసంగి

తే. చెలఁగి విహరించుగబ్బి బెబ్బులివి నీవు, దాడి మెఱయంగ భీరులఁ • దఱుము టరుదె
యజ్ఞు లెల్ల జగత్ప్రాణుఁ • డంద్రు గాని, కామినీమారణోత్సాహ • గంధవాహ. 148

ఉ. మానక మానినీమణుల • మాటికి నేఁచెదు నాలిగాఁడవై
శ్వానరుఁ గూడి నీ బ్రదుకు • బైలుగ నేల చరించె దిట్లు నీ
మేను దునింగి పోవ నెటి • మీఱెడు నీమురి మూల ముట్ట నీ
పూనిక బుగ్గి గాను నిను • బొంపఱఁ బాము మెసంగ నక్కటా. 149

వ. అని యనిలుం బలికె. 150

సీ. ఇలమీఁద నిల్వక • యెగసి పోయెద వేమె, కీరమా నిన్ను సం•కెలల వేయ
నెపుడు చూచినఁ గన్ను • లెఱ్ఱఁ జేసెద వేమె, కోయిలా నీయిల్లు • గూలిపోను
గేకలు వెట్టుచుఁ • గేరి యాడెద వేమె, బర్హి నీముఱి చెట్ల • పాలు గాను
గొమ్మలఁ గదపుచుఁ • గోరి మ్రోసెద వేమె, తుమ్మెదా నీ త్రుళ్లు • తుప్ప లెక్క

తే. ఘనులఁ గన నోడి కడలకుఁ • జనియె దేమె
యంచ నిను శ్వేతరుగ్భార • మలమికొన న
టుంచుఁ బలుచందముల శపి•యించి పలికి
చంచలేక్షణ కడు సంచ•లించుటయును. 151

క. ఆలీజను లపు డింతికి, హాళిని శిశిరోపచార • మలరించి రొగిన్
నాళీక నాళ కిసలయ; ధూళీపాళీ సితాభ్ర • ధూళిచ్ఛటలన్. 152

సీ. శైలస్తని యొకర్తు • చందనగంధంబు, రంభోరు వొకతె క•ర్పూరరజంబు
హిమకరానన యొకర్తు • హిమజలపూరంబు, లతకూన యొకతె ప•ల్లవచయంబు
వరవర్ణిని యొకర్తు • సరసకాశ్మీరంబు, ఘనవేణి యొకతె ము•క్తాసరములు
ప్రసవగంధి యొకర్తు • మసృణమరందంబు, జలజాక్షి యొకతె కిం•జల్కధూళి

తే. కలితశృంగారసరసి యొ•క్కతె మృణాళ, నాళ శైవాలవల్లరీ•జాలకములు
గూర్చి యచ్చాన మైతాప • మార్చికొనను, సలిపి రెంతయు శిశిరోప•చారవిధులు.

సీ. బంగరుగిండ్లపైఁ • బటికపూసినరీతి, గబ్బిగుబ్బల మంచి•గంద మలఁది
యిందీవరములపై • హిమజలంబులు నించు, దారిఁ గన్దోయిఁ బ•న్నీరు చిలికి
యబ్జరాగములపై • హరినీలములు గూర్చు, గతిఁ గేల శైవాల•లతలు పెనఁచి
గతనంపుటురఁగుపై • గంగవల్లులు దీర్చు, సరణిఁ జే రెడ ముక్తా•సరులు వైచి

తే. మేటితుమ్మెదగములు కా•నొత్తఁ బెట్టు, కరణిఁ గురులను బుప్పొడి • గలయఁ జల్లి
తరుణరంభాదళోశీర•తాళవృంత, జాలములఁ వీచుచుండి రా•జలజముఖులు. 154

తే. మంచిగంధంబు బూది యై • మహిని రాలె
నింకె బన్నీరు చూత్కార • మెసఁగ మేన
నలరులుఁ జివుళ్లుఁ బొడిపొడి • యయ్యెఁ గమల
నాళములు వాడి వత్తలై • డీలువడియె. 155

క. అపు డందు మదన మోహిని, చపలేక్షణ కేలువట్టి • సరభసముగ నా
డిపరిక్ష చేసి ఘనవా, జ్నైపుణత మెఱయంగ నొక్క • వెలఁదుక కనియెన్. 156

సీ. పూర్ణచంద్రోదయం•బునఁ బోవ దింతయు, నెడప కంతంతకు • హెచ్చుఁ గాని
వాతరాక్షసయుక్తి • వదలదు తద్దయు, మించి యంగదలఁ గుం•దించుఁ గాని
పస నెసంగు వసంత•కుసుమాకరంబునఁ, బాయదు మఱిమఱి • ప్రబలుఁ గాని
యేపారిద్దు మదనకా•మేశ్వరంబున మాన, నేరదు గాటమై • నెఱయుఁ గాని
తే. నీలకంఠరసంబున • ఁ బ్రీలి చనక, లోఁగఁ జేయదు నహో యింక • లోకనాథ
రసమహాయోగమునఁ గాని • రమణిమేని, విరహతాపజ్వరం బెల్ల • విడువదమ్మ.

వ. అదియునుం గాక. 158

సీ. పొడగానరాక పైఁ•బడు మనోభూతంబు, నుగ్రమంత్రంబుల • నుడుపవలయు
నలమెడు సోఁకు దుం•ద్యంబు నహీనక్రి, యావిధానంబుల • నడఁపవలయు
రేలెల్ల బైలఁ జ•రించు గాములను వే, ల్పుల నెల్లఁ బ్రార్థించి • పోఁగడవలయు
నడవులఁ జెట్లపై • నామని•చేలఁగూబ, ల్వేఁటకు ఘనుల రం•ప్పింపవలయుఁ
తే. గాక యుండిన వీతను•గ్లాని మాని, మానినీమణి యెట్లు సం•మ్మదము నొందు
ననుచు వచియించి వారు ధ్యా•నమున గడంగి, వెండియును జల్పనముల గా•వించుచుండె.
తే. అట్లు మఱిమఱి శైత్యకృ•త్యములు లోనఁ, గ్రంతకంతకు నగ్గలం • బై మనోభ
వానలం బుప్పతిలి నహ•ముంచు నులికి, యుంచు ముఖి నెచ్చెలులఁ జూచి•యిట్టులనియె.
సీ. వడగాడ్పులకుఁ దోడు • కరముఁ జంద్రునిప్పులు, పైని బోయకురమ్మ • పడఁతులార
వలకాఁకలకుఁ దోడు • కళపిళ నుడుకుచునూ, నియలు చల్లకురమ్మ • నెలఁతలార
వెన్నెలసెకలకుఁ దో•డున్నసున్నం బెల్ల, మెదిచి మెత్తకురమ్మ • మెలఁతలార
విరితూపులకుఁ దోడు • వెడఁదకైదువ లెదఁ, గదియఁ జేర్పకురమ్మ • సుదతులార
తే. కటకటా నేఁడె ప్రగదీక • నిట్టులెల్ల నేఁచఁ జెల్లునె యటంచుఁ బల్కుటుఁ • దల్లడిల్లు
చునలు బన్నీరు మంచిగం•ధంబుఁ జలిరు, టాకులను జూచి మదినూడి•యలరుఁ బోఁడి.
తే. పూలు [illegible] భూతంబులను బెద్ద•తిలుసగముగ
దెబ్బ [illegible] బెదరింపుచుఁ • జొచ్చినారి.

దేమి చెలులార యంచు బి • ట్టెన్నుచుండు
శిఖిపికమృణాళములఁ జూచి • చిగురుఁబోఁడి. 162

వ. అని మఱియును. 163

సీ. కనకాభిషేకంబు • గావించి గద్దఱి, తేఁటికూటువులఁ బ్రా • ర్థించరమ్మ
సాంకవగంధమం • చల్లీల నర్పించి, కీరరాజముల న • గ్గింపరమ్మ
ఘనవైభవోన్నతి • నెనయించి కాదంబ, వితతులఁ బలుమఱు • వేఁడరమ్మ
ధవళాంశుకస్ఫూర్తి • దనరించి టక్కరి, జక్కవగములను • మ్రొక్కరమ్మ
తే. కాకయుండినఁ గొదలేని • ధాక మెఱయ
మూఁకలుగఁ గూడి దోసఁగుల • ముంచుచుండు
నహహా చెలులార తొంటినెం • య్యంబు విడక
కనికరము మీఱ నివ్వేళ • మనుపరమ్మ. 164

వ. అని యిత్తెఱంగున మదనవేదనాభరాక్రాంత యై చింతిలునింతిం గనుంగొని కలంగి సంగడికత్తె లత్తఱి నంగభవాదుల నుద్దేశించి యి ట్లనిరి. 165

క. కోమ నాము మీఱఁ బైకొని, సుమనారాచంబు లేసి • ప్రసుక్కింపకు క్రూ
రమనా రతిగమనా ధృతి, శమనా మదకీరగమన • శంబరదమనా. 166

క. పంచముఖమధ్య యని బా, ధించెదు హరిమధ్య యీస • తీమణి మదనా
కొంచింపక కమలేక్షణ, యంచుఁ గలంచెదు పొలంతి • హరిణాక్షి శశీ. 167

క. పంచప్రాణంబులు నీ, వంచు న్మది నమ్మి యున్న • యన్నులమిన్నన్
వంచించి కలంచెద విది, మంచిదె భువనైకశూర • మలయసమీరా. 168

క. మాతరుణీమణి నొకపెను, భూతమ వై సోఁకి యార్తిఁ • బొదవించె దహా
భూతమవో వాతమవో, నీతెఱఁ గెఱుఁగంగ రాదు • నిజముగఁ బవనా. 169

ఆ. తల్లి పాఱవైచి • తరల నన్యులపంచ, బ్రతికి కూఁతవట్టి • కౌతుక కీవు
కన్ను లెఱ్ఱఁ జేసి • యన్నులఁ గని కారు, కూఁత లఱచె దేమి • కోకిలంబ. 170

క. పసినిసు వగమామగుకన్, విసికింపకు మనుచు నెంత • వేఁడినఁ బైపై
ముసరుచు మఱిమఱి మొరసెదు, భసలమ నీకింత యొగసి • పా ళేమిటికిన్. 171

ఆ. పరులపంచఁ జేరి • బ్రతికి పలాశవృ, త్తి మ్మెలంగు కోకి • లమ్ము మనకుఁ బొ
సంగుఁ గాక యింటఁ • జక్కెరద్దిని మని, వెగటు చిలుక నీకుఁ • దగునె చిలుక.

సీ. బింబోష్ఠి యని నీవు • పెనఁగ రాకు శుకంబ, సాంకవగంధి యీ • పంకజాక్షి
పంకజాక్షి యటంచుఁ • బదరకు తేఁటి చం, పకజాలనాస యీ • పల్లవాంఘ్రి

పల్లవాంఘ్రి యటంచు • బాధింపకు పికంబ, రామాంగి యీబిస • ప్రచయబాహ
బిసబాహ యని రాకు • వెస నంచ జలదళి, రోరుహ యీయహి • రోమరాజి

తే. యహిప రోమాళి యంచు డాయకుము నెమ్మి
కార్ముకభ్రూలతిక యీచో • కారపుఁ జెలి
యనుచు శుకభృంగపరభృత • హంసనీల
కంఠనికురుంబములఁ దద్ద • కనలి పలికె. 173

వ. అబ్బోటికత్తియ లత్తటి నబ్బిత్తరిం జూచి యిట్టు లనిరి. 174

సీ. మలయుచు నెమ్మేను మెన్నంట నుక్కఱి పోయె, విలుపలుతునియ లై • యిలను బడియెఁ
బస చెడి శరపరం • పరలు దుత్తుమురయ్యె, నీ టూరు టెక్కియం • బేటఁ గలసె
గడుసరిమూఁక కా • రడవులపా లయ్యెఁ, దూలుచు నరదంబు • మూలవట్టె
బలితంపువార్వంబు • బైలు వట్టి చరించెఁ, జెలికాఁడు దెసఁ జెంది • చెట్టు దూఱె

తే. నింతి యిం కెక్కడిమరుం డొ • కింత యైన, నళుకు పూనక వానిపైఁ • దలఁపు మాని
మానసంబున నిపుడు మా • మాట నమ్మి, యసదృశానందలీలల • నెసఁగవమ్మ. 175

వ. అనిన నక్కుమారీమణి వారిం గని యిట్లనియె. 176

తే. ప్రాణసఖులార నే నెంత • పాపజాతి, రాతిగుండియదాననో • రాతిరెల్లఁ
గడిఁదివలవంత సెకలయుం • గ్గలపునార్తి, నెంతఁ బడలెను కదరె య • య్యెమ్మెకాఁడు.

ఉ. కంతుదురాపతాపహతిఁ • గ్రాఁగుచు నజ్జగవన్నెకాఁడు న
న్నెంతటుటారికత్తె యని • యెగ్గులు వల్కెనొ యెంతయుల్కెనో
వంతలఁ బెట్టె మమ్ము నెడఁ • బాయఁగఁ జేసితి రమ్మలార మీ
పంతము దీఱె జాలి మదిఁ • బాయ దహా యిఁక నేమి సేయుదున్. 178

తే. అకట నాచెల్మికై యతఁ • డాసతోడఁ, జేరి వలరాచపనికి న • న్గోరి వేఁడు
కొనినఁ గాదని త్రోచి వం • చ్చినమహోగ్ర, పాతకం బింక నేవంకఁ • బాపుకొందు.

తే. కన్నులలరార నవ్వన్నె • కానిముద్దు, నెమ్మొగం బింక నెన్నఁడే • నియు నొకపుడు
గనుఁగొనెడునట్టి మేటిభా • గ్యంబు నాకుఁ, గలుగునో లేదొ కదరమ్మ • పొలఁతులార.

క. అక్కరుణానిధి కాఁగిటఁ, దక్కఁ బెనంగొనని వలఁతి • తన మేల కడున్
మిక్కుటపుఁ రీవి యేలా, చక్కఁదనం బేల యుదుటు • జవ్వన మేలా. 181

వ. అని మఱియు సైరింపరానిదుఃఖావేశంబున. 182

తే. వ్రీడవతి యేడ్చె నెలుఁ గెత్తి వెక్కివెక్కి య[illegible]పూరంబు కుచగిరు • లంటి పాఱఁ
గిన్నరీపాణి పంకజాం • కితసువర్ణ వల్లకీరావసదృశ[illegible] • స్వద్గళమున. 183

తే. అప్పు డబ్జాల నెదఁ జేర్చి • యనుఁగుఁ జెలులు, చీరచెఱఁగున వేఁడికన్నీరు దుడిచి
కురులు సవరించి తళుకుఁజెక్కులు పుడుకుచు, హితవచోరాశి వెల్లన • యిట్టు లనిరి.

ఉ. అమ్మకచెల్ల యిట్టు లెడ • రారఁగ నేమిటి కేడ్చెదమ్మ చొ
క్కమ్మగు నెమ్మొగంబు కసు • గందెఁ గదమ్మ కపోలపాళిక
త్రమ్ము లుదారబాష్పజల • ధారలఁ దోఁగెఁ గదమ్మ లెమ్మ మా
యమ్మ రఘూమ్మ నీ కిఁక స • మగ్రమనోరథసిద్ధి యయ్యెడున్. 185

తే. సుదతి నిక్కంబు వినుము నీ • సోయగంబు, కన్ను లారంగఁ బొడగని • చన్న కతన
నాటి దప్పక నిన్న టి • చోటి కెలమి, తెచ్చు గ్రమ్మఱ నమ్మన్ను • తేఁడు వచ్చు.

క. వచ్చిన నతనికి నీకుం, జెచ్చెర సంగతి ఘటిల్లుఁ • జెలు వలరఁగ నీ
పచ్చటి కరుగుద మూరక, విచ్చలవిడి నుండవమ్మ • వెడఁగుం గొమ్మా. 187

వ. అని యబ్జాళికాచూళికాలలామంబు నారీజనకదంబంబు మందమందమధురాలాపంబుల నూరడించుచుండె నని నారదునకు శారదావల్లభుం డెఱింగించిన నతం డతని నవ్వలికథావిధానం బెట్టిదని యడుగుటయును. 188

మ. కలుషాంభోధినిషంగ ఘోరతరసంగ్రామాంగణాధంగ భూ
వలయోత్తుంగశతాంగ నిస్తులకృపా • వాసోజ్జ్వలాపాంగ దు
ష్కలుషధ్వాంతపతంగ శైలతనయా • సంశోభితార్ధాంగ ని
ర్మలజూటాంతరగంగ సన్మణివిభా • రంగద్భుజంగాంగదా. 189

తోటకము. పురదైత్యవిదారణ పుణ్యగుణా, శరదబ్జనిభాకృతి • సాధుమతీ
సురరాడ్ద్రుహిణార్చిత • సూరినుతా, చరణాయుధవిగ్రహ • శైలగృహా. 190

తరల. సమరభీషణ సత్యభాషణ • సర్పరాజవిభూషణా
ప్రమథనాయక భద్రదాయక • పద్మలోచనసాయకా
విమతభంజన విశ్వరంజన • వేదవేద్య నిరంజనా
సమదవారణచర్మధారణ • సజ్జనావనకారణా. 191

గద్యము. ఇది శ్రీమత్కృష్ణేశ్వరకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్త్ర సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామతిమ్మకవిసార్వభౌమప్రణీతంబైన రసికజనమనోభిరామం బను శృంగారరసప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

సారెకు రాహుగ్ర•హారాధన మొనర్పు, తలఁపుము నీలకం•ధరుని మదిని
దురమున సంపెంగ•విరిసరు ల్నించుము, పొలుపార నాగేంద్రుఁ•బూజ సలుపు
పర్జన్యునకుఁ బెను•పండువు సేయుము, శరదాగమారంభ • మరయు చుండు
తే. మబల పికకీరహిమకరా•నంగభృంగ, పవనచక్రాంగచంద్రకి•ప్రముఖదుష్ట
వితతి నీమీఁద నేమియు • విగ్రహించి, పెంపు రాణింప వెతలఁ గా•టింపకుండు.

చ. తలిరుజిరావజీరుబలు•దాడికి నోడి కడంక డక్కి పే
రలమటఁ జిక్కి పొక్కెద వ•హో నవహాటకదేహ నీకు నేఁ
గలుగఁగ నింతవంతఁ బడఁ • గారణ మే మిఁక లెమ్ము లెమ్మదిం
గలఁగక పంపువెట్టు మిదె • క్రన్నన నన్నరనాథుఁ దెచ్చెదన్. 8

క. అని యనుఁగుఁజిలుక వలికిన, మనమున నొకకొంతవంత • మాని వధూటీ
జనచూడామణి వేడుక, లెనయఁగఁ దిలకించి దాని • కి ట్లని పలికెన్. 9

తే. చక్కెరలు నుక్కెరలు గ్రుక్కి • మిక్కుటంపు
మక్కువలఁ జొక్కి చక్కని • నెక్కుగతుల
నెక్కొనఁగఁ బ్రోది యిడుట కో•పక్కిమిన్న
యక్కటిలు దీర్చి యిపుడు న•న్నాదుకొనుము. 10

క. మకరాంకునకు న్నలికిని, బ్రకటంబుగ నలఁతిముద్దు•పలుకులచేఁ గా
తుక మొసఁగువలఁతివఁటె యిదె, శుకమా నీప్రౌఢి నేఁడు • చూచెదము గదా. 11

ఉ. మారుని గేరుచారుసుకు•మారుని నామహీభృత్కుమారునిన్
గూరిమి మీఱ నీ విటకు • గొబ్బునఁ దోడ్కొని తెచ్చి హెచ్చునీ
ఘోరమనోభవవ్యథలఁ • గుందెడి మదిం దిగు లొందుదాని నో
కీరమ నేఁడు నన్ను బ్రతి•కింపఁగదే మధురస్వగీరమా. 12

తే. మంతనంబున నావల•వంత తెలియఁగ, విన్నపము సేయు మమ్మగ•మిన్న తోడ
నింపు సొంపులు నింపుని•ద్దంపుముద్దుఁ, గలికిపలుకులఁ దేనియ • లొలుకఁ జిలుక. 13

సీ. ఆరాజదర్శనం • బబ్బక యుండిన, నయనోత్పలంబు లే•క్రియఁ జెలంగు
నాయనురతిచిరక•రాలంబనము లేక, చేతోంబుజాత మే•రీతి నలరు
నాఘనునిబిడద•యారస మొదవక, గాఢతాపాగ్ని యే•కరణి నడఁగు
నామహేంద్రమహోక•టూత్కంబు నెఱయక, సంభోగసుఖ మెట్లు • సంభవించు
తే. నహహ విహగకులోత్తమ • యట్టు లగుట, జాగు సేయక వేవేగ • జని యశేష
భువనమోహనుఁ డైనయ•య్యవనినాథుఁ, గదలఁ గొని తెచ్చి సన్మార్గ•గతి నిలుపుము.

ఆ. అనుడుఁ గీరరాజ • మట్లు చేసెదనమ్మ, చెలులఁ గూడి నీవు • వలను మీఱ
నెలమి నాడుకొనుచు • నే వచ్చునందాఁక, మనికి వదల కుండు • మనుచుఁ దెలిపి.

తే. కొమ్మ నీమేని దోకమంచి•సొమ్ముఁ దిగిచి, యానవాలుగ మెడఁ గట్టు • మనిన నలరి
వనజలోచన గొబ్బునఁ • దనపసిండి, బన్నసర మానవా లిచ్చి • పనుచుటయును.

చ. వెర విరవార నజ్జలద•వేణిని వీడ్కొని వేడ్క మీఱ నం
బరసరణి న్వడిం బఱచి • పక్షివతంసము కాంచె నొక్కచోఁ
దెరువున రాజకీరముఖ•దివ్యపతంగమనోనుకూలభా
స్వరఫలజాలముల్ భువన•సారవిశాలరసాలసాలమున్. 17

తే. కాంచి పెల్లన యయ్యనో•కహముమీఁద
వ్రాలి యా క్రిందఁ బటకుటీ•రంబు చూచి
యిదియె కాఁబోలు నృపుఁ డున్న•యిర వటంచు
నాత్మ నూహించుచున్న య•య్యదనునందు. 18

క. వసుధాసుధాశనప్రభుఁ, డసమశరామేయసాయ•కాకుంచితహృ
ద్బిసరుహుఁ డై పస చెడి దొసఁ, గసఁగఁ గృశోదరిఁ దలంచి • యి ట్లని పలికెన్.

ఉ. హా కలహంసయాన విర•హానలవేదన కోర్వఁ జాల న
య్యో కలకంఠకంఠి చల • మూనక నన్ను సముద్ధరించు మే
లే కమలాయతాక్షి దయ • లేక కలంచెద విట్లు వేగ రా
వే కనకోపమాంగి నిను • వేఁడెద బిగ్గఁ గవుంగిలించవే. 20

క. లలనా మరువిరిబరిగో, లల నాఁడెందంబు గడుఁ గ•లంగెడు నివ్వే
ళల నాదుకొని కృపాలీ, లల నామోదం బొసంగి • లలిఁ బ్రోవఁ గదే. 21

మ. తళుకుంబంగరుబొమ్మచందమున నం•దం బారఁ గన్పట్టి యా
సలు పుట్టించి కరంచి వెండియును హా • జాలంబు రెట్టింప న
య్యలరుంగైదువుజోదు వేదనకు న • న్నర్పించి య ట్లేగితే
బలభిన్నీలశిలావినీలచికురా • బాలా జగన్మోహినీ. 22

వ. అని మఱియు ని ట్లనియె. 23

ఉ. హా గృహగునిచ్చ వేఁట కిపు • డేటికి వచ్చితి వచ్చి యొచ్చగా
నిచ్చట వచ్చకోరద్రుశ • నేటికిఁ జూచితిఁ జూచి యూరకే
క్రచ్చఱఁ జెచ్చెరం జనక • కామిని నేటికిఁ గోరితిం గటా
ముచ్చట దీరఁ బైకొనక • యుద్దియ నేటికిఁ బోవ నిచ్చితిన్. 24

క. నాన మదిఁ బొదల సంగడి, చానలతోఁ గలసి మెలసి • చను వెడ నయగారో
పూని కవుంగిటఁ బెనఁచక, మానినిఁ బో నిడితి మంద • మానసుఁ డైతిన్. 25

సీ. గబ్బిగుబ్బలు చూచి • యుబ్బుచుండితిఁ గాని, నిబ్బరంబుగఁ జెంత • నిలువ నైతి
వాలుఁగన్నులం చూచి • సోలుచుండితిఁ గాని, యల్లిబిల్లిగ మాట • లాడ నైతి
వెడఁదక్రొమ్ముడి చూచి • కడిఁదిఁ జెందితిఁ గాని, తివిరి నెమ్మదికోర్కె • దెలుప నైతి
మెఱుఁగుఁజెక్కులు చూచి • తెఱఁగు దప్పితిఁ గాని, కొసరి తద్దయు వేడు • కొనఁగ నైతి

తే. సహహా పని మించె నబల యి • ట్లు దలంచె, మారుఁడు పగ గాంచె వేఁటు • మదిఁ గలంచె
నెడరు లాదవించె విరిముల్కు • లెదను నించె, శివశివా యింక నే నేమి • సేయువాఁడ.

సీ. శైవాలధమ్మిల్ల • చక్రవాకస్తని, కలహంసగామిని • పులినజఘన
సారసవదన డిం • డీరాభదరహాస, యావర్తనాభి క • ల్హారపాణి
మధుకరరోమాళి • మకరజంఘాలత, కచ్ఛపచరణాగ్ర • కంబుకంఠి
వీచికావళి మీన • లోచన కింజల్క, జాలకరదన మృ • ణాలబాహ

తే. యగుచు సొగ సూనుదివిజక • న్యావిలాస, సరసి మెఱలాడ కింక దు • స్తరతరాబ్జ
శరశరాఘాతశిఖిశిఖా • జాతజాత, యాతనాభీతి యల్లఁ జల్లారఁ గలదె. 27

మ. సవనాదిక్రియల న్సుధాంధులను మెచ్చం జేసి ధన్యాత్ము లై
నవిశేషజ్ఞుల కబ్బుఁ గాక యకటా • నాకేటికిం గల్గని
బ్భువనాతీతవిలాసవిభ్రమకళా • భూరిప్రభాంచన్మరు
ద్ధవళాక్షీమధురాధరాధరసుధా • ధారాసరిద్ధోరణుల్. 28

ఉ. భూమిని భామినీమణుల • భూరివిలాసరసైకమాన్యలన్
వేమఱుఁ బ్రేమ మల్లమున • విస్తరిలం గనుఁగొంటి వేఁ కదా
కాముని మోహనాంబకము • కైవడిఁ దద్దయు నద్ది మీఱు న
క్కామినిరూపవైభవము • కన్నులఁ గట్టినయట్లు యుండెడిన్. 29

క. తమిఁ గన్నులార నాఱని, ప్రమదంబున నింక నొక్క • పఱి గన్గొనుభా
గ్యము దొరకునొక్కొ నాకా, సమదద్విరదేంద్రకుంభ • సమకుచకుంభన్. 30

ఆ. అని తలంచుచున్న • యారాచతలమిన్న, పలుకు లాలకించి • చెలిమిఁ గాంచి
యాదియ వేళ యంచు • మదిలోన నూహించి, నెమ్మి నొక్కచెంత • గొమ్మ పలికె.

క. పలుకుచుఁ జక్కెర తేనియ, చిలికెడు నిద్దంపుముద్దు • జిలిబిలిపలుకుల్
వొలయఁగఁ జతురత వెలయఁగ, జెలు కానాడెంపురాచ • సింగముఁ బలికెన్. 32

చ. కటకట రాజచంద్ర యిది • కర్జమె నిర్జరకన్యకామణీ

ఘటియించిన ఘోరమారనిశితప్రదరంబులపాలు చేసి యు
చ్చటికి కేళి చేరి నీవును విశంకటతాపభరాలసుండ వై
యటమటఁ జెందె దేల పదమూ మదమార నెలంతచెంతకున్. 33

తే. అధిప నీమోహనాకృతి యద్భుతముగఁ గాంచినప్పటినుండియుఁ బంచశరని
శాతచూతశరాఘాతయాతనావి, ధూతచేతోంబుజాత యై నాతి సుక్కె. 34

సీ. భృంగ మంగనకు బాలిసంగ మై పొడకట్టె, గాలి బాలిక కుద్రకేలి యయ్యెఁ
బికము చేడియకుఁ గార్ముకముపోల్కి నెసంగెఁ, జాత మింతికిఁ బెనుభూతమయ్యెఁ
బన్నీరు కన్నెకు మున్నీరు తెఱఁగయ్యెఁ, గలువ చెల్వకు దొడ్డచిలువ యయ్యె
శారి నారికిఁ బెద్దమారి యై కనుపట్టెఁ, హారము చెలికిఁ బ్రహార మయ్యె
తే. నేమి చెప్పుదు నీకు రాజేంద్రచంద్ర, చంద్రవదనకు నిపుడు నిస్తంద్రభావ
భవభవోదగ్రసంతాపభరవికార, మంతకంతకు నగ్గలం బగుటకతన. 35

ఉ. చెప్పెడి దేమి దేవరకుఁ జేడియచందము పొన్నక్రొవ్విరుల్
నిప్పుక లంచుఁ దద్దయుఁ జలింపుచు నూర్పులు నింపుచుండి ని
న్నప్పునఁ దోడితె మ్మనుచుఁ గూరిమి నంపిన వచ్చితిం గటా
యిప్పు డిఁకేమి యయ్యెనొ మృగేక్షణ మారవికారవేదనన్. 36

ఉ. పూనదు మేన మానికపుభూషణముల్ చెలు లెన్ని చెప్పినన్
మానదు నీవిలాసగరిమంబు గణింపక యొద్దిబోటులం
గాన దనూనబాష్పకలికాకృతలోచన యై నిజమ్ము సు
మ్మా ననవిల్తు నాన నలినానన నీపయిఁ గూర్మి పెంపునన్. 37

తే. కమ్మవిల్కానిచేతిపూఁగొమ్మ ముద్దు, గుమ్మ రతనంపుబసిఁడికీల్బొమ్మ వలపు
గ్రమ్మ ని మ్మగుకపురంపుదిమ్మ సుమ్మ, కొమ్మ నెమ్మె దలిన్నఁ గైకొమ్మ రమ్మ. 38

ఉ. అంగము మేల్కడాని నఖరాంకురముల్ తెలిక్రొత్తముత్తెముల్
ముంగురు లింద్రనీలములు మోవి చొకారపుఁదమ్మి కెంపు చే
వం గనుపట్టుపల్వరుస వజ్రపుడాల్ మనుమానికంపుఁ గీ
ల్బంగరుబొమ్మ సుమ్ము నరపాలక బాల కొండిలి మీఁటఁగన్. 39

క. అండజయానచనుంగవ, యండ న్వసియించుభాగ్య మబ్బిన సుమకో
దండుఁ డన నెంత వినుమా, కొండలతోఁ బోరవచ్చుఁ గువలయనాథా. 40

క. అని చిలుక పలుకుటయు న, జ్జనవరుఁ డత్తరి చూచి శాఖాగ్రమునం
గనుపట్టునవ్విహంగముఁ, గనుఁగొని యనియెన్ సమగ్రకౌతూహలి యై. 41

తే. రమ్మ రాచిల్క విరహవా•రాశిలోన, మునుఁగు నా కొక తెప్ప వై•మొనసి నిలిచి
మగువ తెఱఁగెల్ల నెఱిఁగించి • మనిచితింక, నిన్నుఁ గొనియాడ నేజాడ• నేర్చువాఁడ.

క. భళిభళి శుకవికిరమణీ, పలు కిప్పుడ తర్కతోఁ•పపన్నం బగుమే
తెలియింపుచు నెమ్మది క, గ్గల మగు కౌతూహలంబు • గలిగించెఁ గదే. 43

ఆ. అనుచుఁ జేరఁ బిలిచి • వెన రొప్ప ముంజేత, నునిచి మేను నిమిరి • మొనసి ముద్దు
గొనుచు నెమ్మనమునఁ • బెనఁచుకూరిమితోడ, నెనసి మఱియు దాని • కిట్టు లనియె.

శా. ఏమేమీ రమణీశిరోమణి భళా • యి ట్లాడి ని న్నంపెనా
నామీఁదం గలకంఠకంఠి కెదలో•నం గూర్మి వాటిల్లెనా
భామారత్నము బోటు లిప్పనికిఁ దో•డ్పాటై విడంబించిరా
నీమే ల్పల్కఁక దాఁచ నేల చెప్పుమా • నీడోద్భవశ్రేష్ఠమా. 45

చ. అతితరమార ఘోరవిశి•ఖాగ్ని శిఖాపరితాపభీతి న
య్యతివలమిన్న ని న్నిచటి • కంపెడిచో మఱి యేమి వల్కె నీ
మతిఁ గొతుకంగ నేల చెప్పు•మా జగదేకమనోహరప్రభాం
కితనిజతుండనిర్జిత•కింశుకమా శుకమా రయంబునన్. 46

మ. మకరాంకుం డతిసాహసుండు శశిదు•ర్మార్గప్రచారుండు త
త్పికకీరభ్రమరాహిభుక్సితగరు•ద్బృందంబు నింద్యం బహో
శుకమా మాటలు వేయు నేటికిఁక నా•చోఁ బ్రేమ వాటించి యా
చకితానంగకురంగశాబనయనన్ • జంద్రాననం గూర్పుమా. 47

ఉ. నిక్కము గాఁగ నాపలుకు • నెమ్మది నమ్మ దిటంబు చేసి యో
చక్కెరవింటి మేల్బిరుదు•జక్కి కొలంపుజగామగండ యా
చక్కెరబొమ్మ కెంబెదవి•చక్కెరపానక మాని చొక్కుచోఁ
జక్కఁగ నీకుఁ గమ్మవలి•చక్కెర లక్కఱతో నొసంగెదన్. 48

తే. కోమలికి నీవు తద్దయుఁ • గూర్చనుఁగ
వగుట మరునకు నెఱబంటు • వగుట నిన్నుఁ
గరము ప్రార్థించుకొనియెద • ఖగకులేంద్ర
మగువతోఁ గూర్చి ననుఁ గృప • మనుపు మిపుడు. 49

తే. అనిన శుకరాజ మతనిఁ గ•న్గొని నృపాల
వంత యింతేల యిది యాన•వాలు గాఁగఁ

జేడె దనబన్నసర మంపెఁ • జూడు మనుచుఁ
జూపుటయుఁ బుచ్చుకొని తద్ద • చోద్య మంది. 50

క. బన్నసర మపుడు నరపతి, కన్నుల నద్దుకొని యెదను • గదియింపుచు న
క్కన్నెలమిన్నం గాంచిన, కన్నెన్ డెందమునఁ గూర్మి • గదురఁగఁ బలికెన్. 51

ఉ. సేమమె గోము మీఱురతి • చేతిని గారపుపైఁడిబొమ్మ క
య్యామనిపువ్వుఁగొమ్మకు నొ • యారపువేలుపురాచకొమ్మకుం
గామునిగీము సోఁటువలి • గ్రపుదిమ్మకు ముద్దుగుమ్మకు
ద్దామవచోనిరూఢి మణి • దామము ప్రేమ మెలఁగ జెప్పుమా. 52

ఉ. అంబుజపత్రనేత్రహృద • యంబు తెఱం గొకయింత నీకుఁ ద
థ్యంబుగఁ గాన నయ్యెడుఁ గ • దా ప్రమదామణి దా ననున్ బ్రసూ
నాంబకకేళి నేలి తుల • రారఁగఁ జేయునొ ఘోరమారదుః
ఖాంబుధిఁ ద్రోచి వైచునొ య • హా మణిహారము వేగఁ దెల్పుమా. 53

ఉ. తాలిమి దూలి జాలి మదిఁ • దాఁకఁగ నక్కనకోపమాంగిపై
వ్రాలనికూర్మిఁ గ్రుంగి బలు • వాపి దొలంగి కలంగుచున్నచో
వేళ యెఱింగి నన్మనుప • వేళము వచ్చితి మేలు మే లహా
నీలకచాకుచాంచలవి • నిద్రవిహారము రత్నహారమా. 54

ఉ. ఊరక కోరిక న్మదము • యూరకకీరకదంబబంభరీ
శారికలుం జకోరికలు • సారెకుఁ గేరి కలంపఁ జాఁగ న
మ్మారుఁడు క్రూరుఁడై పొదవె • మచ్చిక హెచ్చఁగఁ దెచ్చి కూర్పు మా
హా రమణీయభర్మమయ • హారమణీ రమణీశిరోమణిన్. 55

ఉ. అన్నులమిన్న నిన్నిచటి • కంపిన నిం పెనయంగ వచ్చి యా
వన్నెలదొంతిసంతసపు • వార్త దిటంబుగఁ దెల్పి నేఁడు నా
బన్నముఁ ద్రోచి వైచితివి • బన్నసరంబ బళా జగంబునన్
బ్రన్ననిసద్గుణోన్నతుల • పద్ధతు లిట్టివ కావె యారయన్. 56

ఉ. అక్కమలాయతాక్షి నను • నక్కున నొక్కి కవుంగిలించుచోఁ
జిక్కులఁ బెట్టి నిన్నడలఁ • జేయుదు నంచుఁ దలంచఁ బోకు నా
యక్కఱఁ దీర్చి యాదుకొను • మా మణిహారము పేరు మీఱ న
మ్మక్క పరోపకారవిహి • తాత్ము లిలన్ దమ సేగి యెంతు రే. 57

తే. కలికియురమున నెత్తావి • కలప మల్లఁది

[illegible]ంబులు దమి నించు • వేళఁ జాల
[illegible]లఁ జేర్చియుఁ గాని మే • ల్మఱచి యేను
నిన్నుఁ జిక్కుల నిడఁ జూమీ • బన్నసరమ. 58

ఉ. సాంకవగంధసారఘుసృ • ణాంకమృగీమదసారసౌరభా
లంకృత మైనవేల్పునవ • లాతలమిన్న యురంబుపై నిరా
తంకగతి న్సుఖించునమి • త మ్మగుభాగ్యము నీకు నబ్బె నా
కింక మ ఱెన్నఁ డబ్బు నచి • యింపఁ గదే మణిహారరాజమా. 59

సీ. కలకంఠిజఘనభా • గం బంటి యుంటకుఁ, గాంచి యేపుణ్యంబు • గాంచినదియొ
వెలఁదిచెక్కులచెంత • వ్రేలుచుండుట కేయు, పాసన చేసెనో • బవిరజోడు
కలికివాతెఱపాన • కము చవి గొనుటకు, ముక్కఱ యేవేల్పు • మ్రొక్కెనొక్కొ
పోలఁతిముద్దుమొగంబుఁ • బొదవియుండుటకుఁ జేర్చుక్క యేవ్రతముల • స్రుక్కెనొక్కొ
తే. కంజముఖి మేటిసిబ్బెంపు • గబ్బిగుబ్బ, గుబ్బలులదండ నుండ నే • ఘోరతపము
సలిపితివొ నీవు మీభాగ్య • సరణి ధరణి, నెన్నఁ దరమా కడానిపొలుకె • బన్నసరమ.

చ. పలుకులు వేయు నేల విను • పైదలిపైఁ దలకొన్న కూర్మి నేఁ
దెలుపఁగఁ జాల బాల నిటఁ • దెచ్చి రయంబున నాయురంబునన్
నిలుపుము కాక యున్న నిదె • నెమ్మది నమ్మదిరాక్షి పేరుగా
మలయుకడానిబన్నసర • మా విను నక్కునఁ జేర్చి చొక్కెదన్. 61

తే. అనుచుఁ బలవింపఁ గీరమో • యధిప యింక, నిచట జాగేల వేగ న • య్యింతి నిన్న
క్రీడమై నున్నమనికికి • వేసు కలర, రమ్ము చక్కఁగఁ బొసఁగఁగ • ర్జమ్ము లెల్ల. 62

వ. అని మఱియు నిట్లనియె. 63

ఉ. అమ్మదచంచరీకరుచి • రాలకజాలక దానొకింత డెం
దమ్మునయందు నాపలుకు • నమ్మక యమ్మకరాంకకంకప
త్రమ్ములదాడి నే మగునొ • రాజకులైకలలామ జాలువా
కమ్మ లిఖించి నాయఱుతఁ • గట్టుము చెచ్చెర నేగి యిచ్చెదన్. 64

వ. అనిన నతం డట్ల కాక యని లేఖ లిఖియించి యీలేఖ యాలేఖవధూవతంసమ్మునకి
మ్మని గట్టిగ మెడం గట్టిన. 65

క. దిట్టతన మెలయ నప్పుడు, చెట్టుప లల్లార్చి యెగసి • చెచ్చెర దివి న
ప్పిట్ట నెఱిఁ బఱచి గొనబుల, పట్టగ తనమొదలి నెలవు • పట్టునఁ జేరెన్. 66

వ. అయ్యవసరంబున. 67

తే. వంతఁ గలఁగుచుఁ దెలుఁగంటి • వాలుఁగంటి, యెల్లన్నృపుఁ దెత్తు నని పూని • యరిగినట్టి
చిలుక రాదయ్యెఁ దడ వేల • చేసెనొక్కొ, యనుచు గాదిలిచెలికత్తె • యలను బలికె.

సీ. చెలులార ముద్దురా • చిలుక రానెలప్రోలి, కేరీతి నురుగతిఁ • జేరఁగలదు
చేరి యేరికిఁ బ్రవే • శింపఁ జెల్లనిలోన, గరు మతి యేభంగిఁ • జొరఁగఁగలదు
చొచ్చి యచ్చట నిచ్చ • నిచ్చ హెచ్చగుకీవిఁ, గ్రాలు నేలిక నెట్లు • గాంచఁగలదు
కాంచి యించుక మదిఁ • గొంచ కేతెఱఁగున, నతనితోఁ దగుమాట • లాడఁ గలదు

తే. మాటలాడిన విని రాజ • మన్మథుండు, కౌతుకం బార నిచటి కే • కరణి వచ్చు
వచ్చుట హుళక్కి కటకటా • పచ్చవిల్తు, దాడి నిం కెవ్విధంబునఁ • దాళుదాన.

ఉ. అక్కట యిక్కటుంపుఁదమి • నక్కరుణానిధి నాదుచెల్మికై
మక్కువ మీఱఁ జేరి బతి • మాలినఁ గా దని వీడ నాడి నన్
జిక్కులఁ బెట్టి యిట్టివెతఁ • జెందఁగఁ జేసితి రమ్మలార యిం
కెక్కడిమాట యాతఁ డిట • కేటికి వచ్చు నృపుల్పరాఙ్ముఖుల్. 70

ఆ. కుసుమశరశరార్తిఁ • గుందుచుఁ జిల్కను, రాయబార మనుప • రాక మసలెఁ
బత్తు లేద రాచ • పను లేద యనుచు లోఁ, దలఁప వలదె వెడఁగుఁ • దనము గాక. 71

తే. కోరి యేప్రొద్దు సానుల • కూటములను, దవిలి కలకంఠు లెడపక • దరుల మెలఁగ
భోగినులు చుట్టుకొని యుండఁ • బొదలుభూమి, భృద్వపుం డింక నీవంక • కెట్లు వచ్చు.

తే. అహహ దక్షిణనాయకుం • డగుమ జనులఁ, జాల నలయించు పెద్దగాఁ • బోలు నాతఁ
డటులఁ గాకున్న మారక • భటులచేతి, యాతనలఁ గుందఁ జేయునే • యబలలార.

వ. అని చింతించుచున్న సమయంబునం జిలుక యాకలకంఠిప్రోల లీలం గనుపట్టిన దా
నిం గని యావన్నెలగని యి ట్లనియె. 74

క. అండజసత్కులమండన, నిండాయముదంబుతోడ • నిక్కము చెపుమా
గుండియ లదరెడుఁ గావో, పండో నీ వేగినట్టి • పని శైలమునన్. 75

ఉ. అంగజుఁ గ్రుంగఁ జేయు నెఱ • యందపుఁజందపురాచమిన్న సౌ
బ్బంగిఁ గనుంగొనం బొసఁగెఁ • బాయక యామెకిమానితోడ నే
యంగున మాట లాడితి ధ • రాధిపుఁ డే మని పల్కెఁ దెల్పు నా
బంగరుముద్దుచిల్క నినుఁ • బ్రాణపదంబుగ నెంచి పెంచితిన్. 76

క. చిలుకా యారంగ్రొన్నన, వలుకానిం డేక నీవు • వే వచ్చుటచే
నలు కాత్మం దలకొత్తఁగఁ, బలుకాఁటియలం గృశింపఁ • బొల్పడితిఁ గదే. 77

వ. అనినం బక్షి యాసరోజాక్షి నీక్షించి యి ట్లనియె. 78

తే. మానినీమణి నీయాజ్ఞ పూని యేను
సరభసంబుగఁ జని చని తెరువులోన
నొక్కసహకారభూరుహం బెక్కి దిక్కు
లరయుచున్నంతఁ జెంత నం తరువుక్రింద. 79

సీ. నిదుర లేవడిఁ గెంపు నెఱయు కన్గవతోడఁ, బాడిఫాడి యైనమై పూఁతతోడ
సడలిన తనంపు బెడఁగుసొమ్ములతోడ, బడలి చెన్నెడలిన యొడలితోడ
నుడుఁగక పొడము నిట్టూర్పుగాడ్పులతోడ, జిగి దొలంగిన ముద్దుమొగముతోడఁ
జెక్కునఁ జేర్చిన చెయిదామరలతోడ, జాలిఁ దూలెడుమానసంబుతోడ
తే. వ్రాలి హా భువనైకవిభ్రమవిలాస, భాసమానాంగి ననుఁ గృపాపాటవమున
మనుచు మనుచు మనోజవేదనలఁ గనలు, చున్న నెఱవన్నియల రాచమిన్నఁ గంటి.
ఉ. ఓచిగురాకుఁబోఁడి విను మొక్కపటావసథాంతరంబునన్
నీచెలువంబె సారెసఁ గణింపుచుఁ గంపిలుచుండి దండనన్
జూచి మనోజుపాజి యనుచుం బలవింపఁ దొడంగె నార యా
రాచకొలంపు రేడొరవి రాలి తెఱం గిఁక నేమి చెప్పుదున్. 81
సీ. హా ప్రభాతప్రఫుల్లాంభోజలోచన, హా శరద్రాకాసుధాంశువదన
హా సముదద్విరేఫాలకజాలక, హా తప్తచామీకరాభగాత్రి
హా దిశాకుంభికుంభాంచితకుచకుంభ, హా పరిపక్వబింబాధరోష్ఠి
హా హీరశకలమనోహరరదనాళి, హా నవదర్పణోద్యత్కపోల
తే. హా జగన్మాన్య గంధర్వరాజకన్య, యహహా మారున కిటుల నన్నప్పగించి
గొడవఁ జెందించి కుందించి జడిగించని తెయ్యంచు నిన్నెంచు నతఁడు క్రొమ్మించుఁబోఁడి.
తే. ఏమి చెప్పుదు మఱియు నబ్జాభమిజాని
యువిద నీచొక్కటపురూప మొక్కచిత్ర
ఫలకమున వ్రాసి ముందఱ నిలుపుకొని ని
తాంతమోహాతిరేకంబు దనరఁ బలికె. 83
క. ఏమే యోమేచకకచ, యేమే వామేక్షణామణీ హేమఘృణీ
యేమే సోమోపమముఖి, యేమే మో మెత్తి చూడ కిటు లెంతురఁటే. 84
క. పచ్చనివిలుదొర పైపైఁ, గ్రచ్చఱ విరిములుకు లేసి కాఱియ నిడుచో
మచ్చికఁ నన్ బ్రోచుటకై, వచ్చితివా ముద్దుగుమ్మ వలఁతివి లెమ్మా. 85
క. నానా చూడవు మదకల, యానా యానలినశరుని యాన సుమీ న

ష్ణానన మెత్తి కనుంగొని, సూనాస్త్రక్రియల నొఱపు • చూపకయున్నన్. 86

క. అలుకా పలుకవు మరువిరి, చిలుకా రతిచేతిముద్దు•జిలుకా యలుకా
తలుకారు మేలిబంగరు, మొలకా వలకాఁక ముట్టు•ముల కాయోఁ గదే. 87

వ. అని పలికి మఱియుం దత్తరంబున. 88

చ. చెక్కిలి ముద్దు వెట్టుకొనుఁ • జేతఁ దురంబను దువ్వు నెమ్మదిం
జొక్కి కవుంగిలించుకొనఁ • జూచుఁ జనుంగవ యంటఁ బోవు నో
చక్కెరబొమ్మ నన్మదన•సంగరలీలల నేలు మంచుఁ బె
న్మక్కువ మీఱ మ్రొక్కి బతి•మాలు వివేకము మాలి తూలుచున్. 89

సీ. కావిచక్కెరముద్దు• మోవి యానఁగఁ బోయి, సారె కూరక నోరు • చప్పరించుఁ
బెనఁగి క్రొన్ననపాను•పునకుఁ దాగ్వఁగఁ బోయి, తరలక యున్న పా•దములకొఱగుఁ
గడఁక మీఱఁగఁ బోఁక•ముడి వదల్పఁగఁ బోయి, గడగడ వడకించుఁ • గరయుగంబు
గబ్బిచన్గవ యొత్తి • కౌఁగిలింపఁగఁ బోయి, కళవళంబున బయ • లౌఁగిలించుఁ

తే. ప్రేమ మాటాడు మని పల్క•రించఁ బోయి, యూఱ్పులుకమన్న వెడవెడ • మాటలాడుఁ
గన్నయన్నులతరమె యా•న్నన్న చిన్ని, మన్నదొరమిన్న వలవంత•చిన్నె లెన్న.

క. బొమ్మా యనుఁ బలుకవె విరి, బొమ్మా యను నీవ నింత•కొఱకొఱ చెల్లెన్
బొమ్మా యను నునుఁజిత్తరు, బొమ్మా యను రాజమౌళి•పాదలువిరౌళిన్. 91

తే. అట్టివిరహార్తిఁ గుందుచు•న్నట్టిమనుజ, వల్లభుని గాంచి నీలెఱఁ • గెల్లఁ దెలియ
విన్నవించిన నతఁడు న•న్నెన్న రాని, కనికరము మీఱఁ జూచి యి•ట్లనుచుఁ బలికె.

ఉ. కోమలిమీఁద నాకుఁ గల•కూరిమి దేవుఁ డెఱుంగుఁ జిల్క నీ
కేమని చెప్పవాఁడ నిపు • డించుక నీవును జూచితే కదా
భామినిమోవిచక్కెరల•పానక మానక మాన నేర దీ
కామదురాపతాప మిఁక • గట్టిగ దానిఁ బరిగ్రహించెదన్. 93

వ. అని పల్కి. 94

తే. కమ్మవిల్కానిఁ దొగడున•మ్మ్యోమ్మకాఁడు, కొమ్మ నామాట నీ వేద • నమ్మ వనుచుఁ
గమ్మలిఖియించి పంచెని•క్కముమ్మ గాఁగ, నమ్మమిదె వచ్చునతఁడు నీ•యుమ్మ్మవపును.

వ. అనిన నచ్చాన చెచ్చెర నచ్చిటి విచ్చి పుచ్చుకొని నెచ్చెలి కిచ్చిన నది యిట్లని
చదువం దొడంగె. 96

సీ. శ్రీమత్సకలలోక•సీమంతినీజనా, తీతనిరంతర•ద్యోతమాన
వరరూపలావణ్య•వైభవశాలిని, నైనసుశ్యామాభి•ధానదివ్య

గంధర్వకులరాజ•కన్యాలలామను, ఘనుఁడు ఋతుధ్వజా•వనివిభుండు
వనిచినశోభన•పత్రిక నీవు నా, కనుదోయి కబ్బంబు • గదుర నెదురఁ
తే. గడఁకఁ బొడకట్టి యప్పుడే • జూడఁగి పోవు,టాదిగఁ బ్రసూనవిశిఖజ్వ•రార్తిఁ జెంది
కుందుచున్నాఁడ నింక నీ•కోమలాధ, రాధరసుధారసం బిచ్చి • యాదుకొనుము.
ఉ. ఏ మని తెల్పువాఁడ నొక•యింతయు నక్కటికంబు లేక న
న్నామని తేఁడు రేదొరయు • నంచలు దేఁటులు గీరశారికల్
కాముఁడు గండుఁగోయిలలు • గాఱియ పెట్టు తెఱంగు నీవు లోఁ
గామినికామినీజనశి•ఖామణి మత్తమరాళగామినీ. 98
క. అని చదివిన విని వనితా, జనరత్నము సిబ్బితియును • సంతసమును నె
మ్మనమునఁ బెనఁగొనఁ జిలుకం, గనుఁగొని యి ట్లనియెఁ బ్రేమ • గడలుకొనంగన్.
శా. ధాత్రీనాథశిఖామణిం గని యథా•ర్థం బొప్ప మత్కార్యముల్
శ్రోత్రానందము గాఁగఁ దెల్పి యతనిం • జొక్కించి వే క్రమ్మఱం
జిత్రప్రక్రియ నేగుదెంచి యశముం • జేకొంచు మేల్మే లహో
పత్రీ పత్రికఁ దెచ్చి నిల్పితివి నా•ప్రాణంబు లిప్పట్టునన్. 100
క. శ్రీరమణికి గీరమణికి, నీరమణీయోక్తి యుక్తి • నెఱపుచుఁ దచ్చే
తోరమణులఁ గూర్తువు నిన్, గీరమణీ నే నుతింప • నేర్తునె యింకన్. 101
వ. అని చిలుకం దిలకించి పలికి కలికి చెలికత్తియలుం దానును మనోవికాసంబున భా
షిలుచుండె నాసమయంబున. 102
తే. చక్రపరిపాలన మొనగప్పి • జగమువిందుఁ, దరలి వచ్చెను నీ వింక • నరుగు మంచు
సురలు శశికంచు మేలిబం•గరపుఁగమ్మ, చు ట్టనఁగ నభ్రమున వేగు•చుక్క వొడిచె.
తే. చక్రరిపుఁ డగు రాజశా•సనమువలన, నెంచి మారుండు పాంథుల • నేయఁ జాఁగఁ
గావ రావే యటంచు జ•గంబువిందుఁ, గూర్చి మొఱ చేసె ననఁగఁ గు•క్కుటము లఱచె.
సీ. అసమానవాసనా•లసమానమల్లికా, ప్రసవమంజరులపై • ముసరి ముసరి
విమలామృతాకీర్ణ•కమలాకరోత్ఫుల్ల, కమలానుషంగంబు • గాంచి కాంచి
మృదులాతిశోభన•చ్ఛదలసద్ఘనసార, కదళీవనంబులఁ • బొదలి పొదలి
యేలాలతాజాల•డోలాతతవిహార, లీలలఁ బలుమాఱు • సోలి సోలి
తే. యుపరిసురతక్రియాక్లిన్న•చపలలోచ, నాఘన స్తనభాగని•దాఘసలిల
బిందుసందోహహృతిఁ బెం•పొందిపొంది, వీచె వలినాలిచలిగాడ్పు•లేచి యపుడు.
తే. అతుల గతుల నితాంతోప•రతులఁ బతుల

మతుల కామోద మొనఁగూర్చి • నుతులు గన్న
సతుల నెరజాణతనపుసు•స్థితుల కెలమిఁ
జెలఁగి తల లూఁచె నన దీప•శిఖలు వడఁకె. 106

తే. కలకలధ్వానములతోఁ ఖ•గంబు లెగసి, చదలఁ జరియించెఁ దమకుల•స్వామి యైన
యరుణుఁ డుదయించుచోఁ నెదు•రరుగుదెంచి, యతనిదర్శింపసమకట్టి•నవియొ యనఁగ.

చ. గుసగుసలాడి పల్లవుల • గొబ్బున వీడ్కొని యుత్తరీయముల్
ముసుఁగులు వెట్టి దట్టముగ • మోముల నిద్దురచొక్కు దేఱ వె
క్కసముగ దిక్కు లారయుచుఁ • గ్రంతలవెంబడిఁ దారి తారి పల్
దొసఁగు లెసంగు లోఁగిళులు • దూఱిరి క్రమ్మఱి జారకామినుల్. 108

సీ. కమ్మవాతెఱపాన•కమ్మలు చవి చూపి, నిద్దంపుచెక్కులు • ముద్దొసంగి
కులుకుసిబ్బెపుగబ్బి•గుబ్బ లంటఁగ నిచ్చి, దట్టంపుఁగౌఁగిలిం•తలఁ బెనంచి
తమి రేఁచి నీవిబం•ధములు విప్పఁగ నిచ్చి, జఘనసంస్పర్శనో•త్సవ మొనర్చి
బహువిధరతికళా•మహిమలఁ జొక్కించి, జిలిబిలిసొలపుఁబ•ల్కులఁ గరంచి

తే. మెల్లమెల్లనె చేతిసొ • మ్మెల్ల లాగి, తెల్లవాఱినఁ దమదెస • వెల్లి బెల్లి
తల్లులను దార్చి గణికామ•తల్లు లిండ్ల, వెళ్లఁ దోలించి రత్తఱిఁ • బల్లవులను. 109

సీ. కడఁకతో నిదుర మే•ల్కాంచి దిగ్గనఁ బాన్పు, డిగి కటిస్థలిఁ గోక • బిగియఁ గట్టి
పెనగొన్న ముత్తెంపుఁ•బేర్లు చిక్కుడలించి, వదలినతొడవులు • గుదురుపఱచి
విరులతావులు గ్రమ్ము•కురులు గ్రొమ్ముడి దిద్ది, కులుకుఁబాలిండ్లఁ గం•చెల ఘటించి
మొకమున నెల్లయుకా•టుకపైఁటకొన నొత్తి, పుక్కిటివిడె మొక్క•చక్కి నుమిసి

తే. యందియలు మ్రోయ మట్టియ • ల్గ్రిందుసేయ
నిదురచొక్కుల నడుగులు • గొదుకు పూన
సతులు పడకిండ్లు వెలువడి • చనుహారంగు
ప్రియుల డెందంబు లపుడు త•ద్దయుఁ గరంచె. 110

ఉ. విక్కుచుఁ బోయి యాగడపు•వెంపగతొత్తులయిండ్లు దూఱి బల్
రొక్కము గుమ్మరించి కడఁ • ద్రొక్కుచు వేగినదాఁక రాక వాం
డ్రొక్కెడ వైచి పోవుట క•టా యని రెంటికిఁ బాసి గ్రుడ్లనీ
ళ్గ్రుక్కుచు జాటి రిక్కలకుఁ • గొత్తబొజుంగువెడంగు లయ్యెడన్. 111

క. తూరుపు తెలతెలవాఱినఁ, దారలు గృహదీపములును • దమి లంజియలం
జేరినసిగ్గరిబొజుఁగుఁ, బారులమోములును దెల్లఁబాఱె నొకంతన్. 112

వ. అంత. 113

మ. బిసినీకాంతవియోగసంజనితగ•ర్భీభూతతాపజ్వరో
ల్లసదార్తిం గృశియించుచున్న యెడఁ గ•ల్యప్రాజ్ఞవైద్యుండు నే
ర్పెసఁగం దత్ప్రబలోపతాప ముడుపన్ • హేలాగతిం దెచ్చుబ్ర
లసిందూరపుటుండయో యనఁగ మా•ర్తాండుండు దోఁచెన్ దివిన్. 114

సీ. చక్రరక్షణకళా•చాతుర్యశాలి దా, నినశబ్దవాచ్యుఁ డై • యెసఁగు టరుదె
సతతతమోగుణో•చ్చాటనచణుఁడు దా, లోకబాంధవుఁ డై వె•లుంగు టరుదె
కమలాధికామోద•కరమూర్తియుతుఁడు దా, హరిసమాఖ్య వహించి•యలరు టరుదె
విష్ణుపదాసక్తి • విహరించు మేటి దాఁ, బరమహంసఖ్యాతిఁ • బరఁగు టరుదె

తే. యనుచు ననచిన వేడ్కఁ బు•ధాళు లెల్లఁ
దను నుతించుచు సమయాకృ•త్యములు దీర్ప
సకలజనులకు లోచనో•త్సవము మీఱ
దరణి వెలుఁగొందె భవవార్ధి•తరణి యగుచు. 115

తే. మున్ను దా నపరాసక్తిఁ • జన్న ఖిన్న
యగుచుఁ బద్మిని నెమ్మోము • మొగిచె నంచుఁ
దరణి యచ్చేడియను సంపు•ధాతపటము
లనఁగ నంచలు కొలఁకుల • కప్పుడు డిగివె. 116

క. తమ్మికొలంకులపై ఝుం, ఝుమ్మని తుమ్మెదలు మెఱయు•చొప్పలరె సరో
జమ్ములు మీఁదొరవచ్చెన్, రెమ్మని మేల్కొలుపుచున్న•లీల దలిర్పన్. 117

క. తమి యెల్లఁ దీర్చి తమప్రియ, తముఁ డగు గా జస్తమింపఁ • దటిఁ గని వచ్చెం
దిమురునఁ జంద్రప్రభుఁ డని, కుముదంబులు మోము మోడ్చె • కుముదము లయ్యెన్.

తే. చక్రములు పొంగె దస్యుసం•చయ మడంగెఁ
దమము చెంగె ద్విజప్రతా•నము చెలంగె
సరసులం దెల్లఁ గమలాలి•శయ మెసంగె
జగము విం దగు నినుఁడు తే•జమునఁ బ్రబల. 119

తే. అపుడు సురకామినులు సమ•యాహ్వానిధులు, దీర్చి మణిభూషణాంబర•దివ్యగంధ
దివ్యమాల్యాదికంబులఁ • దేజరిలుచు, సరవి నక్కన్యఁ దోడ్కొని • సరగ నరిగె.

తే. తమరు దొల్తనాఁడు మెలఁగిన•తావు చేరి, యచట నభినవగానవి•ద్యావినోద
లీల నలరారుచుండి రం•భాదుల వెదను, నిలిపి వలపంతఁ గుందుచు • నృపతి యచట.

తే. కష్టతరముగ రేయెల్లఁ • గడపి మఱియుఁ, దత్తరింపుచు వేఁకువ•తఱిని లేచి
యాచిగురుటాకుఁబోఁడి సో•యగము దద్దయుఁ దనమనంబున నిట్లని • తలఁపఁ దొడఁగె.

మ. స్మరియింతున్ స్మరమండలేశ్వరవిరా•జత్ప్రాజ్యరాజ్యేందిరన్
హరిణాక్షిన్ హరినీలనీలచికురన్ • హర్యక్షమధ్య న్మనో
హరకార్తస్వరవిగ్రహన్ భుజగరో•మాళిన్ సముద్యత్సుధా
కరబింబప్రతిమానచారుముఖి నా•గ్గంధర్వరాట్కన్యకన్. 123

చ. వలఁగొని బోటికత్తె లిరు•వంకల డాసి భజింప నింపుగా
జిలిబిలిపాట పాడునెడఁ • జేతిక డాని పసిండివీణె కా
యలబలుతాఁపునం బొదలి • యాడెడునక్కలకంఠకంఠి ను
న్గలుకుమిటారిగబ్బిచను•గుబ్బలసౌరిద నెంతు నెంతయున్. 124

చ. అఱమఱ లేక నేఁ దఱిసి • యాడ వసించినఁ జూచి నానతో
బిఱబిఱ లేచి హేమమణి•పీఠము డిగ్గి కురంగటన్ హొయల్
మెఱయ నొకింత కన్మొగిచి • మిన్నక యున్న పొలంతిమిన్న వా
ల్చూఱుకుఁ బిసాళిక్రొందళుకుఁ • జూపులకోపు మదిం దలంచెదన్. 125

చ. పస యొసఁగం బొసంగుచును•బంగరుబొమ్మ తెఱంగునన్ దరిన్
వెసఁ గనఁబడ్డ నే వలచి • వేమరు నామరుఁ డేఁపఁ దద్దయున్
బిసరుహసాయకక్రియకు • వేఁడిన మో మఱవంచి లోన నే
ముసిముసినవ్వు నవ్వుకొను•ముద్దులగుమ్మ హొయ ల్గణించెదన్. 126

క. వలఁతితనం బెలయఁగ నా, చెలికానికి నుత్తరంబు • చెప్పుచు ముద్దుల్
చిలికెడునప్పొలఁతుకనును, జిలిబిలిపలుకుల హొరంగు • చింతింతు మదిన్. 127

క. తలవంచి పసిఁడిగద్దియ, కెలనన్ నాపలుకు లాల•కింపఁగ ముంజే
చిలుకఁ బలికించి కులికెడు, తలిరాకుంబోఁడివగలు • తలఁపున నెంతున్. 128

చ. అగణితలీల తా ల్గఁగు•నట్లుగఁ జెట్లిగిరించునట్లుగా
మృగఖగపన్నగాదు లెల•మి న్విని చొక్కఁ బసిండివీణె బా
గుగ సుతి గూర్చి యామనిని • గోయిల గొల్చునభంగిఁ బాడు నా
సొగసులదొంతియబ్బురపు•శోభనగానవిధాన మెన్నెదన్. 129

చ. చెలిమివెలందు లిమ్ముగనఁ • జెచ్చెరఁ దోడ్కొనిపోవుచున్న చో
గొలగొలలాడుచు న్వెనుకఁ • గోకిలకీరమయూరశారికల్
బిలబిల నేగ వాని నద•లించు నెపంబున నన్నుఁ గూర్మితో

సొలసి గిఱుక్కు_నం దిరిగి • చూచునొ యారిరెయొయ్యార మెన్నెదన్. 130

క. బంగారు వేడ్కఁ జూచిన, తంగెడు క్రియఁ జూడ నలరి • తమి రేఁచినయా
బంగారుబొమ్మ గడితపు, సింగారం బెన్ను కొందుఁ • జిత్తమునందున్. 131

చ. తొలకరి క్రొమ్మెఱుంగుక్రియఁ • దొరపురత్న శలాక పోలిక౯
దళుకుఁబసిండిబొమ్మవలె • దర్పకవైభవలక్ష్మికై వడి౯
నలువుగ మోవిలోఁ గానఁబడి • నామది యొల్లఁ గరంచి చన్నయా
చిలుకలకొల్కి_సోయగము•చిత్తమున౯ స్మరియింతు సారెకున్. 132

సీ. కులుకుసిబ్బెపుగబ్బి•గుబ్బల వ్రేఁగున, గడగడ నసదులేఁ•గౌను వడఁక౯
గ్రందుగా రతనంపు•టందెలు గజ్జెలు, ఘలుఘల్లు మని మ్రోల్లు•కాళ్ల మొఱయఁ
గడితంపుఁగీల్జడ • కటిమండలంబునఁ, బలుదెఱంగుల లాస్య•కలన నెఱప
మురువైనహురుమంజి•ముత్యాలచేర్చుక్కు_, ఫాలభాగమున ను•య్యాల లూఁగ

తే. భావమున నన్ను విడనాడి • పోవలేని, కూర్మి నందంద తిరిగి క•న్గొనుచుఁ జనెడు
పడఁతుకలమిన్న మురిపెంపు•నడలసొంపు, చెలఁగి నాడెందమునఁ బాదు•కొలుపువాఁడ.

తే. అని తలఁచుచుండి యంత న•య్యవనిజాని
వేగుటయు లేచి సమయార్హ•విధులు దీర్చి
సచివుఁడును దాను వే వేగఁ • జని నిలింప
తరుణు లున్న ప్రదేశంబు • దఱిసి యచట. 134

క. కాంచె నుదంచన్మణిమయ, కాంచనపాంచాలికాని•కాయములఁ గడ౯
వంచింపుచుఁ దొలకరిక్రొ, మ్మించు౯ దీవియను మించు•మించుంబోఁడిన్. 135

వ. మఱియును. 136

సీ. శుకవాణి నభినవ•ముకురబింబకపోల, నలికులవేణి నే•ణాంకముఖిని
గుంభికుంభస్తని • నంభోజదళపాణి, నహిరోమవల్లరి • నచలజఘన
నండజయాన న•ఖండతేజోనిధిఁ, జంపక నాసఁ గాం•చనవిభాంగి
నావర్తనాభి నిం•దీవరలోచన, నణుమధ్య నుత్ఫుల్ల•హల్లకాంఘ్రి

తే. నఖిలభువనైకమోహిని • నబ్జకంఠి, నతులశృంగారవారాశి • నన్నిలింప
చంపకామోద నెనలేని•సంతసమునఁ, గాంచె నృపమౌళి కన్నుల•కఱవు దీర. 137

వ. అట్లు గాంచి. 138

క. కొంచింపక వడిఁ బెన్నిధిఁ, గాంచినపేదయునుబోలె • ఘనతరహర్షో
దంచితమానసుఁడై యా, పంచాననమధ్యఁ జేరి • పలికెం బ్రేమన్. 139

తే. వినుము తనుమధ్య మాటలు • వేయు నేల, వెలయునీరూపలావణ్య•విభ్రమములు
గాంచినప్పటినుండియుఁ • బంచశరుఁడు, నిల్వఁగానీఁడు ప్రాణము•ల్నిలుపు నేఁడు.
క. అరవిందనయన విను మ, స్మరుఁ డిఁక హింసింపకుండ • మనుపుము కరుణం
బరికించి మ "న్నహింసా, పరమో ధర్మ" యని స్మృతులు • పలుకన్ విననే. 141
సీ. కులుకుచు జిలిబిలి•పలుకులఁ గప్పురంపుఁ, బలుకులు తులకింపఁ • బలుకఁ గదవె
తళుకు లీనుపిసాళి•కలికిక్రేఁగంటివా, ల్చూపులకుఁజూపులఁ దేటి • చూడఁ గదవె
కమ్మచక్కెరపాన•కమ్ము లిమ్ముగఁ గ్రమ్ము, నివురుకెమ్మోవి ము • ద్దిడఁగఁ గదవె
చెన్నారుచిన్నారి•వన్నెలక్రొన్నెల, నగఁ జాలుచిఱునవ్వు • నవ్వఁ గదవె
తే. యెద ననుం గదియించి యి•య్యెదన మదన, కదనలీలల నలరింపఁ • గదవె కుంద
రదన నవచూతదళరద•చ్ఛదన త్రిదివ,సదన పరిపూర్ణపూర్ణిమా•చంద్రవదన. 142
చ. సమదగజేంద్రకుంభవిల•సత్కుచకుంభయుగంబు ఱొమ్మునం
దమి నిగుడన్ ఘటించి ప్రమ•దమ్మున బిగ్గఁ గవుంగిలించి యీ
కుసుమశరతాప మార్చి నను • సొంపుగఁ బ్రోవు మదభ్రమద్భ్రమ
ద్భ్రమరవినీలవేణి నినుఁ • బల్మఱుఁ గేల్మొగిడించి వేఁడెదన్. 143
క. అని దీనత దోఁపఁగఁ బ, ల్కిన విని తల వంచి యామృ•గీదృశ యపు డే
మిని పల్కక కూరకుండిన, జనవల్లభుఁ గాంచి యొక్క•సఖి యి ట్లనియెన్. 144
క. నరపాలక యీబాలిక, మరుపోలఁ గడుఁ గలంగి • మది నీపై ని
బ్బరముగ నిలిపిన దిఁక దే, వరచిత్తము వచ్చినట్లు • వర్తింపఁ దగున్. 145
ఆ. అనిన సంతసిల్లి • యవనిపుఁ డటు లేచి, యింతు లార యున్న•గాంతికమున
నెక్కుపటకుటీర • మున్న దచ్చటికిఁ బో, దము ముదంబు మీఱఁ • దరలి రపుడు.
క. అనవుడు వా రజ్జనసా, ధునివెంబడి నంబుజాక్షిఁ • దోడ్కొని సరగన్
ఘనతరకుతుకాన్వితహృ, ద్వనరుహులై యరిగి యరిగి • తగ నొకచోటన్. 147
సీ. సకినెలపట్టెమం•చము దోమతెర జర, తారుబాలీసు క్రొం•దగటుపఱపు
కుతినీతలాడ తఁ•ళుక్కుఁబసిండిచందువా, నిలువుటద్దములు పఁ•న్నీటిగిండ్లు
జాలవల్లికలు ము•త్యాలజాలీలు పెన్, వింజామరలు వట్టి•వేళ్లసురటి
కపురంపుబరిణెలు • కస్తూరిపీణె జ, వ్వాదిక్రోవులు పట•వాసిపెట్టె
తే. తమ్మపడిగము మంచిగం•దంపుఁగోర, తబుకు చిన్నారియడప మ•త్తరువుకుప్పె
మొదలు గలదివ్యవస్తుసం•పదలఁ బొదలు, నమలమణిమయపటకుటీ•రాంతరమున.
తే. అందఱు ప్రవేశమొంది రా•నందలీల, నపుడు నృపుఁడు నితాంతప్ర•హర్షభాస

మానమానసుఁ డై సొగ•సూని దాని, నెనయఁ గోరుచు నెపు డెప్పు•డనుచు నుండె. 150

వ. అంత దినాంతం బగుటయు.

సీ. కలికికన్నులఁ గ్రొత్త•కజ్జలం బెలయించి, తురుమున గొజ్జెంగ•విరులు దుఱిమి
నొసలఁ గస్తురిరేఖ • పస యొసంగఁగఁ దీర్చి, కలపంబు నెమ్మేనఁ • గలయ నలఁది
బెడఁగు చెంగావిపా•వడ కటి ఘటియించి, చలువమడుంగుదు•వ్వలువఁ గట్టి
జిలుగు పైఠాణికం•చెల యొడఁ గదియించి, యఱుత మల్లెసరంబు • లలర నించి

తే. హారకేయూరకటకమం•జీరకాంచి, కామణిగ్రైవతాటంక•కంకణాద్య
శేషభూషానికాయ మ•క్షీణలీలఁ, దొడిగి కై చేసి బోటు ల•ప్పుడఁతి కనిరి. 151

క. ఎలనాగ నీవు గోరిన, చెలువుఁడు నీ కబ్బె నింక • సిబ్బితి మై బె
గ్గిలి యుండక మదనాహవ, కలనావైఖరులు వెలయఁ • గలయుము వీనిన్. 152

సీ. చెలువుఁడు కేల్వట్టి • సెజ్జకుఁ దార్చుచోఁ, బెనఁగి వెన్కకుఁ జక్కఁ • జనెదు సుమ్ము
విభుఁడు నున్గపురంపు•విడె మిడ వచ్చుచోఁ, గొదికి మాఱ్మొగము పె•ట్టెదవు సుమ్ము
వరుఁడు కంచెల యూడ్చి•సిరి గంద మలఁదుచోఁ, నుదరి పెకరంతు చే•సెదవు సుమ్ము
ధవుఁడు గొప్పునఁ బువ్వు•దండలు గట్టుచోఁ, గరలి చే యొగ్గి యాఁ•గెదవు సుమ్ము

తే. ప్రియుఁడు గాటంపువలపులఁ • బెల్లు రేఁగి, యల్లనల్లన యిక్కువ • లంటి తుంట
వింటిబల్దంటపనులు గా•వించునపుడు, కసరి విసికించెదవు సుమ్ము • పసిఁడిబొమ్మ.

ఉ. అంటిమి గాని యోవికసి•తాంబుజపత్రవిశాలనేత్ర ము
న్నంటిమి గాదె నీకుఁ గల•గాటపుఁగూర్మి తెఱంగు మేలు బ
ల్దంటవు తెల్ప నేటి కిఁకఁ • దప్పక యిప్పను తేనిఁ గూడి పూ
వింటివజీరునాలమున • వేమఱుఁ బ్రేమ మెయి న్సుఖింపుమా. 154

క. అను ననుఁగుఁజెలులపలుకులు, విని యనిమిషరాజకన్య • వ్రీడానమితా
ననవనరుహ యై చుఱచుఱఁ, గనుఁగొని వారల నొకింతఁ • గసరుచుఁ బలికెన్.

ఉ. అమ్మకచెల్ల మీరు నను • నారడిఁ బెట్టి జడింగి పోవ ను
ల్లమ్మునఁ బూనినా రవు బ•శా సరిలే కన వచ్చె మీవివే
క మ్మిపు డేను వెంబడిసె • క్రమ్మఱ వచ్చెదఁ గాని హా యిఁకన్
మి మ్మెడఁబాసి యిం దొకని•మేషము నొంటిఁ జరింప లేఁ జుఁడీ. 156

చ. కటకట మీర లిట్టిబలు•కట్టిడ లౌట యెఱుంగ నేర కి
చ్చటికి కిటు నమ్మి వచ్చుటకు • సారెకు బూమెలు పన్ని నన్ను బి
ట్టటుటు నొందఁ జేసెదరు • హా కొద యేమిటి కమ్మలార మీ

కుటిలత గానవచ్చె నిదె•గో పెఱమాటలు వేయు నేటికిన్. 157

క. అని పలుకుచుఁ గేళీగృహ, మునకుం జేరఁ గున్న చిన్ని•ముగుదలమిన్నం
గనుఁగొని వినయమ్మున న, య్యనుఁగుంబువుఁబోఁడు లాత్తి•యని రి ట్లనుచున్.

శా. బాలా! చేలవె మేలుమే లిపు డహో•బాగాయె తే గాఁపురం
బీలా గైన ధరిత్రిఁ గన్నియల ము•న్వీక్షింపమే వార లీ
మేలంబు ల్పచరించి క్రచ్చుగొనిరే•మేల్పట్టులం దయ్యెడన్
జాలుం జాలు బెడంద యేల పదమా•క్ష్మాభృత్సమీపోర్వికిన్. 159

సీ. చెయివట్టి పూసెజ్జఁ•జేర్పఁ బోయెకు వెలం, దుక కరంబు విదల్చి•త్రోచి వైచి
యబ్బబ్బ పద గదె•గబ్బి యంచు నదల్చు, తరలాక్షిఁ గ్రొవ్విరి•దండఁ గొట్టి
వగలాడి యిపు డెంత•బిగసెదే యని నవ్వు, మెఱుఁగుఁబోఁడిని బంతు•లొత్తికి తిట్టి
సరిసరి బులు పెల్ల•సడలెనా యిపు డను, భామినీమణి నెత్తు•బాటి మాచి

తే. పూని యిర్వురు ముప్వురు•పాదుగఁబట్టి, ముందటికిఁ ద్రోయ గడికంపు•మున్న టికల
నడుగు దరలక యిడిగిలఁ•బడి పెనంగు, చున్న కన్నెకు మఱియు న•య్యన్న లనిరి.

క. అల్లపుకు పెక్కులాగుల, నెల్లఱు బతిమాలుకొంటి•వెడలనికూర్మిన్
జెల్లంబో యేమె యోసెమ, మల్లడిగొని పెనఁగె దిపుడు•మాతో మిగులన్. 161

క. అగ్గలపువలపుసోలపుల, బెగ్గిలుచుండితివి మున్ను•ప్రియనాథునితో
డగ్గఱఁగఁ జేయునపు డీ, సి గ్గేటికిఁ బోడమెనమ్మ•చిత్తరుబొమ్మా. 162

క. బిఱబిఱ విభుకడ కరుగక, కొఱకొఱ లాడెద వ దేమి•గోరము మేల్మేల్
వెఱఁ గయ్యెడిఁ గద నీచెడు, కఱదలు గనుఁగొన్న నెన్నఁ•గన్నెలమిన్నా. 163

సీ. చేరి కాళ్లఁ బెనంగు•గారాపుటనుఁగురా, యంచబోదలఁ బో న•డంచె దేమి
తెలియాకుమడుపు చే•తికిఁ దెచ్చి యిడుబోటి, కత్తియ నదలించి•కసరె దేమి
జిలుఁగుఁబయ్యెద చెంగు•జీరాడ నది చక్క, సవరించు చెలిఁ దట్టి•సణిగె దేమి
పద మహావర్తము డాసెఁ•బతిచెంత కని తెల్పు, చేడెపైఁ గన్నెఱ్ఱఁ•జేసె దేమి

తే. వారిజాక్షిరో యిటువంటి•వారె కారె, కోరి సారెకుఁ బువ్వులు•కోరిబల్వ
జీరుపోరులఁ గేరి య•య్యారె మగల, నోల లాడించి ప్రౌఢ లై•యుండువారు.

చ. అని యిటు లూరడించి చెలు•లవ్విభుచెంతకు నింతి మిన్నఁ దో
డ్కొని చని పూలసెజ్జకడఁ•గోమలి నుంచి నృపాలచంద్ర యి
య్యనిమిషకాంత నెంతయుఁ బ్రి•యం బలరారఁగ నేలుకొమ్ము కొ
మ్మని తగ నప్పగించి వెస•నందఱు జాఱిరి మన్కిపట్లకున్. 165

చ. అపుడు నృపాలుఁ డమ్మధుక • రాలకజాలకసోయగంబు గా
టపుఁదమి మీఱఁ గన్గొని త • టాలున ముంజెయి వట్టి పూలపా
నుపునకుఁ దార్చి చోఁ జెలఁగె • నూపురభూరిఝుళంఝుళధ్వనుల్
విపులగతి న్మనోభవుఁడు • విల్లు గుణధ్వని చేసెనో యనన్. 166

ఉ. ఇందునిభాస్య నాన నపు • డీడిగిలం బడి పూలపాన్పునం
జెందక యున్న నోఁడు వలి • చెక్కులు గన్నులు మోవి ఫాల మా
నందము మీఱఁ జుంబన మొ • నర్చుచు నిక్కువ లంటుచుక్ హొయల్
గ్రందుకొనం గుచంబు లెద • గట్టిగఁ బట్టి కవుంగిలింపుచున్. 167

క. మెల్లనె పూసెజ్జను దిని, పల్లవనామణిని దిగిచి • జానుగ న్పృథుధ
మ్మిల్లల మొకింమక నిమురుచు, హల్లకదళపాణి కిట్టు • లనియెం బ్రేమన్. 168

క. నావ యిటు లేమిటికి నలి, నానన కెమ్మోవి పంట • నానఁగ నిడినన్
నాననవిల్తుని చెయివులు, నానందింపఁగ నొనర్చి • యలరింపఁ గదే. 169

ఉ. దండిగఁ దావి చెంగలువ • దండలు గ్రొమ్ముడిఁ జుట్టనిమ్ము క
న్పండువు గాఁగ గబ్బిచను • బంతులు పట్టఁగ నిమ్ము పుష్పకో
దండునికేళి నేలి ప్రమ • దంబునఁ దేలఁగ నిమ్ము మత్తవే
దండసమానయాన యొక • దండము నీకు నొసంగి వేఁడెదన్. 170

చ. పలుచని తేనియల్ చిలుకఁ • బల్కవె కోకిలవాణి లేఁతన
వ్వులు వొలయంగ నన్ గృప ద • వుల్కఁగఁ జూడు సరోజపాణి పె
న్వల పలరార ము ద్దొసఁగి • వాంఛలు దీర్చు మదాలివేణి య
గ్గలముగఁ గౌఁగిలింపఁ గదె • కంతుని మేలిపతాణి పోణిమిన్. 171

సీ. పాలిండ్లు కెంగేలఁ • బట్ట నిచ్చిన మేటి, కళుకుబంగరుగిండ్లు • కాను కిత్తు
వలపార నమఁ జూచి • కిలకిల నవ్వినఁ, జే రైనముత్యాల • పేరు లిత్తుఁ
దావినిద్దంపుఁగె • మ్మోవి ము ద్దొసఁగిన, సొంపు రాణింపుబ • ల్కెంపు లిత్తుఁ
దళుకులేఁజెక్కు • టద్దము లంట నిచ్చిన, వెల లేనివజ్రంపుఁ • బలుక లిత్తుఁ
తే. బూలపాన్పునఁ గొద లేని • హాళి నతను, కేళి నోలాడఁ జేసిన • లీలఁ గ్రాల
మేలిసామ్రాజ్య మిత్తు ని • వ్వేళ యింత, గోలతన మేల నను నేలు • కొనవె బాల. 172

క. అని బుజ్జగించి పలుకుచు, జనపాలకమౌళి వేల్పు • చానయొయారం
బున కాత్మ నంతకంతకు, ఘనతరమోహాతిశయము • గడలుకొనంగన్. 173

సీ. కపురంపువిడె మొసం • గఁగఁ బోవు నెపమునఁ, గావిమెమ్మోవిఁ బల్గం ట్లొనర్చి

వలపుఁగస్తురిగంద • మలఁదు నెపంబునఁ, గులుకుసిబ్బెపుగబ్బి•గుబ్బ లంటి
జాళువా మొలనూలు • సవరించు నెపమున, డంబారఁ ఘనజఘ•నంబు నిమిరి
యలరి కొజ్జెఁగదండ • లలరించు నెపమున, విప్పారు నెఱిగప్పుఁ • గొప్పు దువ్వి
తే. తళుకుఁజెక్కులు చుంబించి • వళులు నారుఁ
బొక్కిలియుఁ గేల గిలిగింత • పొడమ ముట్టి
నీవి సడలించి స్మరశాస్త్ర•నియతి వెలయ
రతులఁ గరఁగించె నృపతి యా•రాజముఖిని. 174

సీ. వితతదంతక్షతా•వృతసుధాధరయు న, మంచితనిశ్వాస•మారుతయును
శితనఖరాంకురాం•కితకుచకుంభయు, ఘర్మకణాక్లిన్న•గండతలయు
వదనాంబుజాతసం•వ్యాప్తశిరోజయు, ఘనతరసీత్కార•గళరవయును
రణితమంజీరకం•కణకింకిణీకయుఁ, దరళితహారల•తాప్రకరయు
తే. గళదనూనమృగీమద•కర్దమయును, సదమలానందపరవశ•సంహననయు
నగుచు సురకాంత మిగుల సౌ•ఖ్యం బొసర్చె, నంగభవకేళి నానృప•పుంగవునకు.

సీ. చెలువంపుఁగనుబొమ • ల్శింగిణీవిండ్లుగాఁ, జూఱుకుఁజూపులు శర•స్తోమములుగ
గాటంపునూఁగారు•ఘనకృపాణము గాఁగ, సోగక్రొందెళిగొళ్లు • సురెలు గాఁగఁ
బిగికౌఁగిలింతలు • పెనఁగులాటలు గాఁగ, సుపమాంగరాగంబు • జోడు గాఁగ
నఖదంతపదవితా•నము పోటుగంట్లుగా, ఘర్మతోయంబు ర•క్తంబు గాఁగఁ
తే. గటకనూపురకింకిణీ•కంకణప్ర, ణాదములు భూరికలకల•నాదములుగఁ
గామినీమణి యతను•సంగ్రామకేళి, సలిపె నప్పుడు నృపకుల•తిలకుఁ దొడరి. 176

సీ. వదలిన నెఱికొప్పు•వారివాహము గాఁగఁ, దనరుచు లెమ్మెఱుఁగుమొ•త్తములు గాఁగ
గళరవంబు లనూన•గర్జాధ్వనులు గాఁగ, వలపుటూర్పులు గంధ•వాహములుగ
గళితముక్తాఫలం•బులు వడగండ్లుగాఁ, గింకిణీధ్వనులు భే•కీధ్వనులుగ
సీత్కృతారవములు • చిమ్మెటరొదలుగా, బెడఁగులేనగవులు • ఫేనములుగ
తే. మేన జాల్కొను చెమ్మటు•ల్వాన గాఁగఁ, గరఁగుమృగనాభిపంకంబు•బురద గాఁగ
నఖపదము లింద్రగోపబృం•దములు గాఁగ, మగువ సురతంబు వర్షాగ•మంబుఁబోలె.
తే. అంత సురతాంతవేళ న•య్యింతి సంక, తలమునం దిడి గుబ్బలఁ • గలప మలఁది
కురులు కొప్పిడి తొడవులు • గుదురుపఱచి, కడిఁది నెత్తావికపురంపు•విడె మొసంగి.
క. వలినాలికమ్మగాడ్పులు, వొలయఁగఁ బూసురటికేలఁ • బూని విసరుచున్
జిలిబిలినునుఁబలుకులఁ జెలి, నలరింపుచు రేయిఁ గడపె • నవనిపుఁ డెలమిన్. 179

వ. అంత. 180

సీ. సారసకల్హార•సదమలవా॥పూర, పూరితకాసార•తీరములను
జరికల్పితాలీన•పరభృతసంతాన, కలయాకృతోద్యాన•వాటికలను
బహుళదరీప్రాంత•భాసమానాశ్రాంత, విస్తృతశశికాంత•వేదికలను
సరసవిభ్రాదభ్ర•చంద్రికాసంశుభ్ర, తలసుదగ్రసితాభ్ర•పులినములను

తే. ప్రతిదినంబును హితరీతిఁ • జతురశీతి, బంధబంధురరతికళా•పారవశ్య
లీలఁ గ్రీడింపుచుండె ని•లింపమాన, వతియుఁ దాను ఋతుధ్వజ•క్షితివరుండు. 181

సీ. పువుఁబోఁడికటిచక్ర • మవనిభాగము గాఁగ, గలికినెమ్మోయి కన•కంబు గాఁగఁ
దరుణిగుబ్బలు మేటి•గిరిదుర్గములు గాఁగఁ, బడఁతిచెక్కులు హీర•ఫలకములుగ
గజయానకంధర•విజయశంఖము గాఁగఁ, గాంతజంఘలు వీర•కాహళులుగఁ
బాలఁతులమిన్నపొ•క్కిలి మహానిధి గాఁగ, లలనవేనలి ఘన•లక్ష్మి గాఁగ

తే. నెంచి నిజరాజ్యవైభవో•ద్వృత్తి యెల్ల, మఱచి నిస్తులమదనసా•మ్రాజ్యవైభ
వానుభవలీలఁ గాలుచు•నన్నరేంద్రుఁ,డతులితామోదహృదయుఁడై•యలరుచుండె.

వ. అని నారదమహామునీంద్రునకుఁ జతురాననుం డెఱింగించిన నతం డతనినవ్వలికథా
విధానం బడుగుటయును. 183

శా. వ్యాకీర్ణాభజటాటవీతటనితాం•తాలంబితోద్వృత్తమి
స్రాకాంతా ప్రఘటప్రభాసముదయా•క్రాంతప్రపుల్లన్మహా
నాకద్వీపవతీవినిర్మలజలాం•తర్భాగభాగ్దివ్యరే
ఖాకాంతోత్పలకైరవప్రకరభా•గా పార్వతీవల్లభా. 184

క. కాండనిధిశయనకాండా, కాండధరోద్దండదర్ప•ఖండన వృషరా
ట్కాండ బహుకాండకాండవి, చండా నిర్దళితవిద్వి•షద్వేదండా. 185

మాలిని. కలితగుణకలాపా • కాంచనాహార్యచాపా
జలజనయనరోపా • సంహృతాశేషపాపా
బలవదరిదురాపా • భానుకోటిప్రతాపా
విలసితభవతాపా • వేదవేద్యస్వరూపా. 186

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రా
జ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్య
పుత్త్ర సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామతిమ్మకవిసార్వభౌమప్రణీతం
బైనరసికజనమనోభిరామం బనుశృంగారరసప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# రసికజనమనోభిరామము

## షష్ఠాశ్వాసము.

రుచిరపీఠనగరా
గార శుభాకార భక్త • గణమందారా
సూరిజనాధార సమి
ద్ధీరా వరతామ్రచూడ • దివ్యశరీరా. 1

వ. అవధరింపుము నిలింపమహామునీంద్రునకుం బితామహుం డిట్లని చెప్పం దొడంగె నట్లు ఋతుధ్వజక్షితితలాధీశ్వరుం డిష్టోపభోగంబులం దనియు మండి యొక్క నాఁడు వధూసమేతుం డై వాహ్యాళి వెడలి ఘోరకాంతారప్రదేశంబు ప్రవేశించి.

సీ. ఘనసారచందనా • గరుతరుచ్ఛాయలఁ, గమనీయనవరత్న • కందరములఁ
గనకారవిందసం • గతసరస్తటముల, సదమలామృతఝరీ • సైకతములఁ
బ్రాకటద్రాక్షాల • తాకుడుంగంబులఁ, గుముదబంధూపల • కుట్టిమములఁ
బరిణతమాకంద • పరిసరస్థలములఁ, బ్రసవచాంపేయక • ప్రాజ్యవనుల
తే. సారనీహారనీరప్ర • పూరతీర, ముల మెలంగుచు నమ్మహీ • తలవిభుండు
మంజువాణికి నచట సం • మగ్రవైభ, వములు దమి మీఱఁ జూపుచు • రమణఁ బలికె.

క. అల్లదె చూచితె వలపులఁ, బెల్లడరుచు లేజవాది • పిల్లులు వని రం
జిల్లెడు నవమాతలతా, పల్లవరుగ్భాసమాన • పదరదవసనా. 4

తే. నడలఁ దొడలఁ గుచంబులఁ • దొడరి తన్ను, గెలిచి తని యేమొ నీచెంత • నిలువ నోడి
పఱచుచున్నది యదె చూడు • భద్రకరిణి, చకితసారంగశాబక • చారునయన. 5

క. సముదంచితవాలవ్యాజ, నములన్ వీచుచును శ్రమక • ణము లుడిపెడునీ
చమరీతతిఁ గనుఁగొంటివె, సమదమధువ్రతవితాన • చారుశిరోజా. 6

శా. హేరాళంబుగ నీదుకన్నుఁగవతో • నీ డొందఁగా లేక కాఁ

తారక్షోణిని జేరి తద్దయు మన•స్తాపంబు దీపింప న
య్యారే దిక్కులు చూచుచుం బఱచెడిన్ • హాళి న్విలోకింపుమా
సారంగం బదె ప్రావృషేణ్యవిలస•త్సౌదామనీవిగ్రహా. 7

క. నీకౌనుదీఁగె కెన గా, లే కేమొ కలంగి కడుఁ జ•లింపుచు గుహలన్
దాఁగొనియె సింగ మదె యా, లోకింపుము మదచకోర•లోచన దానిన్. 8

తే. తొడరి నీముద్దుకెమ్మోవి•దొండపం డ, టంచు భావించి యేమొ డా•యంగఁ జేరి
కులుకుచున్నది చూడు రా•చిలుకగమి ప్ర, భాతవికసితశతపత్ర•పత్రనేత్ర. 9

క. శృంగారరసము చిలుకుచు, సంగీతకళారహస్య•చాతురిఁ దగునీ
భృంగాంగనఁ గనుఁగొంటివె, గంగారంగత్తరంగ•కమనీయవళీ. 10

తే. చెలువు మీఱెడునీకొప్పు • జలద మనియుఁ
దనురుచు ల్మించు లంచును • దలఁచి యేమొ
యాడుచున్నది నెమ్మి యు•ల్లదిగొ చూడు
కుంభికుంభోల్లసత్కుచ•కుంభయుగళి. 11

క. కలరవ మల్లదె రతులం, గలయునెడ న్నీ వొనర్చు•గళరవము క్రియం
బలుకుచు నున్నది విను నవ, జలజాతదళోపమాన•సదమలచరణా. 12

ఉ. భిల్లసరోజలోచనలు • పింఛపటంబులు గట్టి బిట్టు శో
భిల్లుచు నల్లవారె వనిఁ • బెల్లుగ గానము సేయుచున్న వా
రల్లము పల్లవింప నిపు • డొయ్యన చూడుము కార్తికీనిశా
వల్లకబంధుమండలని•భామలకోమలవక్త్రపంకజా. 13

సీ. మల్లికామాధవీ•మంజరీమధుమదా, నందితసుందరేం•దిందిరములఁ
బరిపక్వసహకార•ఫలరసాస్వాదన, లోలలీలాశుక•జాలకముల
విమలసరస్తోయ•కమలనాళాహార, లాలసమత్తమ•రాళతతులఁ
గలితామ్రపల్లవ•గ్రాసావలేపవి, భాస్వరసుస్వర•పరభృతముల

తే. బహుతరఝరీతరంగని•ర్ఘరనినాద, ఘనఘనాఘననినదశం•కాముహుఃప్ర
నర్తితానేకకేకిబృం•దములఁ జూడు, రమ్యశుభగాత్రి గంధర్వ•రాజపుత్త్రి. 14

సీ. మేటిగొజ్జఁగనీటి•యేటివాఁగులు దాఁటి, మలయుపూసంపెఁగ•మ్రాఁకు లెక్కి
ఘనసారకదళికా•వనముల విహరించి, పొదలుక్రొవ్విరిమ•ల్లెపొదలు దూఱి
పరిఫుల్లకేతకీ•ప్రసవవాసన లాని, సదమదాంబుజసర•స్తటుల మెలఁగి
కమ్మజవాదిగం•ధమ్ములు చేకొని, లవలీనికుంజగు•ల్మములు దరిసి

తే. మందమందప్రయాణము • ల్స్పందడింపఁ, దొడరి ఘర్మాంబులేశంబు • లుడిపికొనుచు
వీచుచున్నది గాడుపు • లేచి చూడు, తప్తచామీకరోపమో•ద్దీప్తగాత్రి. 15

వ. అని చూపుచుం జని చని యొక్క రమ్యప్రదేశంబున నిలింపదంపతు లింపుసొంపుల
దీపింపఁ గ్రీడించినజాడ లీక్షించి మఱియు నయ్యంగనామణి కిట్లనియె. 16

క. చూడుము గంధర్వవధూ, చూడామణి యిందు దివిజ•సుందరులుఁ బతు
ల్వేడుక లలరఁగ మదన, క్రీడల విహరించినట్టి•రీతులు వరుసన్. 17

క. ధేనుకబంధంబున నొక, చానయుఁ బల్లవుఁడుఁ గ్రీడ • సలిపిరి తమి ని
చ్చో నారుకరపదంబులు, గానంబడెఁ జూడు వికచ•కంజాతముఖీ; 18

క. పురుషుఁ డొకచెలిని గరపద, కరణంబునఁ గూడె నెలమిఁ • గనుఁగొను మిదె క
ప్పురపుజిగిలె న్నిరోముఖి, గురుకుచభుజముద్ర లంటు•కొన్నవి తరుణీ. 19

శా. అంభోజానన యొార్తు ప్రోఢ యగుచుక్ • వాళి న్మనోభర్తతోఁ
బుంభావాసమబాణకేళి నిచటక్ • భోగించె నెంతేని సం
రంభం బొప్పఁగఁ జూడు వేసలివిరుల్ • రాలె న్వసంతాగమా
రంభోజ్జృంభితమత్తకోకిలవధూ•రాజద్వచోవైభవా. 20

తే. కరపదంబులు చాఁచి చెం•గావిమోవి
శయ్య నిడి యున్న చెలిని మా•ర్గాలకరణ
మునఁ బ్రియుఁడు గూడె నిందుఁ దాం•బూలరాగ
కుంకుమాంకంబు లలరెఁ గ•న్గొనుము చెలియ. 21

తే. శూలచితబంధమున నొక్క•వాలుఁగంటి, విటుని గవగూడెఁ జూడు మి•వ్విరులసెజ్జ
నొక్కకా ల్చేర్చి యున్నచో • ప్పొప్పు మీఱె, పాకిపరిపక్వబింబఫ•లాధరోష్ఠి. 
ము. ప్రియుఁడుం గామినియుం గడంక లెలయం • బ్రేంఖావతీనామకో
చ్చయబంధంబునఁ గూడి రిచ్చిపురుసెజ్జం గూర్మి హెచ్చం బద
ద్వయము ల్గాత్రుపడ న్మెలంగినవినో•దం బెల్లఁ గన్పట్టెడిం
బ్రియ మాక్షం గనుఁ గొమ్ము మత్తమధులి•డ్బృందాభవేణీభరా. 23

చ. అలరఁగ సింహవిక్రమము•హాకరణంబున నొక్క మానినీ
తిలకము పల్లవుం గదిసెఁ • దెల్లముగాఁ బరికించి చూడు మో
జలజదళాక్షి యివ్వికచ•చంపకభూజముచెంత నెంతయుం
బొలు పలరారి మూఁడుపద•ము ల్గదు రొప్పఁ గనంగ నయ్యెడిన్. 24

క. కను మవలంబితకరణం, బునఁ గూడిరి సతియు వల్ల•భుఁడు నిదె యొకగో

డను లాక్షారస మొకఁగో, డను జందనకర్దమంబు • డాకొనెఁ బడఁతీ. 25

క. అని యిత్తెఱఁగున వనజా, ననకుం జూపుచు ధరాధి•నాథాగ్రణి కా
ననభూమధ్యంబున సం, జనితామోదమున మెలఁగు•సమయమునందున్. 26

సీ. కఠినాద్రిశిఖరనీ•కాశమూర్ధముతోడఁ, గుఱుచజుంజుఱుపల్ల•నెఱులతోడ
సానుభాగోన్నత•స్ఫారవక్షముతోడ, దంష్ట్రికరాళవ•క్త్రంబుతోడఁ
దాళభూమీరుహో•త్తాలబాహులతోడఁ, గడిఁది మీఱువెడంద•కడుపుతోడఁ
గొఱవులక్రియ రగు•లొక్కనుమిడిగ్రుడ్లతో, నచలోపమానదే•హంబుతోడ

తే. భువనభయదాట్టహాసవి•స్ఫురణతోడ, ఘోరుఁ డనునొక్కనిశిచర•వీరుఁ డప్పు
డక్కజంబుగఁ దెరువున•కడ్డు దాఁకి, దాఁకమెఱయంగ నమ్మహీ•ధవుని జూచి.

ఉ. ఓరి నృపాలకాధమ య•యో భయ మింతయు లేక యిట్లు కాం
తారధరాతలంబున ని•తంబిని గూడి మెలంగె దింక మ
ద్ఘోరనిశాతభల్లములఁ • గూల్చి వడి న్భుజియింతుఁ గాక ని
న్నూరక పోవ నిత్తునె ప్రి•యోక్తుల నేమిటనైన మెత్తునే. 28

ఉ. కానక కాన కివ్వికచ•కైరవపత్రవిశాలలోచనం
బూనికతోడఁ దోడుకొని • మున్నటికం బఱతెంచి టింక నీ
ప్రాణము దక్కఁ జూచుకొని • బంటుతనం బటు గట్టిపెట్టి యి
మ్మానిని డించి వేగఁ జను•మా నిను నూరక పోవ నిచ్చెదన్. 29

చ. అనవుడు ధారుణీరమణుఁ • డౌర నిశాట కడిందిబంటవై
పొనుపున నిల్చి యాగడపుఁ•బోకలఁ బోయెదు నేఁడు నిన్ను మ
ద్ఘనవిశిఖానలోజ్జ్వలశి•ఖావిసరంబులపాలు చేసి కా
లునిపురిఁ జేర్చెద న్నిఖిల•లోకజనాభిహితం బొనర్చెదన్. 30

ఉ. ఆమునఁ ద్రుళ్లుకొంచు దను•జాధమ నోరికి వచ్చినట్టు లే
మేమొ దురోక్తు లాడెదిది • యెక్కువబంటుతనంబె నేఁడు నా
తో మొనకట్టి యాలమునఁ • దూలక నిల్వుము నిన్మధుద్విష
త్కాముకవిరోధు లడ్డపడి • కాచినఁ బ్రోవఁగనీక త్రుంచెదన్. 31

తే. అనిన వాఁ డప్డు రోషతా•మ్రాక్షుఁ డగుచు
వింట గొనయంబు సంధించి • మంట లెగయు
కఱుకుమొనవాఁడితూపు ల•క్కజము మీఱ
నమ్మహీజానిపైఁ బది•యైదు పఱపె. 32

చ. పఱపిన నల్గి యద్ధరణిపాలుఁడు సింగిణి యొక్కవెట్టి బ
ల్కఱకులకోరు లాఱు నరఘస్మరుపై నిగుడించి యార్చినం
గొఱకొఱతోడ వాఁడు నొకక్రూరశరం బరివోసి యేసి యు
క్కఱ నొనరించె భూవిభునదగ్రపరాక్రమలీలఁ గ్రాలుచున్. 33

సీ. సుగవైరిపై ధరావరుఁ డొకయిరువది, ములుకులు నిగుడించి మూరి యడంచె
ధరణీశుమీఁదఁ గ్రమ్మఱ రక్కసుఁడు నూఱు, తూపులు పఱపించి యేపు డించె
నృపతిపై మఱి యామినీచరపతి యేను, బదిచిల్కు లడరించి కుదిలపఱిచె
రజనీచరునిమీఁద రాజవర్యుం డొక్క, వేయిబాణము లేసి పీచ మడఁచె
తే. దొనల నలుఁగులు దివియుట తొడుగుటయును
నేయుటయుఁ గాఁడుటయుఁ బయి కెగయుటయును
గాన రాకుండ నబ్రంబు గాఁగ నట్లు
పెనఁగుచుండిరి బీరంబు లినుముడింప. 34

శా. క్షోణీపాలుఁడు చిమ్మనమ్ములెడఁ ద్రుంచు న్నిర్జరారాతి గీ
ర్వాణద్వేషణుఁ డేయుబాణము లెడన్ వారించు భూజాని త
త్తూణీరంబుల నిండుకొన్న విశిఖస్తోమం బొకింతంత సం
క్షీణం బై చనఁ బోరి రిర్వురు నిటు ల్చిత్రాతిచిత్రంబుగన్. 35

క. గొదగొని దనుజాధముఁ డొక, గదఁ గొని నడతేర నృపశిఖామణి వానిం
బదిలుఁ డయి కదిసి కొదుగక, గుదియం జదియంగ మోది కుదియం జేసెన్. 36

క. శూలంబుల భీషణకర, వాలంబుల నుగ్రభిండివాలంబుల నా
భీలగదాముద్గరశర, జాలంబులఁ దవిలి పోరు సలిపిరి మిగులన్. 37

వ. ఇట్లనేకప్రకారంబులం బెఱుతివియక మూఁడహోరాత్రంబు లెడతెగక తొడరి
పోరుచుండి రప్పుడు. 38

తే. అవనిజాని సముగ్రరోషారుణితవి, నేత్రుఁ డయి వానిఁ బోనీక నిశితచంద్ర
హాసమున మస్తకముఁ దెగవ్రేసి యవనిఁ, గూల్చె నమరులు చదలున నిల్చి పొగడ.

వ. అయ్యవసరంబున. 40

క. వలనుగ విభునకుఁ దనపైఁ, గలకూరిమి యరసి చూడఁగా వలె నంచున్
దలఁగి తదంతికమున నొక, యలరుం బొదరింట నింతి యడఁగి వసించెన్. 41

క. జనవరుఁ డటువలె రక్కసుఁ, దునుమాడి రయంబ మరలి తొయ్యలి నచ్చో
టునఁ గానక గుండియ ఝ, ల్లని లీలఁగ నబ్బురంపు టార్తి యొసంగన్. 42

క. ఎక్కడి కేఁగెనొ హా యిపు, డొక్కతెయుం దెరువు వట్టి • యువతివతంసం
బక్కట నాపై నింతయు, నక్కటికము లేక కూర్మి • యారడిఁ బోవన్. 43
క. చంచలలోచన యెందరు, డెంచెను ననుఁ గానలేక • దృఢబలవిలస
త్పంచశరనిశితవిశిఖా, కుంచితహృత్కమల యగుచు • గొడవలు బెరయన్. 44
సీ. అలికిఁ గేకులహాళి•హాళికి గద్దతిపి కా, వలికి మందపుఁగరు•వలికిఁ గసరు
చిలికి సారెకుఁ జేరి • కులికి యార్చుపిసాళి, కలికి రాచిలుక తె•క్కలికిఁ దొగల
చెలికిఁ గప్రపుబూతి•వలికి మారునిపూవు, ములికిమొత్తములయం•కిలికి నంచ
కలికిమిన్నలబల్ర•వలికి శారికలర, వలికి నామనిపెద్ద•పులికి మృదుల
తే. వలికిఁ బన్నీటివాఁకయు•బ్బలికి గంధ
ఫలికి వికసితసుమవన•స్థలికిఁ గూర్మి
వెలికిఁ గ్రమ్మఁగఁ జిలుకల•కొలికి యెంత
యలికి యలికెనొ మముఁ దూలఁ • బలికి నేఁడు. 45
ఆ. ఏమి సేయువాఁడ • నిపు డిందుముఖిజాడ, గానరాదు చూడఁ • జానతోడ
నెడసి తాళఁ జాల • నెవ్వార లివ్వేళ, నళుకు మాన్చి మనుపఁ•గల రటంచు. 46
ఉ. హా యను మారసంగరక•ళాతిశయానమితాప్సరస్సమా
హా యనుఁ దప్తకాంచనస•మంచితచంచలచంచలాభదే
హా యను దివ్యరత్నఖచి•తాంగదదీప్తమృణాళనాళబా
హా యను నెట్టు లోర్తు నహా•హా రుచిరాస్యసరోరుహా యనున్. 47
క. ఎన్నఁడు చూతు నహో నిన్, గన్నులపండువుగ నీకఁ జో•కారపునవలా
మిన్నా పూఁబోన్నా కడు, నెన్నికఁ గనుమరునియాము•లేనుఁగుగున్నా. 48
క. కులనారీమణుల న్వెల, యొలనాగలు నీకు జోక•యే తలఁప నహా
కల నైన నీమనోభవ, కలనావైఖరులు మఱవఁ•గలనా లలనా. 49
క. ఇంతయుఁ గనికర మూనక, వంతల నిడి చనఁగఁ దగునె • వలిగొజ్జెఁగపూ
బంతీ యింతీ సొగసుల, దొంతీ క్రొందుంటవింటి•దొరమదదంతీ. 51
ఉ. కూరిమి మీఱ నీకులుకు•గుబ్బలఁ గ్రొమ్మన నాని సారెకున్
జేరిక మోవి ముద్దుగొని • చెక్కులు గీటి కడుం గడిందియొ
య్యారము చూపుకోపు నెటఁ•చు నన్మదిఁ బాయ దిఁ కేమి సేతు నా
హా రమణీ మనోభవుని•హారమణీ రమణీశిరోమణీ. 50
చ. కటకట యిప్పు డింత యలు•కా యలుకా బలుకానలోన న

న్నటమట నొందఁ జేయఁ దగ • వా నగవా పగవాఁడనే యిఁ కె
న్నటికిని నిన్నుఁ బాయఁ గల • నా లలనా వలనా కలంచ నేఁ
డేటువలెఁ దాళువాఁడఁ బోలఁ • తీ వలఁతీ కలతీరు దెల్పుమా. 52

వ. అని మఱియుం దనలోన ని ట్లని పలవింపం దొడంగె. 53

చ. తవిలి కలంచు గాటపు వె • తం గడి నొంటికిఁ బోదు కంటికిం
బవలును రేయిఁ గూడ నొక • పాఱెయుఁ గూరుకు రా దనుంగు లో
నువిదలఁ గూడి వేడుకల • నుండఁగ నేమియుఁ బ్రేమ లే దహో
శివశివ యింకఁ దన్బ్రదు • కుశేశయలోచనఁ జూడఁ గల్గునే. 54

ఉ. సన్నలఁ జాయల న్వలపు • చల్లు తెఱంగులు మేమెఱుంగులుం
జిన్ని యొయారపుం గొనబుఁ • జిన్నెలు నెన్నిక గన్న వన్నెలుం
గన్నులఁ గట్టిన ట్లగుచుఁ • గన్నులవింటివజీరు తేజి యా
నన్నులమిన్న చె న్నెపుడు • హా మదిఁ జాల విరాలి గొల్పెడిన్. 55

చ. కిలకిలలాడుచుం దఱిని • గేళి మెలంగు తెఱంగు జాణయై
వలపులు చిల్క పల్క చెలు • వంబుగఁ బల్కు హొరంగుసారె వి
చ్చలవిడిఁ బొంగి యంగభవ • సంగరలీలఁ జెలంగు భంగులుం
దలఁచిన గుండె ఝల్లు మను • దాని హొయ ల్గణుతింప శక్యమే. 56

సీ. కురులు గమ్మలు సరు • ల్గుబ్బలు నటియింప, గడగడ నసదులేఁ • గౌను వడఁకఁ
జెక్కులజిలిబిలి • చెమ్మట ల్జాల్గొన, నుదుటికస్తురిబొట్టు • పదనుకొనఁగఁ
గంకణకింకిణీ • కటకధ్వను లెసంగ, గళరవసీత్కా • రములు చెలఁగ
నఱమోడ్పు కనుదోయి • చుఱుకుఁజూపులు మీఱఁ, గలపంపు మైపూఁత • కరఁగి పాఱఁ
తే. బొదవి చెక్కులు గీటి కెం • బెదవి యాని, కులికి కిలకిల నగి ముద్దు • చిలుకఁ బలికి
వలచి వలపించి యుపరతిఁ • గలయు జాణ, దాని నెడఁబాసి యే జాడఁ • దాళువాఁడ.

సీ. ఒకమాటు పైఁటకొం • గోరగాఁ దొలఁగించి, మెఁఱుగుగుబ్బలయంద • మెఱుఁగఁ జేయు
నొకమాటు క్రొమ్ముడి • యొప్పుగా ముడి విప్పి, విప్పుగాఁ గ్రమ్మఱఁ • గొప్పు దిద్దు
నొకమాటు కూరిమి • ప్రకటంబు సేయుచుఁ, గులుకుఁబల్కులముద్దు • చిలుకుచుండు
నొకమాటు గాటంపు • టొఱపు రాణింపఁగా, జిలిబిలిసొలపుఁజూ • పులఁ గరంచు
తే. నొక్కమాటు మనోభవా • యోధనక్రి, యాప్రవీణతఁ జూపి బి • ట్టలరఁ జేయు
నార మది నొక్కతఱి నైన • నక్కడింది, మగువ నెఱజాణతనములు • మఱువరాదు.
సీ. చిలుకలకొలికి ము • ద్దులగుమ్మ వన్నెల, గని చొక్కారపుమాని • కములమూట

తొలుకజిక్రొమ్మించు తలిరుజొంపపుమావి, పగడపుఁదీఁగ సోయగపుఁగొలను
కులుకుమిటారి తళ్కుపసిండికీల్బొమ్మ, వలపులదీవి చెంగలువబావి
యన్నులమిన్న యొయ్యారమ్ములకొటారు, మరునిపూఁదూపు చేమంతిబంతి
తే. చికిలిక్రొమ్మించుటద్దంబు పికిలిచెండు, కప్పురపుఁదావి యొప్పులకుప్ప యనఁగ
నలరుజగవన్నెలాడి యయ్యారె దాని, చెలువు మదిఁ బాయ దిఁక నేమి సేయువాఁడ.
శా. ప్రాంతారామధరానిరంతరవిహారస్ఫారలీలారతిన్
సంతోషింపక యిమ్మహాగహనసంచారభ్రమం జేల నై
యెంతే దవ్వుగ నేగుదెంచుటకు నేఁ డిచ్చోట నా కేల య
య్యింతిం గూర్చితి వేల పో నిడితి విం కె ట్లోర్తు హా దైవమా. 60
తే. అనుచు మఱియు సహింపంగ నలవి గాని, కంతుసంతాపభరమునఁ గ్రాఁగి వేఁగి
వేగ మీఱెడుచేతోవికార మొదవ, నంగజబలంబుఁ గూర్చి యిట్లనుచుఁ బలికె.
సీ. డెంద మార్తిఁ గలంగి కుంద మాటికి నేఁచ, నందమా మము నీకుఁ జందమామ
యలుక లూరఁగఁ జెందు చిలుక నూరక యుబ్బి, పలుక మేఁగయె మీకుఁ జిలుకలార
మొకము చూడక పెద్దమెకముల ట్లరిదివా, లకము లూనెద రేల పికములార
ముదము మీఱఁగఁ గాని పదము వాడెద రింత, మదము మీ కేల షట్పదములార
తే. మారుఁడా మందగంధసమీరుఁడా మ, యూరమా సారచంద్రికాపూరమా మ
రాళమా మత్తశారికాజాలమా యి, దేల మము నేఁచెద రటంచుఁ దూలి మఱియు.
క. మరుఁడా విచలితసకలా, మరుఁడా గరుడాసనునికొమరుఁడా సుమతో
మరుఁడా విరహులపై వే, మరు డాయఁగ రాకు క్రూరమతిఁ బోమరుఁడా. 63
క. నిలు డాయ రాకు మలయా, నిలుఁడా నవకమలినీవనీసౌరభసం
కులుఁడా పటుబలుఁడా చం, చలుఁడా ఖలుఁడా వియోగిజనతానలుఁడా. 64
క. మామా యను విరహులఁ జల, మా మాటికి నేఁచఁ జందమామా గామా
మామానినీక్షమాయని, మామా మామాట సేయుమా మా నెనయన్. 65
ఆ. సంతనగ వియోగిసంతతిపై నలు, సంత దయయు లేక సంతసమున
సంతపింపఁ జేయు సంతతక్రూరమా, సంత రాకు మిఁక వసంత నీవు. 66
క. మతమా నీ కెప్పుడు నిదే, వ్రతమా తెరువరులఁ జెనక వచ్చెదవు మధు
వ్రతమా పరభృతమా పరి, వృతమాద్యత్కరకురరపృతనాశతమా. 67
వ. అని యనేకప్రకారంబుల మనోవికారంబునం బలికి కలికిం బరికింపం గోరి వనాం
తరంబు దూఱి. 68

సీ. కిలకిలమనుచు రా•చిలుకలు పలుకుచోఁ, గలికిపల్కు లటంచు • నులికి యళుకుఁ
గవగొని కొదమజ•క్కవ లేగుచో ముద్దుఁ, బడఁతిగుబ్బ లటంటుఁ • బట్టఁ దివురుఁ
దమి మీఱ నెమ్మి మొ•త్తము లాడుచో దంతి, గమనవేనలి యంచు•భ్రమసి చూచుఁ
జెలరేఁగి గండుఁగో•యిలపిండు గూయుచో, నబలయెలుం గని • యాలకించు
తే. నంచబోదలు మొగి నడ•తెంచుచోటఁ, జంచలేక్షణ నెన్నడ • లంచు నెంచుఁ
బంచశరఘోరసాయకా•పంచితాతి, జంచలాత్మీయహృదయుఁడై • జనవిభుండు.
తే. అట్లు వనవీథిఁ దిరుగుచు • నంతకంత, కగ్గలం బగుమారార్తి • నడలి బడలి
మృగవిలోకన నరయుచు • మృగఖగాగ, మాదికంబుల నిట్లని • యడుగఁ దొడఁగె.
సీ. అలులార చెంచుతొ•య్యలులార జక్కవ, చెలులార చూడరె • జలజముఖిని
దరులార చిలుకబి•త్తరులార కుసుమమం, జరులార చూడరె • సరసమతిని
గవులార కరటిపుం•గవులార యచలసా, నువులార చూడరె • యువతిమణిని
వనులార చిలువజ•వ్వనులార మత్తకే, కినులార చూడరె • వినయవతిని
తే. బికములార మృగేంద్రశా•బకములార, క్రౌంచలార క్రొలంకురా•యంచలార
జింకలార జగాగార•వంకలార, చూడరే నేఁడు చేడె నీ•జాడలందు. 71
వ. అని మఱియును. 72
క. మద మారఁగ ముద మారఁగఁ, బద మానఁగనీక పెల్లు•పడి మొరసెదు ష
ట్పదమా పదమా ఘనవన, పదమార్గమునం బయోజ•పదమాటునకున్. 73
క. అలుకా మదిఁ బూనెదు చెలి, కలుకా మామీఁద నిట్టు • లఱ చేసె యహా
చిలుకా బలుకానల గా, సిలుకారణ మేమి ముద్దు•చిలుకం జెపుమా. 74
క. పికమా యభినవమణిదీ, పికమాడ్కి వెలుంగునిందు•బింబానన యో
పిక మాలి యెందుఁ గుందెనొ, చికమకలం బెట్టి కిపుడు • చెపుమా మాకున్. 75
క. కోరిక లీరిక లెత్తఁగఁ, జేరిక నూఁగరయె వలచి • శివశివ యిపు డా
నారి కడుఁ గేరి కదలెఁ, శారిక నీ వాపె తెఱఁగు • సరగునఁ జెపుమా. 76
క. హారీతపికమయూరీ, శారీతతులార వలపు • సడలదు మీ రిం
దేరీతి నుండెనో మా, నారీతిలకంబుఁ జూచి•నారే చెప్పుఁడా. 77
క. జీవము మా కిపు డారా, జీవముఖీమణియె బంధు•జీవమ జీవం
జీవమ భయవిచలితరా, జీవమ దైవమ యెఱుంగఁ • జెప్పఁగ నేలా. 78
క. సారంగమ రంగన్మద, సారంగమ భూరిగంధ•సారంగమ హా
సారసమా నవవికసిత, సారసమా చూపఁ గదరె • సారసమాక్షిన్. 79

క. పలుమాఱు విన్నవించితిఁ, జెలిమార్గ మెఱింగించు కయినఁ • జెప్పవు నీకుం
జలమా తలమా గొబ్బునఁ, గలమాట వచింపు మంద•గంధానిలమా. 80

ఉ. సాలములార చంపక ర•సాలములార కదంబనింబహిం
తాలములార తూలపుర•తాలములార తమాలమాలతీ
జాలములార మీ రిపుడు • జాలము సేయక యాదరించి మా
బాలకురంగలోచన నం•భంగురలీలఁ గనంగఁ జేయరే. 81

క. ఈడా నీఫలములతోఁ, నీ ఢగువలిగుబ్బ లలసు•నిభగామిని దా
నీడక యీడకు వచ్చెను, వేడుక దనరార మాకు • వేగమె చెప్పుమా. 82

క. మాకందమ శృంగారర, మాకందమ వేఁగఁ జూపు • మాకందమహా
మాకంద మలర నవసుమ, మాకందళితాంబురుహద•ళాయత నేత్రన్. 83

సీ. అన్నులతలమిన్నఁ • గన్నారఁ జూపరే, పొన్నలార వెడంద•జిన్నలార
రతనంపుగని యిందు • రాదు గదా గుజ్జు, మావులార కడింది•మోవులార
చిలుకలకొల్కి మీ•చెంత నేఁగదు గదా, మల్లులార తమాల•వల్లులార
సొగసులదొంతి నిం • దగపడఁ జేయరే, ప్రబ్బలార సురంగు•దబ్బలార

తే. కలికితొలుకటిక్రొమ్మించు•కరణి మించు
మురువు రాణించు నదియించు • ముద్దుగుమ్మ
రాదు గద యిందు వలపుఁగ•ప్రంపుటనఁటి
మోకలార చోకారంపు•దాఁకలార. 84

క. అని యనివారిత మగువల, పునఁ బునరవిజృంభమాణ•పుండ్రేక్షుశరా
సనబాధాపరవశుఁ డై, వనిఁ ద్రిమ్మరుచుండె నంత • వనితామణియున్. 85

క. జనవరునకుఁ దనపైఁ గల, ఘనతరమోహాంధకార•గౌరవముఁ గనుం
గొని మదిఁ గరఁగి తటాలున, ననపొదరి ల్వెడలి దాపు•నం గనుపట్టెన్. 86

క. కనుపట్టిన రమణిం బోడ, గని పోయినసొమ్ము మరలఁ • గనుపడ్డ తెఱం
గునఁ బొంగి నేలతేఁ డా, ననఁబోఁడులమిన్నఁ జూచి • నగుచుం బలికెన్. 87

క. ఒప్పులకుప్పరొ నీపై, నెప్పుడు మది నిలిపి యుండి • యిటు నావలనం
ద ప్పేమి గలిగె నూరక, చెప్పక రాఁ దగునె యులికి • చిలుకలకొలికీ. 88

సీ. చాన నీకెమ్మోవి•పానకం బానక, తెరలెడుబలుదూప • దీఱిపోదు
బాల నీబాహువల్లి•జాలము ల్చేర్పక, యతనుతాపవికార • మాఱి చనదు
భామ నీకుచదుర్గ•సీమ వసింపక, ఘోరమారబలార్తి • గ్రాఁగఁ బడదు

చెలి నీకృపారసో•జ్జ్వలవృష్టి పర్వక, సమధికకామస•స్యము ఫలింప
తే. దప్పహ యిఁక నైనఁ దహతహ • నడలనీక, నీకవుంగిట నన్నహ•ర్నిశము నునిచి
ప్రేమ దైవార వేమఱుఁ • గాముకేళి, నోలలాడించి యేలుము • నీలవేణి. 89

సీ. అలికులవేణి శ•రాసనభ్రూవల్లి, మలయజాతామోద • పులినజఘన
లికుచవక్షోజ నా•ళీకపత్త్రేక్షణ, కోకిలకలవాణి • కుందరదన
రాకేందువదన శ•రచ్చంద్రికాహాస, గజరాజగామిని • కంబుకంఠి
పల్లవపాణి శం•పాలతావిగ్రహ, బిసబాహువల్లరి • విద్రుమోష్ఠి
తే. భుజగరోమాళి నవతిల•పుష్పనాస, తారకోదారనఖర రం•భోరుకాండ
పంచముఖమధ్య మృదులద•ర్పణకపోల, గురుకృపాలీల నను నేలు•కొనవె బాల. 90

వ. అని యనంగశరాసారధారాపూరపూరితశరీరుం డగుచుం దఱిసి గాఢపరిరంభచుంబనాదిసంభోగలీలావిహారంబుల నన్నితంబినీమణిం గూడి క్రీడించి యయ్యింతియుం దానును గ్రమ్మఱ నిజపటకుటీరాంతరంబు చేరి యిష్టోపభోగంబులం దనియుచుండె నంత. 91

క. కంతునిభమూర్తి యగుభూ, కాంతాగ్రేసరునితోడఁ • గలసి ప్రహర్ష
స్వాంత యయి యుండుచో న, క్కాంతాజనరత్నమునకు • గర్భం బయ్యెన్. 92

క. చిట్టుములు నోకిలింతలు, నిట్టూర్పులు దళముకొనియె • నెమ్మదిఁ గోర్కుల్
బిట్టొదవెఁ గట్టుపట్టును, మట్టుగ జఘనంబు ప్రబలె • మహిళామణికిన్. 93

క. మేలినచెండ్లతో నెన, పోలుపఁ దగుచిగురుటాకుఁ•బోఁడిమెఱుంగుం
బాలిండ్లు చూడఁ జూడఁగఁ, దాళఫలోపమము లగుచుఁ • దద్దయు బలిసెన్. 94

తే. నేలచేడియ యవ్వేల్పు•వాలుఁగంటి
యుదరమునఁ బుట్టి నూహించి • ముదముతోఁ బ్ర
వేశ మొందుచు నున్నదో • వెస ననంగఁ
బొలఁతుకకు మంటిచొరవ మి•క్కిలియుఁ బొసఁగె. 95

క. ఘనజఘనస్తనమధ్యం, బున నడుఁకెడుతరుణినడుము • భూపతి చేప
ట్టినకతన నబ్బురపుకీ, విని బెంపు వహించి పిఱ్ఱు•వీఁగుచు నుండెన్. 96

తే. చిలుకతేజీవజీరుచేఁ • జెలఁగుమేలి, జాళువాబొంగరములపైఁ • గ్రాలుచున్న
వలుదవేలుపురాచతా•ములుకు లనఁగ, నెలఁతుకలమిన్నచనుమొనల్ •నలుపు మీఱె.

క. చిగురాకు దొండపండును, బగడంబును దమ్మికెంపు • బంధూకము నీ
డగు ననఁ దగునునువాతెఱ, మిగులం దెలుపారె నపుడు • మీనేక్షణకున్. 98

తే. అలఁతిచీమలచాలుతోఁ • దుల యొనర్ప, వఱలు నాళీకపత్త్రాక్షి • మెఱుఁగుటారు
బాలనీలభుజంగంబుఁ • బోలి యపుడు, గాటమై పూఁటపూఁటకుఁ • గారుకొనియె.

ఆ. పొన్నపువ్వుదీటు • పోల్పులోకులమాట, సూటు చేసి వేల్పు•బోటినాభి
విస్తరిల్లె నపుడు • వెడఁదబావిని బోల్చు, నేర్పుకాంద్రమాట • నేటు చేసి. 100

సీ. తళుకులేఁజెక్కుటద్దములు వెల్వెలఁ బాఱె, నిద్దంపునెమ్మేను • తద్ద డస్సె
నడుగొకయామడై•నడలు దొట్రిలఁ జొచ్చెఁ, ద్రుణము మేరునగంబు•తెఱఁగు దోఁచెఁ
దట్టంపుటొఱపుము•త్తరులఁ స్రుక్కులు దేఱెఁ, దరిలేనియలఁతి ని•ద్దురలు మీఱె
బలుముత్తియంపుఁబే•రులు చాల బ్రేఁగయ్యెఁ, దొడవులొక్కొకకొన్ని•సడలిజాఱె

తే. జడత వాటిల్లె బడలిక • సంఘటిల్లె, వన్నె గొద యయ్యె నెలుఁగింత • సన్నగిల్లె
విన్నదిమ్మరిరాముద్దు•టున్నమిన్న, కెన్న నాపన్నసత్త్వ యై • యున్నకతన. 101

వ. అట్లు గర్భంబు దాల్చి యద్దివిషద్వధూరత్నం బొక శుభముహూర్తంబున జగజ్జనాభి
నంద్య యగుబాలారత్నం బుదయించినం గాంచి దానిం దదంతికగుహాంతరంబున
నునిచి యిట్లనియె. 102

క. బాలా యిగ్గుహలోనికి, హేలామార్గమున నెవ్వఁ • డేతెంచు నిజం
బాలలితో దారుఁడు తత్కాలంబున నీకు మగఁడు • గాఁగలఁడు సుమీ. 103

క. అని తెలిపి సురవధూమణి, మనుజేంద్రుని జూచి నీవు • మసలక పురికిం
జను మింక నిజనివాసం, బున కరిగెద నేను నృపతి•పుంగవ నెమ్మిన్. 104

చ. అనవుడు గుండె ఝల్లు మన • నల్లన సోలి కడిందిజాలిలోఁ
బెనఁగొన వెచ్చ నూర్చుచును • బెగ్గిలుచుం గడునుమ్మలించుచుం
గనుఁగవ నశ్రుబిందువులు • గ్రమ్మఁగ గద్గదకంఠుఁడై రయం
బునఁ జెలి చెట్ట వట్టుకొని • భూపకులాగ్రణి పల్కెఁ గూరిమిన్. 105

ఉ. అక్కటమిక్కుటంపువల • పారఁ దవుల్కొని నెమ్మనంబునం
జక్కరబొమ్మ నీచెలిమి • శాశ్వత మంచుఁ దలంచుచుంటిఁగా
మక్కువ వీడ నాడి నను • మారునిబారికి నప్పగించి నీ
వెక్కడి కేగఁ జూచె దిపు•డే నినుఁ బోవ నిడంగ నేర్తునే. 106

ఉ. అంగము లొక్కటై పొదువ • నల్లికబిల్లికలై కరంబు ను
ప్పొంగుచుఁ బెక్కునాఁడు లొక•పూఁటయొ కాఁగ మెలంగుచుంటి మి
బ్బంగిఁ గృపావిహీనమతిఁ • బల్కెదవో యెన రింత లేక మే
ల్బంగరుబొమ్మ యింక నినుఁ • బాసి క్షణంబును నిల్వ నేర్తునే. 107

చ. అలుక యొకింత యెట్టితటి • నైన నెఱుంగక నిచ్చనిచ్చలుం
దలఁగనిక్రొత్తకూరుములు • దార్కొన నంగజసౌఖ్యలీలలన్
మెలఁగుచునుంటి మిర్వురము • నెమ్మి దలిర్పఁగ నేఁటిదాఁక నో
యలికులవేణి నన్ను విడ•నాడి చనంగఁ బదంబు లాడునే. 108

సీ. కొమ్మ నీయధరామృ•తమ్ముఁ గ్రోలుటఁ జేసి, యాహారవాంఛ యిం•తైన లేక
చామ నీకుచదుర్గ•సీమ నుండుటఁ జేసి, స్మరబలభీతి లే•శమును గనక
సుదతి నీసంభోగ•సుఖము గల్గుటఁ జేసి, బహుతరరాజ్యవై•భవము వదలి
కలికి నీతనుకాంతి•కనక మబ్బుటఁ జేసి, ధనసంగ్రహేచ్ఛ కొం•తయు నెఱుఁగక
తే. ప్రతిదినంబును నీపొందు • సత మటంచు, నమ్మి యితరానుభవవిధా•నమ్ము లెల్ల
విడిచి యుండుట కహహా న•న్నీడనాడి, చనఁ దలంచుట న్యాయంబె • చంద్రవదన.

క. కరు లేటికి గడితపుబం, గరు లేటికి మఱియు మేల్న•గరు లేటికి రా
సిరు లేటికి బలురతనపు, సరు లేటికి నిన్ను విడిచి • చనునెడఁ దరుణీ. 110

ఉ. తామరసాక్షి నమ్ము మిదె • దైవముసాక్షిగ నీకుఁ జెప్పెదం
బ్రేమ దలిర్ప నిన్గలసి • పెక్కుదినంబులనుండియున్ సము
ద్దామమనోజరాజ్యపర•తంత్రత నుండితి నీవు లేనిచో
భూములు గీములు న్ఘనవి•భూతులు నీతులు నాకు నేటికిన్. 111

చ. తగిలినప్రేమ మాట జవ•దాఁటక యెన్నఁడుఁ బాయ మంచు నొ
ప్పుగఁ గవగూడి యొందు నఱ• పూనక యుంటిమి యిప్పు డెంతయున్
వెగటుగ నాడి గుండియలు • వ్రీలఁగఁ జేసెదు హా జగంబునన్
మగువల నమ్మరా దనెడు•మాట నిజంబుగఁ దోఁచెఁ బో చెలీ. 112

చ. ఇచ్చట నీకు నుండుట కొ•కించుక ముచ్చట లేక యుండినన్
మచ్చికతోడ నీక్షణమె • మాపురికిం జనుదెమ్ము కాక యా
పచ్చనివింటిబల్తులువ•బారికి నగ్గము చేసి పోక నన్
జెచ్చెర నీదుచెంకి కఱ• సేయక తోడ్కొనిపొమ్ము వచ్చెదన్. 118

క. మానిని నిను నాపట్టపు, *జానిగ నొనరించి సకల•సామ్రాజ్యంబున్
మానుగ నీ కిడి కొలిచెద, నానాజనసహితముగ న•నారతభక్తిన్. 114

ఆ. అనినఁ గలికి పలికె • నవనీశ నీకింత, చింత యేల కడిఁది•వంత యేల
సంతసమునఁ బురికిఁ • జని నెమ్మి దైవార, నఖిలరాజ్యసుఖము • లనుభవింపు. 115

తే. నరపతివి నీవు నేను గం•ధర్వసతిని, దైవవశమున మనకు ని•ద్దఱికిఁ జెలిమి

యొదవెఁ గొన్నేఁడు లింక నిం • దుండరాదు, పోయి వచ్చెద సెలవిమ్ము•భూపతిలక.

తే. అనుచు నిటు లూరడించి యా•య్యధిపుచేత
నాజ్ఞఁ గొని యింతి పఱతెంచె • నాకమునకు
దళము కొలువంగఁ బసిఁడియం•దలము నెక్కి
జనవరుండును నిజపురం•బునకుఁ జనియె. 117

క. అంతట వనదేవత ల, త్యంతామోదమునఁ బెనుప • నసదృశతేజః
కాంతివిలాసంబుల గుహ, నెంతయుఁ గుశలమున బాల • యెదుగుచునుండెన్. 118

సీ. కురులు బొమ్మలమీఁదఁ • గులికి పెంపెసలాడె, నెదఁ జిన్నిచన్నులు • గదురులెత్తెఁ
దావిమోవికిఁ గ్రొత్త•తలిరుడాలు ఘటిల్లె, నూనూఁగునూఁగారు • గాననయ్యె
గనుదోయి నఱ సిగ్గు•కలికి చూపులు మీఱె, వలిచెక్కుఁగవకుఁ గ్రొం•దళుకులాదవె
జిలిబిలిముద్దుప•ల్కులసొల పలరారె, మొగమునఁ జిన్నారి•నగవు లెసఁగె

తే. నడలఁ గడ లేనిమురిపెంబు • గడలుకొనియెఁ
గటియు జఘనంబు నొక్కింత • ఘనతఁ జెందె
నాఁడునాఁటికి రాచపూఁ•బోఁడికొప్పు
మించులేజవ్వనం బంకు•రించుటయును. 119

క. మఱియుఁ గుచంబులు గటియును, నెఱియు న్విస్తరిలె నాభి • నిమ్నతఁ జెందెన్
మెఱుఁగారునారు గార్కొనె, నెఱజవ్వన మిందుముఖికి • నిండారుటయున్. 120

వ. ఆసమయంబున. 121

చ. అలులుఁ బికంబులు న్శుకము • లంచలు శారికలు న్నెమళ్లు వి
చ్చలవిడిఁ బొంగి చెంగటఁ బొ•సంగ హళాహళి సేయుచున్న ను
గ్మలి యొకయింతమన్మథవి•కారము నెమ్మది నంకురించినం
దలఁకక తల్లి చెప్పినవి•ధంబుఁ దలంచి వినిశ్చలాత్మ యై. 122

చ. గడితపునారచీరఁ గటిఁ • గట్టి పటుస్ఫటికాక్షమాలికల్
మెడఁ గడు నించి దట్టముగ • మేన విభూతి యలంది పెన్నెరుల్
జడలుగఁ దాల్చి డెందమునఁ • జాల దిటం బగుభక్తిఁ బూని య
ప్పడఁతుక యబ్బురంబుగఁ ద•పం బొనరింపఁ దొడంగె నెంతయున్. 123

క. అనిశము జలదళపవనా, శనవృత్తి న్మనుచు దివిజ•సంఘము వొగడం
దనరక బహుకల్పము లా, ననఁబోఁడులమిన్న తప మొ•నర్చుచు నుండెన్. 124

తే. అని పితామహుఁ డెఱిఁగింప•నమరవరాని, యంతట ఋతుధ్వజక్ష్మా•కాంతపుత్రి

చంద మే మయ్యె నెఱిఁగింపు•సరవి ననిన, నయ్యజుం డాతనికి నిట్లు • లానతిచ్చె.

క. విను మునిజనపంచానన, మును గౌతముఁ డనఁగ విప్ర•ముఖ్యుఁ డొకఁడు భూ
జనసుత నిష్ఠాపరుఁ డై, యనుపమవిద్యానిరూఢి • నలరుచు నుండెన్. 126

క. భూసురతతిలో వన్నెయు, వాసియు దీపింప నెలమి • వర్తిలు నెడలన్
నాసాహీనుం డొకసుతుఁ, డాసంయమి కుద్భవించె • నద్భుతసరణిన్. 127

సీ. అత్తెఱంగున వికృ•తాకారుఁ డై ప్రభ,వించినసుతు నిరీ•క్షించి తల్లి
దండ్రు లత్యంతచిం•తావ్యాకులస్వాంతు, లై యంత జాతక•ర్మాదివిధు లొ
నర్చి గౌతముఁ డను•నామధేయం బిడి, యైదవయేఁట నం•య్యర్భకునకుఁ
శ్రీయమార్గమున నుప•నయనంబు గావించి, యాదరంబున నుపా•ధ్యాయునొద్దఁ

తే. జదువఁ బెట్టిన నిబిడల•జ్జాభరంబు
పేర్మి నొకయాతురంబును • బ్రేమతోడఁ
జదువుకొనఁ డయ్యె శిష్యులఁ • గదిసి విహిత
మగుసహాధ్యాయితయుఁ గాంచఁ • డయ్యె నతఁడు. 128

క. గాయత్ర్యభ్యసనంబును, వాయుసఖోపాసనంబు • వదలక యెపుడుం
జేయుచు నుండె ద్విజోత్తముఁ, డాయుర్వర్ధన మొసంగ • నతనికి మిగులన్. 129

తే. అగ్నికార్యంబువలన గా•యత్రివలన, బ్రాహ్మణుం డనునామమం•త్రంబుఁ బెరసెఁ
గాని విద్యావధూపరి•గ్రహము లబ్బ, వయ్యె నమ్మేదినీనిర్జ•రాన్వయునకు. 130

వ. అట్లగుటం జేసి మహావైరాగ్యం బూని యతండు. 131

సీ. కాశీగయాప్రయా•గములఁ గేదారంబు, బదరికాశ్రమము చం•పకవనంబు
నైమిశారణ్యంబు • నారాయణాశ్రమం, బరుణాచలము వేంక•టాచలంబు
శ్రీపర్వతము కురు•క్షేత్ర మవంతిక, కాంచి ద్వారావతి • కాళహస్తి
మధుర శ్రీకూర్మంబు • మాయ యయోధ్య యా, హోబలంబును బురు•షోత్తమంబు

తే. మొదలు గల్గుమహాక్షేత్ర•ములకు సారె
వచ్చుచును బోవుచును బెక్కు•వత్సరములు
గడపి యంతట నొకనాఁడు • కౌతుకం బె
సంగఁ బఱతెంచె నీహార•శైలమునకు. 132

వ. అట్లు పఱతెంచి యమ్మహామహీధరాగ్రభాగంబునం గొంతదడవు విహరించి యంత
నచ్చట నొక్కగుహఁ గనుంగొని. 133

క. అగ్గుహలోపలి కెంతయు, దిగ్గన సొత్తెంచి యందు • దృఢమానసుఁ డై

యొగ్గలపుభక్తితో స, మ్యగ్గతిఁ దప మాచరింప • నాత్మఁ దలంచెన్. 134

తే. తలఁచి వర్తించుచో నొక్క • దండ నొంటిఁ, దపముఁ గావించుచున్న వృ • ద్ధప్రసూన
గంధి నత్యంతశిథిలవి • గ్రహఁ బ్రపూత, బ్రహ్మచారిణిఁ జూచె న • బ్రంబు దోఁప.

తే. చూచి యేచినవేడ్క నం • జ్ఞోటిదరికిఁ, జేరి చేరికతో నమ • స్కృతి యొనర్చు
టయు నివారించి యాపద్మ • నయన యతని, నంచితాపాంగదృష్టి నీ • క్షించి పలికె.

క. ధరణీసురవర నాకుక్, వరుఁడవు గాఁగలవు నీవు • వంచించుచు ని
క్కరణిక్ ద్రొక్కఁగఁ దగ దనఁ, గరములు ముకుళించి మౌని • కామిని కనియెన్.

తే. పెద్దదానవు తపమునఁ • దద్ద నిలిచి, యున్నదానవు గుణముల • మిన్న నీవు
తలిరుఁబ్రాయంబు నల్పవి • ద్యయును గలుగు, నేను నీ కెట్లు వరుఁడఁ గా • నేర్తుఁదరుణి.

సీ. అనిన నమ్మానిని • యమహాత్మునివరునితో, మును ఋతుధ్వజమహా • జనవిభుండు
వల నొప్ప వేఁటకు • వచ్చుటయును నిటాం, తామోదలీల సు • శ్యామ యనెడు
గంధర్వకన్యకఁ • గాంచుటయును దాని, గాఢతరప్రేమఁ • గలయుటయును
వారికిర్వురకుఁ దా • నారూఢిఁ బ్రభవించు, టయుఁ దల్లి తనుఁ గడుఁ • బ్రియముతోడ

తే. నగ్గహాగేహమున నుంచి • యబల యిచటి
కెవ్వఁ డేతెంచు నతఁడు నీ • కెనయ మగఁడు
గాఁగలఁ డటంచుఁ బలికి నా • కమున కెలమి
నేఁగుటయుఁ దెల్పి వెండియు • నిట్టు లనియె. 139

తే. మునివరేణ్యఋతుధ్వజ • మనుజపతికిఁ, ద్రిదశకాంతకుఁ బుట్టినా • డొమ్మదలు గాఁగ
నురుతపోనిష్ఠ నిచటనె • యున్న దాన, నిచటి కెవ్వండు నెపుడు రాఁ • డీవు దక్క.

తే. వినుము మాతండ్రి యెనుబది • వేలయేండ్లు, ధరణిఁ బాలించి యిచటనె • తప మొనర్చి
నాకమున కేగె నవ్విభు • నందనుండు, నట్ల చనెఁ బదివేలేఁడు • లవని యేలి. 141

తే. నాఁటనుండియుఁ దరల కిం • చోట నున్న, దాన నన్యుల కొసఁగిన • దానఁ గాను
దల్లి దండ్రులు లేనిస్వ • తంత్రురాల, రాజకన్యను వ్రతనిష్ఠఁ • బ్రబలుదాన. 142

వ. కావునఁ బురుషార్థిని నగునన్నుం బరిగ్రహింపు మనిన నాగౌతముం డి ట్లనియె.

తే. వనజముఖి నేను వేయేండ్ల • వాఁడ నీవు, బహుసహస్రాబ్దములదాన • వహహ వృద్ధ
వైననీకును బాలుఁడ • నైననాకు, ఘటన యిం కెవ్విధమునఁ గాఁ • గలదు చెపుమ.

ఆ. అనిన నబల పలికె • ననఘ ము న్నాకీవు, భర్త వై సృజింపఁ • బడితి వజుని
చేత నింక నొరుని • జేకొన నొల్ల న, ట్లగుట నన్నుఁ దెగడఁ • దగదు నీకు. 145

తే. తాపసోత్తంస న న్ననా • దరణ చేసి, విడువఁ జూచెదవేని భా • వించి నీవు

గనుఁగొనుచునుండ నిపు డెని • క్కముగఁ దనువు విడుచుచు దాన నటన్న లో • నదలి యతఁడు.

క. నాసాహీనుఁడ విద్యా, భ్యాసం బెన్నఁడు నెఱుంగ • నంభోజముఖీ
యేసరణి నీమనోరథ, మే సమకూర్పంగ నేర్తు • హిత వారంగన్. 147

తే. ఘనసురూపంబు సద్విద్య • యును దొరకిన, బిదప నీవచనంబు చే • సెద నటన్న
నల్లరి నెయ్యంబు దైవార • నతనిఁ జూచి, వృద్ధకామిని వెండియు • నిట్టు లనియె.

క. తపమున నాచే వాక్సతి, యపరిమితామోద యయ్యె • నవలుఁడు నటులే
కృపఁ జూచువాఁడు వానికి, నిపు డతివిద్యయు సురూప • మిడియెదరు సుమీ.

క. అని పలికి యవ్వధూటీ, జనరత్నం బపుడు భక్తి • చాతురి మెఱయన్
వనజాతభవునికూరిమి, వనఁబోఁడి న్వేఁడఁ దొడఁగె • నమ్రతతోడన్. 150

సీ. జయ చతుర్ముఖవక్త్ర • సౌధవిహారిణి, జయ సితాంభోరుహా • సననిషణ్ణ
జయ మత్తకాదంబ • సైంధవగామిని, జయ కుందమందార • సదృశవర్ణ
జయ దివ్యరత్నభూ • షణవిరాజద్గాత్రి, జయ యామినీకర • శకలమౌళి
జయ సమస్తామ్నాయ • సారసంవేదిని, జయ మానిహృదయకా • సారహంసి
తే. జయ పురందరముఖసుధా • శనవితాన, భగ్నకోటీరవిలసిత • పద్మరాగ
మణిమయూఖావళీరాజ • మాననూత్న, చరణపద్మద్వయాడంబ • శారదాంబ. 151

సీ. శుకదండవల్లకీ • ముకురపుస్తకపాణి, లాలితనీలరో • లంబవేణి
బహుళవిద్యాదాన • పాలితాంతర్వాణి, రుచిరావలోకన • ప్రచలితైణి
కవిజనస్తుతిపాత్ర • కలితగుణశ్రేణి, మత్తవనప్రియ • మంజువాణి
కటిభాగనిర్జితా • ఖండమహాక్షోణి, బాహుదండాగ్రశుం • భత్కృపాణి
తే. పరమకల్యాణి కమలసం • భవునిరాణి, పరమపదసౌధనిశ్రేణి • పరిచితేంది
రాముఖాఖిలగీర్వాణి • రాజమాన, ఘనకృపాదృష్టి మముఁ బ్రోవఁ • గదవె వాణి.

క. తల్లీ యమరీలోకము, తల్లీ మల్లిందుకుంద • దరసురభూరు
ద్వల్లీనిభశుభగాత్రి భ, వల్లీలాలోకనంబు • వడి నింపఁ గదే. 153

మ. చిరకారుణ్యమతీ మహాగుణవతీ • శృంగారలీలారతీ
శరదబ్జాభశుభాకృతీ నయగతీ • శశ్వత్ప్రభావోన్నతీ
సరసీజాతసముద్భవప్రియసతీ • సాహిత్యవిద్యాధృతీ
నిరతాశేషజగన్నుతీ భగవతీ • నిన్ మ్రొక్కెద న్భారతీ. 154

మ. తనరారన్ భవదీయసత్కృపకుఁ బాత్రం బైనపాపిష్ఠుం డిలన్
మనుజాధీశులచే ధనమ్ము గొని సామ్రాజ్యైకధౌరేయుఁ డై

అనవద్యస్థితి నొందఁ జో "సుకవితా • యద్యస్తి రాజ్యేన కి"
మ్మను వాచాకలనంబు నిక్కముగ నం•బా కంబుకంఠీమణీ. 155

క. అలఘుతరభక్తి నీపద, జలజాతము లాశ్రయింతుఁ • జదువుల జేజే
కులికీ పలుకుంజిలుకల, కొలికీ నీకరుణ యిరవు•కొలుపుము నాపైఁ. 156

మ. అనవద్యాగమవేద్య సద్రుచిరక•ల్యాణప్రదు న్దేవతా
జనచూడామణి నబ్జజాచ్యుతమహే•శానస్వరూపుఙ్ ద్విజా
వననైపుణ్యనిధిం గృశానుఁ డనలు • న్వహ్నిన్ హుతాశి న్శిఖిన్
నిను సేవించెద నెప్పుడు న్ననుఁ గృప • న్వీక్షింపు వైశ్వానరా. 157

వ. అని యనేకప్రకారంబుల వాగ్దేవిం బ్రార్థించి వైశ్వానరుం బ్రసన్నుం జేసికొని య
మ్మునిపతి సతితరవిద్యారూపసంపన్నుం గాంచిన నతం డత్యంతసంప్రీతచేతస్కుం
డై యప్పుండరీకనయనం గూడుకొని మనోజక్రీడావినోదంబులం బ్రమోదించుచుం
డె నంత. 158

తే. ప్రతిదినంబును బ్రోవులై • శతసహస్ర, సంఖ్యలను మీఱి యతిథు లా•జంపతులను
గాంచు వేడుకతోఁ బఱ•తెంచుచుండి, రట్లు చేరినవారల • నాదరించి. 159

వ. భయభక్తిసంభ్రమంబులు వెలయ సత్కారంబు లొనరించి వీడ్కొలుపుచుండి రం
దు బాలోన్మత్తయువజనంబులు కొందఱు వారిం గని నగి గేలి యొనర్చుచుండిరి మ
ఱియుం గొంద ఱావృద్ధాంగనం గనుంగొని. 160

క. పడఁతిరో నిజముగ నీతఁడు, కొడుకో మనుమండొ నీకుఁ • గొంచింపక యే
ర్పడఁ దెలుపుము మా కనుచుం, గడు నగి రొకకొంద ఱుత్సు•కత మీఱంగన్.

ఆ. పల్వలోదకంబు • బాలాతపము నిశా, యామదధిసమన్వి•తాశనంబు
వృద్ధభామినియును • బ్రేతధూమంబును, బ్రతుకు దఱుఁగు నంద్రు • ప్రాజ్ఞు లెల్ల.

క. వృద్ధునకు యువతి విష మగు, వృద్ధసతికి యువజనుండు • వెలయఁగ సుధ యా
సిద్ధ మని కొంద ఱప్పుడు, వృద్ధాగౌతముల కెగ్గు • లెన్నిరి పలుచన్. 163

వ. అని పలుకుచుం గృతాతిథ్యులై సమస్తమహర్షివరులును యథేచ్ఛాగతులం జనుచుం
డిరి తద్వచనంబు లాకర్ణించి యాదంపతు లత్యంతశోకవ్యాకులస్వాంతులై యంత
నచ్చటం దరలి చనుదెంచి. 164

ఉ. కారుమొసళ్లగుంపు తరఁగ ల్దివిఁ ద్రమ్మెడుపొంపు, గండుమీల్
మీఱి నటించుసొంపు రవళింపు జలపక్షులు గేరుమంపు, లోఁ
దారఁధులీకుళీరఫణి•దర్దురకోటుల పెంపు దద్దయై

వారఁ జెలంగి పొంగెడు • వాంనిధిఁ గన్గొని గవ్యధూవరుల్. 165

సీ. వృద్ధాంగనకు యువ • ప్రియుఁ డబ్బెఁ బో • కాని, నగియెడులీల ఫే • నములు గ్రాల
నజుచెయ్వు లిట్టె పో • యని తద్ద ఘూర్ణిల్లు, జాడల నిబిడ ఘో • షములు మీఱ
మునిదంపతులఁ గరం • బులు చాఁచి డాయంగఁ, బిలుచుచందమున వీ • చులు దనర్పఁ
దగువారి కర్ఘ్యపా • ద్యము లిచ్చువడువున, శీకరా సారము • ల్చిందుచుండ
తే. వినయగతి వారలకు నెమ్మి • విశ్రమింపఁ
బీఠము ల్వెట్టుచాడ్పునఁ • బృథులసైక
తములు రాణింప సొంపునఁ • దనరుచున్న
యప్పయోరాశిఁ దఱిసి ర • య్యార్యలఘుమతులు. 166

సీ. ఘనులఁ బ్రహ్లాద్ణజీ • వనులఁ జేయువదాన్యుఁ, డవిగతామితబాడ • బాశ్రయుండు
తవిలినమర్యాద • దాఁటకుండుఘనుండు, బహుతరవాహినీ • పరివృతుండు
ధీవరకోటి కం • ధీన వరాధన్యుండు, సదమలగాంభీర్య • సంయుతుండు
సరసపురోహిత • సమితి కాకరసీమ, భువనాంతరవ్యాప్త • భూరికీర్తి
తే. యహిమకరధాముఁ డసదృశో • దగ్రరత్న
కంకణమహోర్మికోద్భాసి • కవిహితుండు
నగరసాధీశుఁ డెంతయు • నబ్బురంపు
సంతసమ్మొనర్చె నప్పు డాజంపతులకు. 167

వ. అట్లు సముద్రదర్శనం బొనర్చి యుప్పొంగుచు. 168

మ. “దళితాశేషమహాంహసే ఘనపయో • ధామ్నే సముద్రాయ తై
వలినీమండలనాయకాయ వరుణా • వాసాయ పద్మాలయా
లలనేశశ్వశురాయ పుణ్యనిధయే • లావణ్యపూర్ణాయ ని
ష్కలగాంభీర్యయుతాయ తే నమః” యటం • చు న్మ్రొక్కి రామోదంబునన్. 169

తే. అవ్వధూవరు లందుఁ గృ • తావగాహు, లై రయంబునఁ జని యగ • స్త్యాశ్రమంబు
చేరి యమ్మునినాథు దర్శించి రపుడు, గౌతముం డాయనకు మ్రొక్కి • కడఁకఁ బలికె.

తే. మునికులోత్తమ భువి భుక్తి • ముక్తిదంబు, నఖిలవాంఛాప్రదంబు నై • నట్టిపుణ్య
తీర్థ మెయ్యది నాడెంపు • దేశ మెద్ది, తేటతెల్లంబుగా మాకుఁ • దెలుపవలయు.

క. అని ప్రార్థించిన గౌతముఁ, గనుఁగొని నెయ్యంబుతో న • గస్త్యుఁడు వలికెన్
మునివర గౌతమి యఖిలవృ, జినములు దొలఁగించు నిష్ట • సిద్ధియుఁ జేయున్. 172

తే. ధరణి నెన్నికఁ గన్నతీ • ర్థముల కెల్ల, మిన్న యై గౌతమీగంగ • వన్నె కెక్కె

నయ్యశేషాఘహారిణి • యందు మునుఁగు, జనుల కిహపరసుఖములు • సంఘటిల్లు. 173

క. కావున నీ విపు డచటికి, వేవేగం జనుము వేడ్క • వెలయఁగ నేను
న్నీ వెంటనె వచ్చెద నని, యావిమలాత్మకుఁడు నగలి • యరుదెంచె వెసన్. 174

తే. గౌతముండును భాగ్యాస • మేతుఁ డగుచు, గౌతమికి నేగి యందలి • గాఢనిష్ఠఁ
దప మొనర్చుచు నొకనాఁడు • దచిలి యీశ్వ, రాచ్యుతుల నమ్మహానది • నభినుతించె

క. పురదానవమదహరణా, హరిహయనుతచరణ • రాజతాచలశరణా
చిరకరుణాభరణా కి, న్నరపరివృఢశరణ నీకు • నతి శశిభరణా. 176

సీ. రవిశశిశిఖినేత్ర • భువనరక్షణసూత్ర, పాలితమునిపుత్రి • ప్రధనజైత్ర
విజితశాత్రవగోత్ర • కుజనద్రుకరపత్ర, భవలశోగ్రలవిత్ర • ధవళగాత్ర
దివిజోపవనచైత్ర • కవిజనస్తుతిపాత్ర, ఘనతరవృషపత్ర • ధనదమిత్ర
నిలయితసితగోత్ర • నిభృతచతుశ్శ్రోత్ర, పరమపవిత్ర బం • ధురచరిత్ర

తే. పంకరుహపత్రలోచన • కంకపత్ర, వ్యాజసంసారసాగర • యానపాత్ర
వృజినసంఘాతకానన • వీతిహోత్ర, నినుఁ బొగడ నేర్తుమే భవా • నీకళత్ర. 177

వ. అని మహేశ్వరుం బ్రణుతించి. 178

దండకము. శ్రీమజ్జగన్నాథ లక్ష్మీమనోనాథ గాధేయకౌండిన్యశాండిల్యమాండవ్యవల్మీ
కజవ్యాసవాసిష్ఠగర్గాద్యశేషర్షిసంఘాతసంస్తూయమానస్థిరోదారచారిత్ర దూరీకృతా
మిత్ర మిత్రేందువేధోమరుత్వజ్జలాధీశకీనాశదైత్యేశవాతార్థపేశానలాహీశముఖ్యాఖి
లామర్త్యకోటీ రవిస్ఫారతేజోవిరాజన్మహారత్నకాంతిచ్ఛటాజస్రనీరాజితోద్యత్ప
దాంభోజ భోజావనీజానిజానిర్మలస్వాంతనీరేరుహాంతర్విలీనప్రమత్తద్విరేఫా ఘనా
భా సరోజాతనాభా శరచ్చంద్రికాకుందబృందారకాహారమందాకినీహారనీహారహీ
రేందుకోటీరసాటీరవాక్కామినీకాశనీకాశకీర్తిప్రకాశా నిరీశా హరీ శార్ఙ్గపాణీ కృ
పాణీ కృపానీరధీ సారథీ ధీరగాండీవభృత్స్యందనీ భూరిధర్మైకనిష్ఠాగరిష్ఠామితోత్కృ
ష్టసృష్టిప్రజాభీష్టసంధాయకా విశ్వవిశ్వంభరానాయకా విశ్రుతానంతనీరేజగర్భాం
డభాండావళీ పూరితోద్యత్ప్రచండారివక్షఃకులాధ్యక్షదుర్గర్వనిర్వాపణాఖర్వభీమ
ప్రభావాభిరామా జగద్గీతనామా పదాంగుష్ఠనిష్ఠ్యూతగంగాంతరంగాంబుధారాలవా
సేచనక్షాళితబ్రహ్మహత్యాముఖక్రూరపాపా ప్రశస్తానులాపా నిరస్తోపతాపా పర
బ్రహ్మరూపా సమిద్ఘోరకోపా సుధాలాప నీలాపరీరంభసంభోగకేలీవిహారాభిరామితో
ల్లాసలీలాసమాగోలగోపాలలీలావతీబంధురోరోజకుంభద్వయీలిప్తకస్తూరికాసాంక
పాపాదసంవాసితోదారదోరంతరాళా మహాభీమసంగ్రామసీమాకరాళా విపశ్చి

స్మరసస్మారకాసారమాద్యన్మరాళా విరాడ్దివ్యఖేంఖోళకాళిందికాతీరవానీరకుంజద్రు మాగారమధ్యోల్లసత్పుష్పశయ్యాతలాబాధ రాధావధూసంతతాస్తోక నాళీక నాళీకకేళీకళాకౌశలామోద దామోదరా పుండరీకాక్ష వైకుంఠ శౌరీ నరాహార గాంగేయరుక్మాంగదానేక పేంద్రాంబరీషాంజనేయప్రభృత్యంఘ్రిభక్తావనోపాయపాఠీణ నారాయణా వాసుదేవా చిదానంద గోవింద బృందావనాంతర్విహారా నృసింహా హృషీకేశ హేమాంబరా దేవదేవా మహాదేవ నీదివ్యలీలావినోదప్రకారంబు లెన్నంగ నెవ్వారికిం దీరు ధీరాత్ము లై యోగమాంతార్థవిజ్ఞాను లై జ్ఞానవైరాగ్యసంపన్ను లై నిర్గుణత్వంబునం బోల్చుయోగు ల్పృథివ్యంబుతేజోనిలవ్యోమమయం బై చరస్థావరం బైనసర్వప్రపంచంబు నీమూర్తిగా నాత్మ భావించి నిన్నెంతు రష్టాపదం బొక్కడై యుండి నానాపరిష్కారరూపంబులం బొల్చుపోల్కెన్ బరేశుండ వొక్కండవై యుండి నీ వెల్లరూపంబులం దాల్చి వర్తింతు వో సామి నీ కగ్ని వక్త్రంబు తారాపథం బుత్తమాంగంబు దిక్కుల్ చెవుల్ భాను జైవాతృకుల్ నేత్రము ల్తోయధుల్ కుక్షి నాకంబు కంఠంబు వేదంబు లుక్తుల్ ధరిత్రీతలం బంఘ్రియుగ్మంబు గా రాత్రి కీల్గంటు వైవస్వతుం డాత్మ యోగీశ్వరుల్ రోమము ల్గంధవాహుండు ఘ్రాణంబు బృందారకు ల్బాహువు ల్భారతీదేవి దా జిహ్వ యుం గా జగద్రూపి వై యేపు గోడం బ్రదీపింతు వౌ నీవ యంభోజగర్భాచ్యుతేశాకృతు ల్దాల్చి శశ్వద్గతి న్విశ్వసృష్టిస్థితిధ్వంసక్రీడల నిమ్ముల దౌ వెండియు న్దుష్టసంహారశిష్టావనార్థం బనేకాకృతు ల్పూని భాణింతు వాది న్విసారంబ వై యంబురాశిం బ్రవేశించి క్రూరాత్ముఁ డౌ సోమకుం ద్రుంచి వేదంబు లవ్వేధ కొప్పింపవా కూర్మరూపంబుతో నేపునన్ మందరోర్వీధ్రముం బూని జేజేల నెల్ల న్సుధాహారసంతుష్టిఁ దేలింపవా సూకరాకారముం బూని యక్షీణశౌర్యప్రభాదక్షు హేమాక్షు శిక్షించి ధాత్రీతలం బెల్ల దంష్ట్రాగ్రభాగంబునం దాల్పవా మర్త్యపారీంద్రదేహుండ వై స్వర్ణదైతేయు నిర్జించి ప్రహ్లాదుఁ బాలింపవా వర్ణి వై తూర్ణ మంఘ్రిత్రయం బుర్వి యర్థించి వైరోచనుం గ్రిందికి న్మెట్టవా భృగ్వధీశుండ వై గండ్రగొడ్డంట ముయ్యేడుమాఱు ల్నరాధీశులం గొట్టవా జానకీభర్త వై ఘోరదుర్వర్తనుం డైన యప్పంక్తికంఠాసురేంద్రు న్సమిద్భూమిఁ బోకార్చవా శీరి వై హాళి మీఱం బ్రలంబాదులం ద్రుంపవా బుద్ధరూపంబుచే దైత్యనారీకదంబంబుల న్బన్న మొందింపవా సాది వై మ్లేచ్ఛరాజన్యుల న్మ్రొదుచు న్సాధులం బ్రోవ నున్నావు నీవర్తనం బెల్ల లెక్కింప మాబోంట్ల కెంతే నశక్యం బె నిన్ను న్బ్రశస్తేంద్రనీలోపలద్విట్ప్రతీకాశసమ్యక్తురుం

బోపరిస్నిగ్ధమాణిక్యరోచిశ్ఛటాంచత్కిరీటోత్తమాంగుఁడు సుధాకీర్ణరాకానిశాకేతు
బింబోపమస్మేరవక్త్రారవిందు న్ముకుందు న్మనోజాతలీలాధనుస్సన్నిభభ్రూలతా
భాసురుం గృత్తదంభాసురుం బ్రాతరారంభవేళాసముజ్జృంభమాణారుణాంశుప్రభా
జాలనిర్భిన్నశుభ్రాబ్జసంవర్తికాచారునేత్రు న్సుబద్ధస్తోత్రపాత్రు న్నలీనాగ్రచాంపేయ
బాలాభిరామస్వనాసు న్నగత్కౌముదీమందహాసు న్జపాబింబికాబంధుజీవప్రవాళా
బ్జరాగోపమానామృతాధారశోణాధరు న్శ్రీధరుం గుందబృందాచ్ఛదంతావళీభాస
మానుం బ్రభావాసమాను న్జ్వలత్కుండలస్థాపితానర్ఘ్యరత్నద్యుతిప్రోల్లసద్గండ
భాగు న్నతీన్ద్రానురాగు న్మణిగ్రైవకేయావళీవిస్ఫురత్కంబుకంఠు న్గదాశంఖచ
క్రాబ్జశార్ఙ్గాయుధోపేతదిక్కుంభికుండాసదృక్పీనవృత్తాయతాజానుబాహు న్విహం
గేంద్రవాహు న్రమాకౌస్తుభాస్తోకముక్తామణీధామకాలంకృతోత్తుంగబాహాంతరా
ళుం గృపాళుం గళిందాత్మజాభంగరంగత్త్రిభంగు న్మదారాతిభంగు న్గరుత్మచ్ఛిలా
బద్ధభర్మోర్మికాకంకణాలంకృతస్నిగ్ధహస్తాంబుజాతు న్జగన్మోహనాకారరేఖాప
రాభూతపాఠీనకేతు న్సముద్దామసౌదామనీదామశంకాకరస్వర్ణచేలావృతోద్యత్క
టీకు న్మునీంద్రాత్తచేతోంబురుట్కర్ణికాంతఃకుటీకు న్హలాంభోజశంఖధ్వజానీకక
ల్యాణరేఖావృతాంచత్పదున్ శ్రీప్రదున్ హృత్పయోజాతమధ్యంబున న్నిల్పి సే
వింతు మత్యాదరం బొప్ప మమ్మేలు మీశా నమస్తే నమస్తే నమస్తే నమః. 179

వ. అని శ్రీమన్నారాయణుం గొనియాడి 180

క. శరణొందెద నిను గంగా, పరిపూర్ణకృపాంతరంగ • భవ్యతరంగా
గిరిశజటాంతరసంగా, పరిచితచక్రాంగ దురిత•పటలవిభంగా. 181

క. ఆదిత్యసుతఫణిసుర, త్రిదానవసిద్ధసాధ్య•సుకనుతవిలస
త్పాదారవిందయుగళీ, గోదావరి నన్నుఁ బవిత్ర•ను జేయఁగదే. 182

తే. మగ్నమాతంగ మదజలో•న్మత్తభృంగ, యతిదయాపాంగ శంభుజ•టాగ్రరంగ
కలితశుభసంగ ఘోరదు•ష్కలుషభంగ, గౌతమీగంగ తరళత•రంగత్తరంగ. 183

తే. అని నుతించుమునీంద్రుని • కపుడు నిఖిల, భువనపావని పొడగట్టి • భూసురేంద్ర
మంత్రపూతంబులైనట్టి•మజ్జలముల, నీవధూమణిఁ దడుపుము • నియమ మొప్ప. 184

తే. అట్టులంగనఁ జారురూ•పాన్వితఁ జేయ, మగువచే నభిషిక్తుఁడ • వగుము నీవు
నిఖిలకల్యాణలక్షణా•న్వితుఁడ వగుచు, మరల రూపంబు దాల్చెదు•మహిమ మెఱయ.

తే. అనుచు గౌతమి కృపఁ బల్కి • నట్లు చేసి, దంపతులు శోభనాకార•సంపదల నె
సంగి రెంతయు గౌతమీ•సలిలసేచనమ్మున మానసములఁ బ్రమో•దము దలిర్ప. 186

తే. అప్పు డగస్త్యవసిష్ఠగ•ర్గాదిమునులు, ప్రేమ దైవాఱ వారలు • పెండ్లి సేయఁ
దలఁచి యొకదివ్యనగరంబు • తత్క్షణంబ, సొంపు దీపింప నచట ని•ర్మింపఁజేసి. 187

తే. చంద్రతారాబల ప్రశ•స్తముగఁ బొసఁగి
యిమ్మలయనొక్క శుభముహూ•ర్తమ్ము నిశ్చ
యించి పౌరులఁ బఱి యాల•రించుటకును
బూన్చుటయు వారు సంతసం•బునఁ జెలంగి. 188

సీ. గోడల నెల్ల గం•గనఁ జిత్తరులు వ్రాసి, ముంగిళ్ల ముత్యాల•ముగ్గు లునిచి
తోరంబు గాఁ బచ్చ•తోరణంబులు గట్టి, దరి లేని చలువపం•దిరులు వైచి
యంగళ్ల మేలుక•ట్లమరించి వేదిక, లలికి మేడలు మిద్దె • లలరఁ జేసి
కదళికాస్తంభము • ల్కనకకుంభంబులు, దల ద్వారంబులఁ • దగులుపఱచి
తే. యగురుఘనసారధూపము • లిమ్మగుల వైచి, సతులుఁ బురుషులు నతులితో•త్సాహలీల
గంధమాల్యాభరణవస్త్ర•కలితు లగుచు, నలరుచుండిరి కడుఁ దద•నంతరమున. 189

ఆ. సవిత హస్తమించె • సంజ కెంపుదలిర్చెఁ, దమము గ్రమ్మకొనియెఁ•దారలెసఁగెఁ
జంద్రుఁ డుదయ మయ్యెఁ•జంద్రిక ల్వెలసిల్లె, నప్పుడు మునులు మిగుల•హర్ష మొనర.

సీ. ఝల్లరీనిస్సాణ•శంఖభేరీకాహ, ళలు తూర్యములు ధరఁ • జెలఁగి మ్రోయ
బిలుసులుఁ జివ్వలు • బెడఁగుచంద్రజ్యోతు, లును నభం బెల్ల వె•లుంగఁ జేయ
ఘనమర్దలధ్వను • లెనయ నాడెఁపువార, రమణీమణులు న•ర్తనములు సలుప
జగ మంతయును బట్టు•పగలు గావించుచుఁ, గరదీపికాసము•త్కరము వఱల
తే. సకలనగరాంతరాగత•జనపరంప, రానిరంతరకలకలా•రవము దిగిభ
నివహకర్ణపుటంబులఁ • జెవుడుపఱుప, సదములానందకరమహో•త్సవము వెలయ.

వ. వివాహోచితకృత్యంబు లాచరింపఁ దీగ్వరు లైనపురంధ్రీభూసురోత్తముల నియో
గించుటయును. 192

తే. మిన్న యై యున్న యా రాచ•కన్నియకును, బుణ్యనిధి యగుభూసుర•పుంగవునకు
మంగళస్నాన మాచరిం•పఁగ నొనర్చి, చెలుపుఁ గొందఱు ముత్తైద•వలు గడంగి.

మ. వరరత్నాభరణావలుల్ దొడిగి సౌ•వర్ణాంబరంబుల్ హొయల్
బెరయం గట్టి పటీరచంద్రమృగనా•భీపంకము ల్మేనులన్
గర మొప్పార నలంది స్రగ్విసరముల్ • గాఢంబుగా వైచి వా
విరిఁ గైచేసిరి కాంత లావసుధా•విశ్వంభరాదేవులన్. 194

తే. అపుడు కల్యాణవేదిపై • నమల రత్న, పీఠమున విప్రుఁ గూర్చుండఁ•బెట్టి కాళ్లు

కడిగి మధుపర్కము లొసంగి • కన్యఁ దెచ్చి, రమణ నిర్విఘ్నతను గంక•ణములు గట్టి.

క. ఊడుపీథిఁ జూచి యాజను, లడరఁగ సుముహూర్తవేళ • యయ్యె నటంచున్
గుడజీరకములు శిరమున, నిడి కన్నియఁ జూపి రామ•హీదేవునకున్. 196

క. మునుకొని విప్రోత్తము లె, ల్లను గము లై పలికి రపుడు • లక్ష్మీనారా
యణ సావధాన యనుచుం, దనరఁగ సుముహూర్తసావ•ధాన యటంచున్. 197

మ. ఘనగంభీరవిరావసంకలితు లై • బ్రహ్మదేవతాముఖ్యు లె
ల్లను మోదంబున నవ్వధూవరులమో•లం గూటువ ల్గూడి డా
కొని "సర్వే మునయ స్సురాగ్రహాయుతాః • కుర్వంతు వా మ్మంగళ"
మ్మని లగ్నాష్టకము ల్పఠించిరి శుభో•దంచత్ప్రకారంబునన్. 198

క. కల్యాణపాత్రికల సా, కల్యముగ నివాళు లునిచి • గతితలు గౌరీ
కల్యాణంబులు వాడిరి, కల్యాంచితమాధురీప్ర•కారము వెలయన్. 199

ఉ. పల్లవపాటలాధరశుభ•ప్రభ లొప్పఁగ మేల్పయంటలన్
బెల్లుగ గుబ్బచన్గవలు • పెంపెసలాడఁ గడిందివేడుకల్
మొల్లము మీఱఁ గ్రొత్తతెలి•ముత్తియపుఁబ్రతంపు సేసఁబ్రాల్
చల్లుచుఁ బేరఁటాండ్రు ధవ•ళంబులు వాడిరి కొంద ఱయ్యెడన్. 200

శా. ఆరాజన్యకుమారికంఠమున గో•త్రాదిత్యవర్యుండు సొం
పార న్మంగళసూత్ర మప్పుడు నితాం•తామోది యై కట్టి వి
స్తారోత్కంఠత నాగమోక్తికము వా•చాప్రౌఢి మీఱన్ "ధ్రువం
తే రాజా వరుణో ధ్రువ" మ్మనుచు ధా•త్రీనిర్జరు ల్వల్కఁగన్. 201

క. లలనాలలామశిరమున, వలనుగ భూసురవరుండు • వసుధామరు సా
దలఁ గలకంఠియు ముత్యపుఁ, దలఁబ్రా లొప్పిసిరి ముదంబు • దళుకొత్తంగన్. 202

తే. అంతరిక్షంబునం దిల • నఖిలజనులు, సొరిదితోడ నరుంధతిఁ • జూచుచుండు
రప్పు డచటనె చెలఁగి జా•యాపతుల క, రుంధతిని జూపి రొజ్జయల్ •రూఢి మీఱ.

వ. మఱియు నగ్నిప్రతిష్ఠాపనాదివిధు లాగమోక్తప్రకారంబునం గావింపుచుఁ గ్రమం
బునఁ జనఁ బంచవాసరంబులు గడపి యున్న యాదంపతుల దీవించి యగస్త్యాదిమ
హర్షులు యథాస్థానంబులకుం జని రంత. 204

క. అతిభోగభాగ్యమహిమా, న్వితు లై యతిథులను నిచ్చ•నిచ్చలు గరుణా
మతిఁ బ్రోచుచు నద్దంపతు, లతులప్రాభవనిరూఢి • నలరిరి ధాత్రిన్. 205

క. అని కమలజాతుఁ డృతుధ్వజ, జనపాలకచరిత దివిజసంయమి కెలమిన్